# మన సంస్కృతి మూఢాచారమా?

## క్రోవి రమాదేవి

ప్రథమ ముద్రణ : 2018

ప్రతులు : 2000



**వెల : రూ. 45-00**

ప్రతులకు :

1. **డా॥ క్రోవి పార్థసారథి**
   23-11/1-10/2, దేవీ నిలయం,
   ఓగిరాలవారి వీధి, సత్యన్నారాయణపురం,
   విజయవాడ - 11. సెల్ : 9866820574

2. **శివకామేశ్వరి గ్రంథమాల**
   41-22/4-36, భ్రమరాంబాపురం,
   కృష్ణలంక, విజయవాడ-520 013.
   ఫోన్ : 0866-2522824

3. **శివకామేశ్వరి ఆర్ష గ్రంథమాల**
   27-18-59, కాంగ్రెస్ ఆఫీస్ రోడ్డు,
   గవర్నర్‌పేట, విజయవాడ-520 002.
   ఫోన్ : 0866-6661777

ముద్రణ :
నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
గాంధీనగర్, విజయవాడ-3.

# రమాదేవి గారి గురించి

శ్రీమతి రమాదేవి గారు గుంటూరుజిల్లా బాపట్లలో కౌసికస గోత్రీకులు బ్రాII శ్రీ **వారణాసి రమాకాంత శర్మ, శ్రీమతి అన్నపూర్ణమ్మ** దంపతులకు 25-10-1952న జన్మించారు. వీరి తాతగారు **శ్రీ వారణాసి గోపాలకృష్ణయ్య** గారు ఒంగోలులో ఉపాధ్యాయుడిగా పనిచేశారు. వారి భార్య శ్రీమతి **మీనాక్షమ్మ** గారు. వీరికి ఇద్దరు సంతానం.

1. **శ్రీవారణాసి రమాకాంత శర్మ** గారు. కొంత కాలం ఒంగోలులో పనిచేసి, ఆ తరువాత గుంటూరులోని హిందూ హైస్కూల్‌లో ఇంగ్లీష్ టీచరుగా పని చేశారు.
2. **శ్రీమతి పిల్లుట్ల సరోజిని** గారు. భర్త **రాధాకృష్ణ మూర్తి** గారు. వీరు తెనాలిలోని తాలూకా హైస్కూలులో ఉపాధ్యాయుడిగా పనిచేసి 2018 ఫిబ్రవరిలో పరమపదించారు.

శ్రీరమాకాంత శర్మ గారికి ముగ్గురు సంతానం.

**1.శ్రీమతి క్రోవి రమాదేవి, భర్త పార్థసారథి**

పార్థసారథి గారు అనేక సన్మానాలు, సత్కారాలు పొందిన వ్యక్తి. మైసూరు దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు. వీరు 48 ఆధ్యాత్మిక గ్రంథాలు వ్రాశారు. 2000 గంII ఉపన్యాసాలు సి.డి.ల రూపంలో ఇచ్చారు. ఇప్పటి వరకు వీరు 21 ప్రపంచ రికార్డులు సాధించారు. ప్రతిరోజు వీరి ఇంట్లో హోమం జరుగుతుంటుంది.

**2. శ్రీ వారణాసి వెంకట శ్రీధర్ భార్య శ్రీమతి మాధవి**

శ్రీ వెంకట శ్రీధర్ Bank of India లో Manager కాగా

శ్రీమతి మాధవి Andhra Bank లో Manager

వీరి కుమారుడు రమా **నాగసాయి శ్రీకాంత్** అమెరికాలో పని చేస్తున్నారు.

వీరి కుమార్తె శ్రీమతి గాదె శ్రీవిద్య భర్త తేజశ్వి (USA)

ప్రఖ్యాత కథా రచయిత, నాటక రచయిత

**శ్రీ జొన్నలగడ్డ సదాశివరావు గారు శ్రీమతి మాధవి గారి తండ్రిగారు**

హైదరాబాద్‌లో 20 బ్రాంచీలతో నడుస్తున్న **స్వరభంగిమ అకాడమీ,** సంప్రదాయ సంగీత నృత్య కళాశాలలను నిర్వహిస్తున్న నటశిరోమణి **శ్రీ జొన్నలగడ్డ ఈశ్వర ప్రసాద్** గారు శ్రీమతి మాధవి గారి మేనమామ గారు

**3. శ్రీ వారణాసి మురళీకృష్ణ భార్య హిమబిందు**

మురళీకృష్ణ గారు BULL MACHINES PVT. LTD. లో బిజినెస్ డెవలప్‌మెంట్ మేనేజరుగా పని చేస్తున్నారు. వీరి కుమారుడు **అక్షజ్.** ప్రముఖ వైద్యులు **సందెపూడి వెంకట సుబ్బారావు** గారు శ్రీమతి హిమబిందు తండ్రిగారు.

మద్రాసులోని HCL General Manager శ్రీ **సందెపూడి వేణుగోపాల్** గారు హిమబిందు అన్నగారు.

గుంటూరు జిల్లా బాపట్ల వాస్తవ్యులు శ్రీ **పిల్లుట్ల వెంకట సుబ్బయ్య** గారు. వీరి భార్య శ్రీమతి **అమ్మన్నమ్మ** గారు. వీరికి ఐదుగురు సంతానం.

1. శ్రీమతి **గండికోట లక్ష్మీనరసమ్మ** గారు. భర్త **ఆదిశేషగిరి రావు** గారు వీరి కుమారుడే ప్రముఖ పారిశ్రామికవేత్త **గండికోట రఘురామశర్మ** గారు

2. శ్రీమతి **వారణాసి అన్నపూర్ణమ్మ** గారు. భర్త **శ్రీ రమాకాంతశర్మ** గారు వీరి కుమార్తె రమాదేవి.

4. శ్రీమతి **పెద్దిబొట్ల హనుమాయమ్మ** గారు. భర్త **శ్రీ సుబ్బరామయ్య** గారు విజయవాడ లయోలా కాలేజిలో తెలుగు అధ్యాపకులు.

ప్రముఖ కథా రచయిత, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత

3. శ్రీ **పిల్లుట్ల చిరంజీవి శర్మ**గారు భార్య శ్రీమతి **లక్ష్మి**గారు, శర్మగారు ఆంధ్రప్రదేశ్ ఎగ్రికల్చరల్ డిపార్ట్‌మెంటులో డిప్యూటీ డైరెక్టరుగా పదవీ విరమణ చేశారు.

5. శ్రీ **పిల్లుట్ల శివానధాని** గారు. భార్య శ్రీమతి **విజయశ్రీ** గారు. వీరు ఇండియన్ రైల్వేస్‌లో పని చేశారు.

కృష్ణాజిల్లా మచిలీపట్టణం వాస్తవ్యులు శ్రీ క్రోవి **పురుషోత్తమ శర్మ,** శ్రీమతి **లక్ష్మీ నరసమ్మ** దంపతుల ఏకైక కుమారుడు **శ్రీ క్రోవి కృష్ణమూర్తి** గారు. భార్య సత్యపర్వత వర్ధనమ్మ గారు. వీరికి ముగ్గురు కుమారులు ఇద్దరు కుమార్తెలు.

**1. డా॥ క్రోవి పార్థసారథి గారు - భార్య రమాదేవి** వీరికి ఇద్దరు కుమార్తెలు.

శ్రీమతి **గునుపూడి శైలజ.** భర్త డా॥ **పవన్ కుమార్** కెనడాలోని యూనివర్శిటీలో ప్రొఫెసరు వీరి కుమార్తెలు.

**1. ధాత్రి 2. మైత్రి 3. కీర్తి**

2. శ్రీమతి **రాపాక మంజూష** భర్త శ్రీ **సత్య శ్రీధర్.** ఆస్ట్రేలియా న్యూజిలాండ్ బ్యాంకులో సీనియర్ టెక్నాలజీ మేనేజరుగా బెంగుళూర్‌లో పని చేస్తున్నారు.

వీరి కుమార్తె **అన్విక.**

శ్రీధర్ గారి తండ్రి గారు **శ్రీ రాపాక అప్పారావు** గారు దేశ విదేశాల్లో అనేకచోట్ల కెమికల్ ఇంజనీరుగా సేవలందించారు.

**3. కుమారుడు కృష్ణకాంత శర్మ**

2. **శ్రీ క్రోవి రామారావు** భార్య శ్రీమతి **భారతలక్ష్మి.** భారతలక్ష్మి గారు హోమియోపతి రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో సైంటిష్టుగా పని చేశారు.

వీరికి ఇద్దరు కుమార్తెలు.

శ్రీమతి **రాయప్రోలు ప్రియాంక** - భర్త శ్రావాస్య

2. కుమారి శ్వేత

3. లేటు **విజయకుమార్** భార్య శ్రీమతి **పద్మ** వీరి కుమారుడు **కృష్ణచైతన్య,** సి.ఎ., కాగా కుమార్తె **బిందుమాధవి**, బి.టెక్

**శ్రీ క్రోవి కృష్ణమూర్తి గారికి ఇద్దరు కుమార్తెలు**

1. **శ్రీమతి గునుపూడి గిరిజకుమారి** భర్త **నాగేశ్వరరావు**. శ్రీమతి గిరిజ కుమారి గారు దేవాదాయ శాఖలో డిప్యూటీ కమిషనరుగా, శ్రీ నాగేశ్వరరావు గారు హైదరాబాద్ వాటర్ వర్క్సులో ఫైనాన్షియల్ డైరెక్టరుగా పనిచేశారు.

వీరి కుమారుడు డా॥ **పవన్ కుమార్. రమాదేవి** గారి పెద్దల్లుడు శ్రీమతి **శైలజ**గారి భర్త

2. శ్రీమతి **కూనపులి శారద** భర్త లేటు **భాస్కరు**.

**ప్రఖ్యాత క్రిమినల్ లాయర్ శ్రీమతి లక్ష్మీగాయత్రి మా అభిమాన పుత్రిక**

శ్రీమతి రమాదేవి గారు ఐదవ తరగతి వరకు ఒంగోలులో చదువుకుని ఆ తరువాత గుంటూరు వచ్చారు. Govt. Womens' College లో BA పూర్తి చేసి, గుంటూరు నల్లపాడులోని PG Centre లో MA తెలుగు చేసి, గుంటూరులోనే B.Ed., కూడా పూర్తి చేశారు. ఆ తరువాత Andhra Girls School, Guttala Bazar, Khammam లో తెలుగు HOD గా కొంత కాలం పనిచేసి 1980 జూన్‌లో **వీరమాచనేని పద్దయ్య సిద్ధార్థ పబ్లిక్ స్కూల్‌లో** తెలుగు శాఖాధ్యక్షులుగా 27 సం॥ పనిచేసి 31-8-2007 న పదవీ విరమణ చేశారు. పని చేసే రోజుల్లో అంకిత భావం గల ఉపాధ్యాయినిగా పేరు తెచ్చుకున్నారు. All India Level లో వీరి విద్యార్థులకు నాలుగుసార్లు I Rank వచ్చింది. స్కూలులో పని చేసేటప్పుడు House Master గా చాలాకాలం బాధ్యతలు నిర్వహించారు. అనేకమంది విద్యార్థులను వివిధ పోటీలకు తయారుచేశారు.

రమాదేవి గారు సహనశీలి. మృధుస్వభావి. ఎంత ఇబ్బంది కలిగినా ముఖాన చిరునవ్వు చెరిగేది కాదు. ఎదుటివారి కష్టాలను ఓపికగా విని, వారికి సలహా లిస్తుండే వారు. ఎంతటి కష్టమైనా కూర్చుని మాట్లాడుకుంటే పరిష్కారం తప్పకుండా దొరుకుతుంది అని పూర్తిగా నమ్మిన వ్యక్తి.

తనకు హాని తలపెట్టిన వారిని కూడా ఏదో విధంగా మార్చుకుందామని చివరిదాకా ప్రయత్నంచేశారు కాని ఇద్దరి విషయంలో మాత్రం ఆ ప్రయత్నం ఫలించలేదు. దాంతోనే ఆవిడ ఆరోగ్యం బాగా క్షీణించింది.

సంప్రదాయాల మీద బాగా నమ్మకం ఉన్న వ్యక్తి. ఆ రోజుల్లో అప్పుడప్పుడు ఏవో కొన్ని వ్యాసాలు వ్రాసి అవన్నీ దాచిపెట్టారు. కొద్దిరోజుల క్రితం పుస్తకాలు సర్దుతుంటే ఆ కాగితాలు బయట పడ్డాయి. అవన్నీ తీసి పుస్తక రూపంలో అచ్చు వేస్తే బాగుందు అనిపించింది. వాటిని కొంచెం పరిష్కరించి ఇప్పుడు పుస్తక రూపంలోకి తెస్తున్నాను.

**మన సంప్రదాయాలు మూఢాచారాలు కావు** అనే విషయం అందరికీ తెలియాలని, వాటిని మనం గౌరవించాలనే ఉద్దేశ్యంతోనే ఈ పుస్తకం ప్రచురించటం జరుగుతోంది.

పాఠకులు ఈ పుస్తకాన్ని ఆదరిస్తారని భావిస్తూ

**క్రోవి పార్థసారథి**

25-10-2018

విళంబి నామ సంవత్సర

ఆశ్వీయుజ బహుళ పాడ్యమి

25-10-2018

# విషయ సూచిక

# 1. మన సంస్కృతి మూఢాచారమా?

'రామచంద్రా! వేదాలు భారతీయ సంస్కృతి ప్రతీక. ప్రాచీన విజ్ఞానానికి ప్రతీక. వేదాలలో అనేక విషయాలను చెప్పటం జరిగింది. వాటిని మనం తప్పనిసరిగా ఆచరించాలి' అన్నాడు వశిష్ఠ మహర్షి శ్రీరాముడితో. ఆ మాటలు విన్న రాముడు 'గురుదేవా! మీరు చెప్పింది నిజమే. కాని వేదంలో చెప్పిన విషయాలు ప్రామాణికాలో, కాదో పరిక్షించి చూడాలి కదా?' అంటూ అనుమానం వ్యక్తం చేశాడు.

'రామా ! ఇప్పటికి కొన్ని లక్షల సంవత్సరాల క్రితం చెప్పబడ్డాయి వేదాలు. అప్పటి నుంచి అనేకమంది వాటిని అభ్యసిస్తున్నారు. అందులో చెప్పిన విషయాలను ఆచరిస్తున్నారు. ఇప్పుడు నీకు వచ్చిన అనుమానం గతంలో చాలామందికి వచ్చింది. వారంతా దానిమీద అనేకసార్లు చర్చలు జరిపి, పరీక్షించి వేదం అత్యంత ప్రామాణికము అని నిగ్గు తేల్చారు. కాబట్టి అదే విషయంమీద మళ్ళీ మనం పరీక్షలు జరపటం తెలివితక్కువ. వేదంలో చెప్పిన విషయాలను యధాతథంగా మనం ఆచరించవచ్చు. ఇందులో సందేహం లేదు" అన్నాడు వశిష్ఠుడు.

మన సంస్కృతి, సంప్రదాయాలన్నీ వేదంలో చెప్పబడినవే. అవన్నీ శాస్త్రీయతతో కూడినవి. వాటి అర్థం మనకి పూర్తిగా తెలియకపోవచ్చు. మీరడిగే ప్రశ్నలు కొన్నింటికి నేను సమాధానం చెప్పలేకపోవచ్చు. అంత మాత్రం చేత వాటికి సమాధానం లేదు అని మాత్రం కాదు.

మనదేశ పరిస్థితులను బట్టి ప్రజలకు అర్థం అయ్యేలాగా కొన్ని ఆచారాలు ప్రవేశపెట్టారు. ప్రతి ఆచారం వెనుక శాస్త్రీయమైన కారణం ఒకటుంది. దాన్ని వివరించి చెబితే అర్థం చేసుకునే శక్తి అప్పటి వారికి లేదు. అందుకే 'ఇలా చెయ్యండి ఇలా చెయ్యరాదు' అని చెప్పేశారు.

నేను సమాధానం చెప్పలేకపోయాను కాబట్టి వాటిని మూఢనమ్మకాలు అనరాదు. ఆ పేరుతో మన సంస్కృతిని, సంప్రదాయాలను మనమే అపహాస్యం చెయ్యరాదు. దీనికి ఒక చిన్న ఉదాహరణ చూడండి.

ఒక తల్లి మన దేశంలో ఉంది. ఆవిడ కుమారుడు విదేశాల్లో ఉన్నాడు. కుమారుడికి వీడియో కాల్ చేసి తల్లి అడుగుతోంది. 'నాయనా ! పూజా పునస్కారాలు పూర్తి అయినాయా?' దానికి కుమారుడి సమాధానం చూడండి.

'అమ్మా ! నేను ఒక శాస్త్రవేత్తని అది కూడా అమెరికాలో జీవపరిణామాన్ని గురించి డార్విన్ ఏం చెప్పాడో తెలుసు కదా ! దాన్ని ప్రపంచం అంతా ఒప్పుకున్నది కదా ? మరి అలాంటప్పుడు నేను శాస్త్రవేత్తనై ఉండి పూజలు చేస్తే ఏం బాగుంటుంది చెప్పు?

ఆ మాటలు విన్న తల్లి చిరునవ్వు నవ్వి 'డార్విన్ సిద్ధాంతాన్ని నేను కూడా చదివానురా. అతను కనిపెట్టినవన్నీ మన పురాణాల్లో ఉన్నవే అంది.

'అవునా? నాకు తెలియదే!' అన్నాడు కొడుకు అపహాస్యంగా. నీకు అంత తెలుసుకోవాలని ఉంటే చెబుతాను విను నాన్నా! అంటూ చెప్పటం మొదలు పెట్టింది. నీకు శ్రీమహావిష్ణువు దశావతారాలు ఎత్తాడు అని తెలుసు కదా!

తెలుసు. దానికీ దీనికీ సంబంధం ఏమిటి?

సంబంధం ఉంది నాన్నా. నువ్వు, నీ డార్విన్ తెలుసుకోలేని విషయాలు కూడా ఉన్నాయి. జాగ్రత్తగా విను.

మొదటిది **మత్స్యావతారం**. చేప నీటిలో ఉంటుంది. అంటే సృష్టి అంతా నీటిలోంచే మొదలైంది.

రెండవది **కూర్మావతారం**. కూర్మము అంటే తాబేలు. ఇది నీటిలోను, నేలమీద కూడా తిరుగుతుంది. అంటే జలచరాల తరువాత ఉభయచరాలు వచ్చినాయన్న మాట.

మూడవది **వరహావతారం**. వరాహము అంటే పంది. ఇది పూర్తిగా భూచరము. అడవి జంతువు. ఉభయచరాల తరువాత అడవులలో తిరిగే జీవులు ఆవిర్భవించాయి. అప్పుడు ప్రపంచం అంతా అడవే.

నాల్గవది **నృసింహావతారం**. సగం మనిషి. సగం జంతువు. ఇక్కడ మార్పు వచ్చింది. ఇంత వరకు బుద్ధి వికసించని జీవులు (రాక్షసులు) మాత్రమే ఉన్నాయి. వీటికి యుక్తాయుక్త విచక్షణ లేదు. ఇప్పుడు బుద్ధి వికసించిన జీవులు ఆవిర్భవించటం మొదలైంది.

ఐదవది **వామనావతారం** పొట్టిగా ఉండే మనిషి. ఇతడు ఎంతో ఎత్తుకు ఎదిగిపోయాడు. జీవులు మొదటగా హోమో ఎరెక్ట్స్, హోమోసిపియన్స్ అని రెండు రకాలుగా ఉన్నారు. వారిలో హోమోసిపియన్స్ మనుషులుగా వృద్ధి చెందారు.

ఆరవది పరశురామావతారం. ఇతడు గండ్రగొడ్డలి పట్టుకుతిరిగేవాడు. దీనిబట్టి ఆదిమ మానవుడు వేటకు ఆయుధాలు తయారు చేసుకున్నాడని తెలుస్తుంది. అతడు అడవులు, కొండల యందు నివసించే వాడు. మహాకోపిష్టి. అతడిది పూర్తిగా ఆటవిక న్యాయము.

ఏడవ అవతారం **శ్రీరాముడు**. గౌరవ మర్యాదలు గల పురుషోత్తముడు. ఆలోచనాపరుడు. సమాజంలో నీతినియమాలు కట్టుబాట్లు కుటుంబ వ్యవస్థలను ఏర్పాటు చేసినవాడు.

ఎనిమిదవది **కృష్ణావతారం**. శ్రీకృష్ణుడు రాజనీతిజ్ఞుడు. మంచిపాలకుడు. ఎదుటి వారిని ప్రేమించే వ్యక్తి. ప్రేమను పంచేవాడు. సమాజ నియమాలుఏర్పరచి, వాటిలో ఆనందం ఎలా పొందాలో తెలిసినవాడు. ఈ విషయాన్ని సమాజానికి వివరించిన వాడు.

తొమ్మిదవ అవతారం **బుద్ధుడు**. సాధుస్వభావి. మనిషి తన విజ్ఞానాన్ని వెతుక్కోవాలని తెలియచేసినవాడు.

పదవ అవతారం **కల్కి**. ఇది రాబోయే అవతారం. ఇప్పటి వరకు వచ్చిన వాటికంటే విశిష్టమైన అవతారం. చాలా గొప్ప వ్యక్తి.

తల్లి చెప్పుకుంటూ పోతోంది. అతని దృష్టిలో తల్లి చదువు లేనిది. చదువు రానిది. కాని ఆమె విషయ పరిజ్ఞానం అనన్య సామాన్యం. ఒక్కసారిగా కళ్ళు వెంబడి నీళ్ళు తిరిగినాయి కొడుక్కి. హైందవ ధర్మంలోని పురాణాలు చెప్పిన విషయాలు పూర్తిగా అర్థమైనాయి.

మన వేదాలు, పురాణాలలో చెప్పిన విషయాలు ఏవీ కూడా అర్థం లేనివి కాదు. మన పూర్వీకులు ఎంతో శ్రమించి, జీవితాలను ధారపోసి మనకందించిన విజ్ఞానమది.

వంటలో వేసే పసుపు దగ్గర నుంచి వాకిట్లో వేసే ముగ్గుదాకా అన్నింటిలోను అంతులేని విజ్ఞానమున్నది.

15వ శతాబ్దంలో గెలిలియో టెలిస్కోపు కనిపెట్టిన తరువాత నవగ్రహాల సంగతి ప్రపంచానికి తెలిసింది. కాని కొన్నివేల సంవత్సరాల క్రిందటే మనవారు నవగ్రహాల గురించి చెప్పారు.

గురుత్వాకర్షణ సిద్ధాంతం న్యూటన్ కనుగొన్నాడు అంటున్నారు. కాని ప్రాచీన భారతీయ గ్రంథాలలో దీన్ని గురించి చెప్పటం జరిగింది.

రైట్‌సోదలు విమానం కనిపెట్టారు. కాని రామాయణ కాలంలోనే పుష్పక విమానం ఉందికదా ? అగస్త్య మహర్షి వ్రాసిన విమానశాస్త్రం కూడా ఉంది కదా?

టెస్ట్‌ట్యూబ్ బేబీ, కౌరవులు, ద్రోణాచార్యుడు వీరి జన్మలు అవే కదా? పసుపు చాలా రోగాలకు యాంటీ బయాటిక్. తులసి ఇల్లు వళ్ళు ఆరోగ్యంగా శుభ్రంగా ఉంచుతుంది. ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవునెయ్యి, గోమూత్రము ఇవన్నీ రోగనిరోధకాలు, ఆరోగ్య కారకాలు.

సామాన్యంగా చెట్లన్నీ పగటిపూట కార్బండయాక్సైడ్ పీల్చుకుని, ఆక్సిజను విడుదల చేస్తాయి. కాని రావిచెట్టు రాత్రిపూట ఆక్సిజను విడుదల చేస్తుంది. ఈ కారణం చేతనే రావిచెట్టును పూజిస్తారు. రావిచివుళ్ళు రక్తపోటును తగ్గిస్తాయి.

భారతీయ శాస్త్రాల్లో నిద్రపోయేటప్పుడు తలను ఉత్తర దిక్కుగా పెట్టి పడుకోరాదు అంటారు. దీనికి కారణం–భూమికి అయస్కాంత శక్తి ఉన్నట్లుగానే శరీరానికి కూడా అయస్కాంత శక్తి ఉన్నది. ఉత్తర దిశగా తలపెట్టి పడుకుంటే శరీరంలోని ఐరన్ మెదడుకు చేరి బి.పి., గుండె జబ్బులు వస్తాయి. తలనొప్పి, అల్జీమర్స్ వంటి వ్యాధులు కూడా వస్తాయి. అందుకే తలను ఉత్తరదిశగా పెట్టి పడుకోరాదు అన్నారు.

ఇంకో విచిత్రమైన విషయం ఏమంటే, ఎదుటివారికి రెండు చేతులతో నమస్కరిస్తే, వారికి ఎప్పటికీ మనం గుర్తుండి పోతామట. రెండు చేతులు

కలిపినప్పుడు చేతివ్రేళ్ళు కలిపి ఆక్యుప్రెషర్ వైద్యం జరిగి జ్ఞాపకశక్తి పెరుగుతుంది. దీనితో మెదడు పనితీరు కూడా బాగా పెరుగుతుంది.

నేలమీద కూర్చుంటే పద్మాసనం భంగిమ వస్తుంది. దాంతో జీర్ణప్రక్రియ పెరుగుతుంది. అందుకే నేలమీద కూర్చుని భోజనం చెయ్యాలి.

భోజనం చేసేటప్పుడు ముందుగా కారపు పదార్థాలు తింటే జీర్ణప్రక్రియకు అవసరమైన ఆమ్లాలు ఎక్కువగా ఉత్పత్తి అయి జీర్ణప్రక్రియ సక్రమంగా జరుగుతుంది. అదే మొదట్లో తీపి పదార్థాలు తింటే జీర్ణప్రక్రియ సక్రమంగా జరగదు.

రాగిపాత్రలో నీరు శరీరానికి ఆరోగ్యం. ఈ మాట అందరికీ తెలుసు. అందుకే నదుల్లో రాగి నాణేలు వేస్తే, ఆ నీరు శుభ్రమయి ఆరోగ్యవంతమవుతుంది. అందుకే నదిలో రాగి నాణేలు వేసేవారు. ఇవాల్టికీ ఈ ఆచారాన్ని పాటిస్తున్నారు. కాని మనం వేసేవి అల్యూమినియం నాణేలు దీనివల్ల ఉపయోగం లేదు.

ఆయుర్వేదం ప్రకారం ఉపవాసం చాలామంచిది. ఉపవాస సమయంలో జీర్ణప్రక్రియకు విశ్రాంతి లభించి జీర్ణం కాని పదార్థాలు, విషపదార్థాలు బయటకు వెళ్ళగొట్టబడతాయి.

ఈ రకంగా చెప్పుకుంటూ పోతే మనం ఆచరించేవన్నీ విజ్ఞానపరమైనవే. ఈ విషయం తెలియకుండానే వాటిని మనం ఆచరిస్తున్నాం.

మన పురాణాలలోని విషయాలు కాని, సంప్రదాయాలు కాని, ఆచార వ్యవహారాలు కాని అన్నీ సైన్సుపరంగానే చెప్పబడ్డాయి. వాటిని మనం నిరభ్యంతరంగా ఆచరించవచ్చు. అవి మూఢనమ్మకాలు కాదు. జాతికి మన పెద్దలు అందించిన వరాలు అని గుర్తించండి. వాటిని ఎప్పుడూ అపహాస్యం చెయ్యకండి.

## ౨. భగవంతుడు భక్తసులభుడు

భక్తి అంటే తత్పరత, ఆరాధన, సేవ అమితమైన ఇష్టము అని అర్థం. ఒకరంటే ఒకరికి విపరీతమైన ఇష్టం. ఇది భగవంతుడి పట్లే కాదు మానవుల యందు కూడా ఉంటుంది. అది మాటలతో చెప్పేది కాదు. ఒకరు లేకపోతే రెండవ వారు ఉండరు. తన ప్రాణమిత్రుడు, ఇష్టసఖి మరణించారు అనే వార్త వినగానే తనుకూడా అసువులు బాసిన సంఘటనలు చాలా ఉన్నాయి. ఇది మానవుల మధ్య ఉంటే అమితమైన ఇష్టము, వ్యామోహము అంటారు. భగవంతుని యందు ఉంటే భక్తి అంటారు.

భక్తి తొమ్మిది విధాలుగా ఉంటుంది.

**శ్రవణం కీర్తనం విష్ణోస్మరణం పాదసేవనమ్ ।**
**అర్చనం వందనం దాస్యం సఖ్యం ఆత్మనివేదనమ్ ॥**

ఈ విషయాన్ని శ్రీమద్భాగవతంలోని ప్రహ్లాదచరిత్రలో వివరించటం జరిగింది. అలాగే అధ్యాత్మ రామాయణంలో శ్రీరాముడు శబరికి చెబుతాడు.

**పుంస్త్వే స్త్రీ స్త్వేవా జాతి నామాశ్రమాదయః ।**
**న కారణం మద్భజనే భక్తిరేవహి కారణమ్ ॥**

ఓ శబరీ నన్ను భజించటానికి జాతి, కులము, మతము, ఆశ్రమము, లింగభేదాలు లేవు. కావలసింది కేవలము భక్తి మాత్రమే.

ఇందులోనూ అనన్యమైన భక్తి గలవారు కృతకృత్యులవుతారు. ఒక యధార్థ సంఘటన. ఒకసారి భార్యాభర్తలు ఓడలో ప్రయాణం చేస్తున్నారు. వారిద్దరికీ ఒకరి మీద ఒకరికి విపరీతమైన అనురాగం. త్రోవలో ప్రమాదవశాత్తు ఓడ పగిలిపోయింది. అందులో ప్రయాణం చేస్తున్న వారిలో కొందరు సముద్రంలో మునిగి మరణించారు. అయితే ఈ జంటలో భార్య ఒక ప్రాంతానికి, భర్త వేరొక ప్రాంతానికి చేరారు. ఒకరి కోసం ఒకరు విపరీతంగా దుఃఖిస్తున్నారు. అటువంటి సమయంలో ఒక రోజు రాత్రి భర్తకు కల వచ్చింది. ఆ కలలో 'ఇక్కడ నుండి ఉత్తరదిక్కుగా వెడితే నీ భార్య కనిపిస్తుంది' అనే విషయం స్ఫురించింది. మరునాడు ఉదయమే లేచి ఉత్తరదిక్కుగా బయటలుదేరాడు భర్త. కొంత దూరం పోయాక ఒక గ్రామం వచ్చింది. అక్కడ అందరూ ఏదో విషయాన్ని చెప్పుకుంటున్నారు. దాని సారాంశము ఏమంటే

‘ఆ ప్రాంతానికి సముద్రంలో ఒక స్త్రీ కొట్టుకు వచ్చిందట. ఆమె తన భర్తకోసం విపరీతంగా దుఃఖిస్తోంది. ఇప్పుడు ఊరి చివర ఒక ఇంట్లో ఉంది.’ ఆ మాటలు విన్న భర్త ఆవిడ తన భార్యే అయి ఉండచ్చు అని భావించాడు. వెంటనే బయలుదేరి వారు చెప్పిన గుర్తుల ప్రకారం ఆ ఇల్లు చేరి తలుపు తట్టి తన భార్య పేరు పెట్టి పిలిచాడు. లోపల ఉన్న స్త్రీ భర్త గొంతు గుర్తు పట్టింది. మరుక్షణంలో తలుపు తెరుచుకుంది. భార్యాభర్తలు ఒకటయ్యారు. ఇలాంటి ఉదాహరణలు కోకొల్లలు. వారి మధ్య ఉన్న విపరీతమైన ప్రేమే వారిని కలిపింది.

అలాగే భగవంతుని యందు ఉండే విపరీతమైన భక్తి ఈ భక్తుణ్ణి భగవంతుడి దగ్గరకు చేరుస్తుంది. అదే అనన్య భక్తి.

ఒకసారి బాలకృష్ణుడికి ఏదో తెలియని అనారోగ్యం చేసింది. ఏ మందులూ పని చెయ్యటం లేదు. తల్లి యశోద విపరీతంగా బాధ పడిపోతోంది. చివరకి కృష్ణుడి దగ్గరకు వెళ్ళి ‘కృష్ణా నీ అనారోగ్యం ఎలా తగ్గుతుందో నాకు తెలియటం లేదు. ముల్లోకాలకు పాలకుడవైన నువ్వే దీనికి ఉపాయం చెప్పాలి’ అని అడిగింది. ఆ మాటలు విన్న కృష్ణుడు ‘అమ్మా! నన్ను అమితంగా ప్రేమించే భక్త శిఖామణి పాదధూళి తెచ్చి నా నుదుటన రాస్తే, నా రోగం నయమవుతుంది’ అన్నాడు.

శ్రీకృష్ణుడికి భక్తులకేం కొరత. ఊరిలో గోపికలందరూ ఆయన భక్తులే. యశోద ఒక గోపిక దగ్గరకు వెళ్ళి విషయం చెప్పి ‘నువ్వు శ్రీకృష్ణునికి అత్యంత భక్తురాలివి కదా! నీ పాదధూళి ఇవ్వు. అతని నుదుటన రాస్తాను’ అంది. దానికి ఆ గోపిక ‘అమ్మా! నా ప్రాణమైనా ఇస్తాను కాని భగవంతుడి నుదుటన రాయటానికి నా పాదధూళి మాత్రం ఇవ్వను. అంతటి పాపం నేను చెయ్యలేను. అలా చేసినవారు నరకానికి పోతారు’ అంది. ఆ ఊరిలో ఉన్న గోపికలందరూ ఇంచుమించు ఇదే సమాధానం చెప్పారు. ఏం చెయ్యాలో పాలుపోలేదు యశోదకి. అప్పుడు రాధ దగ్గరకు వెళ్ళి పాదధూళి అడిగింది. ఆ మాటలు విన్న రాధ ‘నా దగ్గర ఉన్నదంతా కృష్ణుడిదే. నా తల తీసుకున్నా సరే. పాదధూళి తీసుకున్నా సరే’ అంటూ తన పాదధూళిని ఇచ్చింది. రాధను చూసి ఆశ్చర్యపోయిన యశోద ‘రాధా ! పాదధూళి ఇలా ఇచ్చినవారు నరకానికి పోతారట కదా!” అంటుంది. ఆ మాటలు విన్న రాధ ‘అమ్మా! కృష్ణుడి కోసం నేను ఏ నరకానికైనా వెడతాను. ముందు పాదధూళి

తీసుకువెళ్ళి కన్నయ్య ఆరోగ్యం కాపాడు' అంది. యశోద రాధ పాదధూళి తెచ్చేసరికే కన్నయ్య ఆరోగ్యవంతుడై ఆడుకుంటున్నాడు. ఎవరూ చెయ్యని పని చేసింది కాబట్టే శ్రీకృష్ణుని పట్ల రాధకు ఉన్నది అనన్యమైన భక్తి. కాబట్టే ఆమె కృష్ణుణ్ణి చేరగలిగింది.

ఇదే విషయం మనకు 'కృష్ణతులాభారం'లో కూడా కనిపిస్తుంది. భగవంతుడు భక్త సులభుడు.

## 3. ఏముంది నా దగ్గర ?

'భగవంతుణ్ణి చేరటము' అంటే మోక్షం పొందటమన్న మాట. జీవుడు మోక్షం పొందాలి అంటే – తను చేసిన పాపపుణ్యాలు ఏవీ ఉండకూడదు. అన్నీ క్షయం అయిపోవాలి. కర్మక్షయం కావాలన్న మాట. అయితే అనుభవించటం వల్ల కర్మక్షయం కాదు. ప్రారబ్ధకర్మను అనుభవిస్తుంటే, ఈ జన్మలో చేసిన కర్మ ఆగామి అవుతుంది. అది కాస్తా సంచితకర్మలో చేరుతుంది. కాబట్టి సంచితకర్మ ఎప్పుడూ కొండలాగా పేరుకుని ఉంటుంది. ఈ కారణం చేతనే అనుభవించటం వల్ల కర్మక్షయం కాదు. మరి ఎలా క్షయమవుతుంది అంటే – జ్ఞానంవల్ల. జ్ఞానాగ్నిలో కర్మంతా దహించుకు పోతుంది. అందుకే **'జ్ఞానాదేవతుకైవల్యం'** కర్మక్షయం అయిన జీవి మోక్షం పొందుతుంది. అద్వైత సిద్ధాంతం ప్రకారమైతే జీవాత్మ పరమాత్మా రెండూ కలిసి పోతాయి. ద్వైతంలో అయితే ఆ జీవి సూక్ష్మరూపంలో పరమేశ్వరుణ్ణి చేరుతుంది. అలా చేరాలి అంటే ఆ జీవి యొక్క కర్మశేషంగాని, రాగద్వేషాలు, అహంకార మమకారాలు అన్నీ పూర్తిగా నశించిపోవాలి. అతడు కేవలుడుగా మిగలాలి. విషాన్నికక్కేనాగు శివుడిమెడలో హారమైంది అంటే, విష్ణుమూర్తికి పాన్పు అయింది అంటే, దానియొక్క సహజ లక్షణాలన్నీ కోల్పోయి శుద్ధ శాంతస్వభావం కూడా దాటి గుణాతీతమైన స్థితికి అవి చేరినాయని గుర్తించాలి. ఇక్కడ ఒక చిన్న విషయం చూడండి. ఒకరోజున రుక్మిణీ దేవి శ్రీకృష్ణుని చేతిలోని వేణువును చూసి దాన్ని అడుగుతుంది. "ఓ వేణువా! నువ్వు ఏం పుణ్యం చేసుకున్నావు? నాలో లేనిది ఏమిటి? నీలో ఉన్నది ఏమిటి? నువు ఎప్పుడూ స్వామి చేతుల్లోనే ఉంటావు. ఆయన స్పర్శని అనుభవిస్తుంటావు. నీ దగ్గర ఏముంది?" అని. ఆ మాటలు విన్న వేణువు రుక్మిణీదేవితో అంటుంది 'అమ్మా! నా దగ్గర ఏముంది? పైనించి క్రిందికి అంతా డొల్ల. పైగా వళ్ళంతా చిల్లులే. ఇంక నా దగ్గర ఏం మిగిలింది?"

ఇక్కడ జాగ్రత్తగా చూడండి. వేణువు దగ్గర ఏమీ లేదు. పైనుంచి క్రిందికి డొల్ల. వళ్ళంతా కంతలే. అంటే రాగాద్వేషాలు, ఈర్ష్య అసూయలు, అరిషడ్వర్గాలుఏవీ లేవు. అన్నింటికీ అతీతమై పోయింది. అందుకే భగవానుణ్ణి చేరగలిగింది. ఎప్పుడూ అంటి పెట్టుకుని ఉండగలుగుతోంది. అలాగే జీవుడు కూడా సమస్తాన్నీ వదిలేస్తే, అన్నింటికీ అతీతుడైతే భగవానుణ్ణి చేరగలుగుతాడు. మోక్షం పొందగలుగుతాడు.

## 4. భగవద్గీత

మన దేశంలో భగవద్గీతను గురించి తెలియని వారు ఉండరు. మహాభారతంలో కురుక్షేత్ర సంగ్రామం ప్రారంభం కాబోతున్న సమయంలో తన తండ్రులు తాతలు, కుమారులు ఇతర బంధువులు, స్నేహితులను వైరి పక్షంలో చూసిన అర్జునుడు ధనుర్బాణాలు అవతల పడేసి “నేను ఈ యుద్ధం చెయ్యను. ఈ రక్తపు కూడు నాకు అవసరం లేదు. కేవలం రాజ్యం కోసం నా వారిని చంపుకునే మూర్ఖుణ్ణి కాను” అంటాడు. అప్పుడు శ్రీకృష్ణభగవానుడు అర్జునుడికి గీతోపదేశం చేశాడు. భగవంతునిచే చెప్పబడింది కాబట్టి దాన్ని భగవద్గీత అన్నారు. దగ్గర దగ్గరగా మహాభారతం మధ్యలో ఉంటుంది భగవద్గీత మొత్తం 18 అధ్యాయాలుగా 700 శ్లోకాలలో ఉంటుంది. ఈ విషయం ప్రతి భారతీయుడికి తెలుసు.

యుద్ధం ప్రారంభం కాబోతున్న సమయంలో 700ల శ్లోకాలను శ్రీకృష్ణుడు ఎప్పుడు చెప్పాడు. అర్జునుడు ఎప్పుడు విన్నాడు? అనే అనుమానం వస్తుంది. విషయ మేమంటే భగవానుడు గీతను కేవలము కొన్ని క్షణాల వ్యవధిలో చెప్పాడు. ఆ సమయానికి కర్తవ్యం బోధ పడింది అర్జునుడికి.

కొంత కాలం తరువాత ధర్మరాజు రాజ్యం చేస్తున్న కాలంలో మళ్ళీ అర్జునుడే భగవానుడి దగ్గరకు వెళ్ళి స్వామీ! ఆ రోజు యుద్ధం ప్రారంభం కాబోతున్నది. ఆ సమయంలో నా కర్తవ్యాన్ని గీత రూపంలో వివరించావు. అది నాకు సరిగా అర్థం కాలేదు. కాబట్టి మళ్ళీ దాని నాకు వివరించవలసింది అంటాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు మళ్ళీ **ఉత్తరగీతను** చెబుతాడు. అంతేకాదు కృష్ణావతార పరిసమాపన దశలో ఉద్ధవుడికి **ఉద్ధవగీతను** బోధిస్తాడు. ఈ రకంగా భగవానుడే

గీతను మూడుసార్లు చెప్పాడు. వీటిలో భగవద్గీత అత్యున్నతమైనది. ఇది ఉపనిషత్తుల సారం. మానవులకు కర్తవ్యాన్ని బోధించే పరమౌషధం.

క్రైస్తవులకు బైబిలులాగా, ఇస్లాం వారికి ఖురాన్‌లాగా, హిందువులకు – భగవద్గీత పవిత్ర గ్రంథం. ఇందులో ఎంత క్లిష్టమైన ప్రశ్నకైనా సమాధానం దొరుకుతుంది. అందుకే ప్రతివాడు భగవద్గీతను తెలుసుకోవాలి. 1.భగవద్గీత 2.బ్రహ్మసూత్రాలు 3.ఉపనిషత్తులు. ప్రస్థానత్రయంగా చెప్పబడతాయి.

ఈ రోజున ఆధునిక విజ్ఞానం చదువుకున్నాం అని చెబుతున్న వారికి మన సంప్రదాయాలను హేళన చెయ్యటం ఒక ఫ్యాషన్‌గా మారిపోయింది. ఇక్కడ ఒక చిన్న యధార్థ గాధను చెబుతాను చూడండి.

అది 1970 సంవత్సరం. కేరళ రాష్ట్రంలో తిరువనంతపురం (ఇవాల్టి రోజున తిరువేంద్రం)లో సముద్రపు వడ్డు. సాయంకాల సమయం. వాతావరణం ఆహ్లాదంగా, ప్రశాంతంగా ఉంది. ఒక పెద్దాయన ఒంటరిగా కూర్చుని భగవద్గీత చదువు కుంటున్నాడు. ఆ సమయంలో అక్కడికి ఒక నాస్తికుడు వచ్చాడు. అతడి వయస్సు 25 సం॥ ఉంటుంది. సరాసరి వచ్చి గీతాపారాయణ చేస్తున్న పెద్దాయన దగ్గర కూర్చున్నాడు. అలా కూర్చున్నవాడు ఊరికే ఉండక పెద్దాయనను చూసి హేళనగా

'ఈ కాలంలో కూడా ఇలాంటి పుస్తకాలు చదవటం వల్ల మీరంతా మూర్ఖులుగా మిగులుతున్నారు. ఈ మాట చెప్పటానికే మాకు సిగ్గుగా ఉన్నది.' అన్నాడు రెచ్చగొట్టే ధోరణిలో 'మీరంతా ఇలాంటి చెత్త పుస్తకాలు చదవకుండా సైన్సు పుస్తకాలు చదివి వుంటే మనదేశం ఈపాటికి చాలా అభివృద్ధి చెంది ఉండేది' అన్నాడు ఆవేశంగా.

ఆ మాటలు విన్న పెద్ద మనిషి పరమశాంతంగా 'నువ్వెవరు? ఏం చేస్తుంటావు? ఏం చదువుకున్నావు? అంటూ అతని వ్యక్తిగత వివరాలడిగాడు. దానికి ఆ ఆగంతకుడు 'నేను సైన్సు పట్టభద్రుణ్ణి, కలకత్తా నుంచి వచ్చాను. ఇక్కడ బాబా అటామిక్ రీసెర్చ్ సెంటర్‌లో పని చెయ్యటానికి వచ్చాను' అన్నాడు గర్వంగా. ఆ మాటలు అంటూ 'మీరు వెళ్ళి ఇలాంటి పుస్తకాలు కాకుండా సైన్సు పుస్తకాలు చదివితే జీవితంలో ఎంతో సాధించవచ్చు' అంటూ ఉచిత సలహా కూడా ఇచ్చాడు.

అతను చెప్పినవన్నీ విన్న పెద్దమనిషి చిరునవ్వు నవ్వి ఇక అక్కడి నుంచి వెళ్ళటానికి లేచాడు. అలా ఆయన లేవగానే నలుగురు అంగ రక్షకులు పరుగున వచ్చి ఆయన చుట్టూ నుంచున్నారు. ఆయన కోసం అధికారకమైన ఎర్రబుగ్గ కారు ఒకటి వచ్చింది. ఇదంతా చూసిన ఆగంతకుడు ఒక్కసారిగా భయపడ్డాడు. ఆ పెద్ద మనిషిని భయంతో వణుకుతూ 'మీరెవరు.' అని ప్రశ్నించాడు. విక్రమ్ సారాభాయ్ అని తన పేరు చెప్పి కారులో ఎక్కడాయన. ఆగంతకుడు, కుర్రఇంజనీరు పని చేయబోయే సంస్థకు చైర్మన్ ఆయనే. ఇప్పటికి ఈ మాట అర్థమయింది అతడికి.

ఆ సమయానికి భారతదేశంలో విక్రమ్‌సారాభాయ్ పేరుతో 13 రీసెర్చ్ సంస్థలు నడుస్తున్నాయి. అణువిజ్ఞాన పథకాలు రచించే సంస్థలు నడుస్తున్నాయి. అణువిజ్ఞాన పథకాలు రచించే సంస్థకు ఆయనఅధిపతి. అప్పటి ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీయే ఆయనను స్వయంగా నియమించింది. ఈ విషయం తెలిసిన ఆగంతకుడు ఏడుస్తూ ఆయన కాళ్ళమీద పడ్డాడు. అప్పుడు సారాభాయ్ "ఈ విశాల విశ్వంలో ప్రతి వస్తువు పరమాత్మ చేతనే సృష్టించబడింది. అది ఏదైనా కావచ్చు. మిత్రమా ! ఈ విషయాన్ని మాత్రం మరువద్దు. దైవాన్ని ఎప్పుడూ మరచిపోవద్దు' అని బోధించాడు.

ఈ రోజున కొంతమంది హిందూ ధర్మాన్ని, ఆచారాలను హేళన చెయ్యవచ్చు. కాని ఒక్క విషయం ఏమంటే సైన్సు అభివృద్ధి చెందింది మన దేశంలోనే. దాన్ని అభివృద్ధి చేసినవారు మన ఋషులే. (శాస్త్రవేత్తలు) ప్రపంచం కళ్ళు తెరవక ముందు నుంచి భారతదేశము, సంస్కృతి ఉన్నాయి, దాన్ని గుర్తించలేకపోవటం మన దౌర్భాగ్యం, మన సంస్కృతి సంప్రదాయాలను మనమే హేళన చేసుకోవటం మన అజ్ఞానానికి పరాకాష్ట. ప్రపంచంలో మాతృ దేశాన్ని, సంప్రదాయాలను, కన్నవారిని అవమానించే నీచనికృష్టులు ఇంకెక్కడా ఉండరు మనదేశంలో తప్ప. అందులోను తెలుగు వారిలో ఈ శాతం మరీ ఎక్కువ.

భగవద్గీత అద్భుతమైన, అపురూపమైన విజ్ఞానశాస్త్రం. అందులో చెప్పినవి ఆచరించి ప్రపంచంలో చాలామంది చాలాదేశాలవారు లాభపడుతున్నారు. ప్రపంచంలోని అన్ని సమస్యలకు పరిష్కారం భగవద్గీతలో ఉంది.

కాబట్టి ఓ భారతీయుడా! నీ దేశాన్ని, నీ జాతిని, సంస్కృతి సంప్రదాయాలను గౌరవించటం నేర్చుకో. తద్వారా నీ గౌరవాన్ని పెంపొందించుకో.

# 5. ఏవి చెయ్యాలి? ఏవి చెయ్యకూడదు?

తెల్లవారి నిద్ర లేచిన దగ్గర నుంచి మనం అనేక పనులు చేస్తుంటాము. పని పూర్తి కావటం ముఖ్యంగానే వీటిని చేస్తుంటాము. వీటిని ఎలా చెయ్యాలో మనకు తెలియదు. ఇప్పుడు కొన్ని పనులు ఎలా చెయ్యాలి? ఎలా చెయ్యకూడదు? అనే విషయం చూద్దాం.

1. ఉదయం పూట 'బిక్షాందేహి' అంటూ మనం వేసే భిక్ష కోసం వస్తారు యాచకులు. మన స్తోమతను బట్టి ఎంతో కొంత ఇచ్చి పంపుతాం. అలా బిక్ష వేసేటప్పుడు **గుమ్మానికి ఇవతల నుంచుని భిక్ష వెయ్యకూడదు.** అంతేకాదు ఎవరికైనా ఏదైనా ఇచ్చేటప్పుడు కూడా గుమ్మం ఇవతల నుంచి ఇవ్వరాదు.

2. మన మంచికోసమనో, చేసినకర్మ వదలి పోతుందనో, పాప పరిహారం కోసమనో అనేక దానాలు ఇస్తాం. వీటిలో కర్పూరదానం ఒకటి. ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఏమంటే ఎటువంటి పరిస్థితులలోను, ఎంత అవసరం వచ్చినా **ఎండాకాలంలో మాత్రం కర్పూరం దానం చెయ్యరాదు.**

3. స్నానం చెయ్యగానే ముఖాన కుంకుమ అలంకరించుకోవటం జరుగుతుంది. ఈ రోజుల్లో ఎక్కువమంది స్త్రీలు కుంకుమ బదులుగా స్టిక్కర్లు (బొట్టు బిళ్ళలు) వాడుతున్నారు. పూజలు, వ్రతాలు మిగిలిన పవిత్రమైన పనులు చేసేటప్పుడు తప్పనిసరిగా **ముఖాన కుంకుమనే ధరించాలి.** బొట్టు బిళ్ళలు వాడరాదు. కుంకుమను ఎప్పుడూ చూపుడువ్రేలుతో పెట్టుకొనరాదు. ఉంగరపు వ్రేలుతోనే ధరించాలి.

4. బయట మనకి తెలిసినవాళ్ళో, బంధువులో, ఇతరఊరు నుంచి వచ్చిన వాళ్ళో కనిపిస్తే భోజనానికి మా యింటికి రావయ్యా! అంటూ అతణ్ణి వెంట పెట్టుకుని ఇంటికి వచ్చేస్తాం. అలా ఎప్పుడూ చెయ్యరాదు. ఇతర వ్యక్తి భోజనానికి వస్తున్నాడనే మాట ముందుగా భార్యకు చెప్పాలి. లేకపోతే వండిన పదార్థాలు సరిపోక ఇబ్బంది పడాల్సి వస్తుంది. అందుకని **భార్యకు చెప్పకుండా ఎవరినీ భోజనానికి పిలవరాదు.**

5. ఏదైనా పనిమీద బయటకు వెళ్ళేటప్పుడు శకునం చూడటం చాలామందికి అలవాటు. అలాంటప్పుడు **పిల్లి గనక ఎదురైతే బయటకు వెళ్ళరాదు**. అదే **కుక్క ఎదురైతే నిరభ్యంతరంగా వెళ్ళచ్చు.** అని చెబుతారు పెద్దలు. ఇదంతా మూఢనమ్మకం

అని కొట్టి పారెయ్యొచ్చు. కాని మన పెద్దవాళ్ళు వీటిమీద అనేక సంవత్సరాలు పరిశోధనలు చేసి చెప్పిన విషయాలివి. ప్రతిచోటా చెడు జరగకపోవచ్చు గాని ఎక్కువ చోట్ల మాత్రం చెడు జరుగుతుంది.

6. ఏదైనా ఒక కార్యానికి వెళ్ళేటప్పుడు భార్య ముందు నడవాలా? భర్త ముందు నడవాలా? అనే అనుమానం వస్తుంది. వివాహాది **శుభకార్యాలకు వెళ్ళేటప్పుడు స్త్రీలు, అశుభానికి వెళ్ళేటప్పుడు పురుషులు ముందు నడవాలి** అంటోంది శాస్త్రం.

7. భోజనం చేసిన తరువాత మజ్జిగ త్రాగటం చాలామందికి అలవాటు. పెరుగును చిలక్కొడితే మజ్జిగ అవుతుంది. అయితే పెరుగును ఎప్పుడూ చేత్తో చితికి మజ్జిగ చెయ్యరాదు. అలా చేస్తే పెరుగు సరిగా చితకబడదు. అందుకని **కవ్వంతోనే పెరుగును చిలకాలి.**

8. కోపం వచ్చినప్పుడు ఎదుటి వారిని తిడతాం. అటువంటి సమయంలో చావు వంటి అశుభాలు కూడా పలుకుతుంటాం. ఇక్కడ గమనించాల్సింది ఏమంటే **కోపంలో కూడా అశుభం పలకరాదు.** పైన తథాస్తు దేవతలుంటారు.

జీవితంలో ప్రతి మనిషి కష్టపడి సంపాదిస్తాడు. దొంగతనమైనా కష్టపడాల్సిందే. ఈ సంపాదన దేనికి అంటే సుఖాలు పొందటానికి. ధనాన్ని సంపాదించటానికి రాత్రులందు కష్టపడరాదు. **పగటిపూట మాత్రమే ధనాన్ని సంపాదించాలి.** రాత్రులందు సుఖాలు పొందాలి. ఈ రోజున సాఫ్ట్‌వేర్ కంపెనీల్లో ఉద్యోగం చేసేది రాత్రులందే కదా? అని అనుమానం వస్తుంది. కాని ఆ సమయం వేరే దేశం వారికి పగలు అవుతుంది.

10. దానం చేసేటప్పుడు ఆ దానం ఎప్పుడు ఇవ్వాలి? పగలా? రాత్రా? అని అనుమానం వస్తుంది. ఉదయం పూట చేసిన దానాలు సత్ఫలితాలనిస్తాయి అంటోంది శాస్త్రం. అయితే రాత్రిపూట చేసే దానాలు వేరే ఉన్నాయి. అవి మీకు తెలుసు.

**11. భోజనం చేసేటప్పుడు సాధ్యమైనంత వరకు అరటి ఆకులనే వాడాలి.** ప్రస్తుతం మనవాళ్ళు వాడుతున్నట్లుగా పేపరు విస్తళ్ళు వాడరాదు. అన్నంలో విషం కలిస్తే అరిటాకు నల్లగా మాడిపోతుంది. ఒకవేళ అరటి ఆకులు దొరక్కపోతే అడ్డాకుడు వాడాలి. అరటి ఆకులో భోజనం చేస్తే పదార్థానికి రుచి పెరుగుతుంది. తినేవాడి ఆకలి కూడా పెరుగుతుంది. **తామరాకులో భోజనం ఐశ్వర్య ప్రాప్తి.**

పూర్వకాలంలో ప్రతివారి దొడ్లోను బాదంచెట్లు ఉండేవి. ఇంటికి అతిథులు వస్తే నాలుగు బాదమాకులు తెచ్చి విస్తరి కుట్టి అందులో భోజనం పెట్టేవారు. బాదమాకులు విస్తరిలో భోజనం చేస్తే కఠిన మనస్కులవుతారు. టేకు చెట్లకి కూడా వెడల్పాంటి ఆకులుంటాయి. కొన్ని ప్రాంతాలలో టేకు ఆకులతో విస్తళ్ళు కుడతారు. వీటిలో భోజనం చేస్తే భూతభవిష్యద్వర్తమానాలు తెలుస్తాయి అంటారు.

జమ్మి ఆకులను కూడా విస్తళ్ళ తయారీకి ఉపయోగిస్తారు. జమ్మి ఆకుల విస్తరిలో భోజనం చేస్తే లోకాన్ని జయించే శక్తి వస్తుందని, జ్ఞానం కలుగుతుందని అంటోంది శాస్త్రం.

12. భోజనానికి కూచునే ముందుగానే విస్తరిలో అన్నీ వడ్డించరాదు. **వడ్డించిన విస్తరి ముందు కూచోరాదు. మనం కూర్చున్న తరువాతే పదార్థాలు వడ్డించాలి. అన్నం ఎప్పుడూ మనకోసం ఎదురు చూడరాదు. అన్నాన్ని ఉపేక్షించరాదు అంటోంది వేదం.**

13. అన్నం తినేటప్పుడు ఏ దిక్కుగా కూర్చోవాలి? అంటే తూర్పు దిక్కు – దీనికి అధిపతి ఇంద్రుడు. సూర్యోదయమయ్యే దిక్కు. అందుచేత తూర్పు దిక్కుగా కూర్చుని భోజనం చెయ్యటాని ప్రాముఖ్యత ఎక్కువ.

పడమర దిక్కుగా కూర్చుంటే – బలం

ఉత్తర దిక్కుగా కూర్చుంటే – సంపద

దక్షిణ ముఖంగా కూర్చుంటే – కీర్తి

కాబట్టి **ఏ దిక్కుగా అయినా కూర్చుని భోజనం చెయ్యవచ్చు.**

14. అన్నం తినేటప్పుడు అన్నాన్ని గాని, వడ్డించే వారిని గాని దుర్భాషలాడరాదు. ఎప్పుడూ ఏడుస్తూ అన్నం తినరాదు. అశుభం జరిగినప్పుడే అలా చేస్తారు. **విస్తరిలో ఉన్నదంతా తినెయ్యరాదు.** కొద్దిగా వదిలెయ్యాలి.

15. భోజన సమయంలో తగవులాట, హేళన వంటివి చేయరాదు.

16. ఇవాల్టి రోజుల్లో బఫేలు ఏర్పాటు చేస్తున్నారు. కాని శాస్త్ర ప్రకారం **వళ్ళో కంచం పెట్టుకుని తినరాదు.** ఈ పని ఎక్కువగా బిచ్చగాళ్ళు చేస్తారు. అందుకే వళ్ళో కంచం పెట్టుకుని తినటం దరిద్ర హేతువు అంటారు.

13. భోజనాలు పూర్తి అయిన తరువాత ఎంగిలి ఆకులు ఎత్తిన వాడికి, భోజనాలు ఏర్పాటు చేసిన దాతకు వచ్చిన దానికన్న ఎక్కువ పుణ్యం వస్తుంది. అందుకే రాజసూయయాగం జరిగినప్పుడు మునీశ్వరులు, ఋషీశ్వరులు భోజనాలు చేసిన ఆకులు సాక్షాత్తు శ్రీకృష్ణుడే తీస్తాడు.

ఇప్పుడు మనం చెప్పుకున్నవి కొన్ని మాత్రమే. వీటిని కేవలం ఛాందసం అని కొట్టెయ్యరాదు. ఏది ఏమైనా మనం చేసే పనుల వల్ల ఇతరులకు ఇబ్బంది మాత్రం కలగరాదు.

## 6. సుమంగళి

లలితా సహస్రంలో 967వ నామం సుమంగళీ. శోభనమైన మంగళము గలది. 970 సువాసిని. సర్వకాల సర్వావస్థల యందు జీవించి ఉన్న భర్త గలది. ఐదు రకాలయిన అలంకారాలు గల స్త్రీని సువాసిని అంటారు. అవి

1. పసుపు, కుంకుమ 2. గాజులు 3. మెట్టెలు 4. మంగళసూత్రాలు 5.నల్లపూసలు

ఇవి సౌభాగ్యాభరణాలు. సుమంగళి చిహ్నాలు. వీటిని నిత్యము ధరించేది సుమంగళి. ఆమెనే ముత్తైదువ అని కూడా అంటారు. ముదిత అంటే – స్త్రీ. ఐదు రకాలయిన అలంకారాలు గల స్త్రీ అని అర్థం. ఈ అలంకారాలను చెప్పేటప్పుడు ఇంకొక చోట వేరుగా ఉండచ్చు. అంటే వీటిలోకొద్దిపాటి మార్పు అన్న మాట. అవి

1. కాళ్ళకి పట్టీలు, మెట్టెలు. 2 గాజులు 3. మంగళసూత్రం 4 పూలు 5. నుదుటన సింధూరం.

అసలు వీటి ప్రాముఖ్యత ఏమిటో చూద్దాం.

**1. కాళ్ళకి పట్టీలు, మెట్టెలు**

దీనికి శాస్త్రీయపరంగా అంటే సైన్సు పరంగానే వివరణ ఉంది. కాళ్ళలో **సయాటికా** అనే నరం ఉంటుంది. దీనివల్లనే చాలామందికి తుంటె భాగం నుంచి వయసు పెరిగినాక నొప్పి వస్తుంది. దాన్నే సయాటికా పైన్ అంటారు. ఈ నరం

మోకాళ్ళ నుంచి క్రింది భాగానికి **టైబియా** అనే పేరుతో పిలువబడుతుంది. పాదం గుత్తి దగ్గరకు వచ్చేసరికి ఈ నరం రెండు శాఖలుగా విడిపోతుంది. ఇందులో ఒకటి వ్రేళ్ళ చివరిదాకా వెళ్ళగా రెండవది మడమ భాగాన్ని చేరుతుంది. అంటే వ్రేలి చివరిభాగంలోను, మండమ చివరి భాగంలో టైబియా శాఖ ఉంటుందన్న మాట ఈ నాడి కటిప్రదేశంలో ఉన్న గర్భాశయ, మూత్రాశయనాడులతో సంబంధం కలిగి ఉంటుంది. స్త్రీలు కాళ్ళకు ధరించే పట్టీలు, కాలివ్రేళ్ళకు ధరించే మెట్టెలు ఈ నాడికి రాపిడి కలిగించి, పైన ఉన్న మూత్రాశయ గర్భాశయ నాడులను ప్రేరేపిస్తాయి. దీని ఫలితంగా గర్భాశయము, మూత్రాశయము చురుగ్గా పని చేస్తాయి. దీనిమీద మరిన్ని వివరాలు కావాలంటే డాక్టరును కలవండి లేదా నెట్‌లో చూడండి.

**2. చేతులకు గాజులు :**

ఇక్కడ ఒక విషయం గుర్తుంచుకోవాలి. గాజులు అంటే మట్టిగాజులు మాత్రమే. బంగారు గాజులు కూడా పనికిరావు. అందుకే ఏదైనా కార్యం చేసేటప్పుడు స్త్రీలు చేతులకు తప్పనిసరిగా మట్టి గాజులే వేసుకోవాలి అంటారు పెద్దలు.

మన చేతి మణికట్టు దగ్గర **రేడియల్** అనే నరం ఉంటుంది. ఇది గుండె నరాలతో అనుసంధానించబడి ఉంటుంది. శరీరంలో నాడీ స్పందన తెలుసుకునేది సామాన్యంగా ఈ నరం ద్వారానే ఈ నరం శరీరంలోని బ్లెడ్‌ప్రెషర్‌ను అదుపులో ఉంచుతుంది. దీన్ని రాయటం, మషాజ్ చెయ్యటం ద్వారా బి.పి.ని అదుపులో ఉంచవచ్చు. స్త్రీలు చేతికి వేసుకునే గాజులు ఈ నరానికి రాపిడి కలిగించి బి.పి. కంట్రోలు చేస్తాయి.

అయితే గాజులు స్త్రీలే కాని పురుషులు వేసుకోరు కదా ? మరి పురుషుల సంగతి ఏమిటి? అనేది అనుమానం.

ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమంటే పూర్వకాలంలో పురుషులు కష్టపడి పని చేసేవారు. తిన్న తిండి పూర్తిగా అరిగిపోయేది. కొవ్వు శాతం తక్కువగా ఉండేది. అందుకని ఆ రోజులో బి.పి, షుగరు వంటి వ్యాధులు వచ్చేవి కావు. ఈ కారణం చేతనే గాజుల అవసరం వారికి లేకుండా పోయింది. అయితే శారీరక శ్రమ తక్కువగా

ఉన్న పురుషులకు బంగారము, వెండి, రాగి కంకణాలు వేసుకోండి అని చెబుతున్నారు. ఈ లోహాలు శరీరంలోని వేడిని గ్రహించి, శరీరాన్ని చల్లగా ఉంచుతాయి. శారీరక శ్రమ చేసేవారు మట్టిగాజులు వేసుకుంటే అవి పగిలిపోతాయి. అందుకే వారు లోహపు కంకణాలు ధరిస్తారు.

స్వామీజీలు, బాబాలు యంత్రాలు వేసిన రాగి కంకణాలు ఇచ్చేది ఇందుకే.

**3. మెడలో మంగళసూత్రం**

మంగళసూత్రంలో చివరన ఉండే బంగారు లాకెట్ లేదా పసుపు కొమ్ము రాపిడివల్ల రొమ్ము కాన్సరును కొంతవరకు అడ్డుకోవచ్చు. అయితే పురుషుల సంగతి ఏమిటి? అన్నప్పుడు మగవారికి స్తనాలు ఉండవు కాబట్టి వారికి రొమ్ము కాన్సరు రాదు. బంగారు లాకెట్లు కాన్సరు నిరోధకాలుగా పని చేస్తాయి. వీటిమీద నుంచి వచ్చే నీరు చర్మరోగాలు రాకుండా కాపాడుతుంది.

బంగారం కాన్సరు నిరోధకమని పరిశోధనలో కూడా తేలింది.

**4. తలలో పూలు**

పూలనుంచి వచ్చే సువాసన వల్ల మానసిక ప్రశాంతత వస్తుంది. పాజిటివ్ ఎనర్జీ ఉత్పత్తి అవుతుంది. దాంపత్య జీవితంలో ఇది ఆకర్షణగా ఉపయోగిస్తుంది..

**5. నొసటన సిందూరం :**

పూర్వకాలంలో కుంకుమ ఎవరికి వారు ఇంట్లోనే తయారు చేసుకొనే వారు. నా చిన్నప్పుడు మా యింట్లో కూడా పసుపు కొట్టించుకునే వారు. పసుపు కొమ్ములు తెచ్చి, ఎండబెట్టి పసుపు కొట్టేవారు. ఈ సమయంలోనే ఆ పసుపులో కొంత భాగంలో కుంకుమ రాళ్ళు కలిపి పొడి చేసేవారు. అది కుంకుమ అయ్యేది. ఈ రకంగా ప్రతి ఇంట్లోను పసుపు, కుంకుమ తయారుచేసుకునేవారు. పసుపులో కలిపే కుంకుమ రాయి మంచిది కాకపోయినా, ఎక్కువైనా ముఖాన పుండు పడుతుంది. నుదుటన కుంకుమ ధరించటం వల్ల అజ్ఞాచక్రంపై వత్తిడి కలిగి మనసు అదుపులో ప్రశాంతంగా ఉంటుంది. నుదుటన కుంకుమ మగవారు కూడా ధరించాలి. ఆధునిక నాగరికతలో

ఇవన్నీ పోయినాయి. ఇంకో విషయం ఏమంటే పసుపు కుంకుమలతో పాటుగా కాటుక కూడా ఇంట్లోనే తయారుచేసుకునే వాళ్లు. ఇవాల్టి రోజున అసలు కాటుక పెట్టుకోవటమే అరుదై పోయింది. పసుపు కుంకుమలకు బదులుగా రంగు పొడులు వాడుతున్నారు. వీటివల్ల రోగాలు వస్తాయి. ఆడపిల్లలు ముక్కు పుడక పెట్టుకోవాలి. అదికూడా ఎడమ ముక్కుకే. దీనికి కారణం అది సైనస్‌ను రాకుండా నిరోధిస్తుంది.

చెవులకు పోగులు ధరించటం వల్ల చెవిపోటు వచ్చే అవకాశం తగ్గుతుంది.

స్త్రీలు పగడాలు ధరించటం వల్ల గర్భసంబంధమన వ్యాధులు తగ్గుతాయి. ఋతుక్రమము సజావుగా జరుగుతుంది.

స్త్రీలు కాళ్ళకి తప్పనిసరిగా పసుపు రాచుకోవాలి అన్నారు. పూర్వకాలంలో స్త్రీలు ఇంట్లో పని చేసుకోవటానికి తడిలోను, పొడిలోను తిరుగుతుండే వారు. ఇలా చెయ్యటం వల్ల పాదాలు నీళ్ళలో నానిపోయి పాచిపోయేవి. అంటే ఇన్ఫెక్షన్ వచ్చేది. ఇప్పుడు కూడా ఇళ్ళలో పనిచేసే వారిని, ప్రత్యేకించి బట్టలు ఉతికేవారి పాదాలు పాచిపోయి ఉంటాయి. వారు అలాంటివారు పాదాలకు పసుపు రాచుకుంటే ఉపయోగం ఉంటుంది. అందుకే గతకాలంలో స్త్రీలు పాదాలకు పసుపు రాచుకునే వారు. పాదాలకు పసుపు రాచుకున్న స్త్రీ పరమపవిత్రంగా కనిపిస్తుంది.

ఇవన్నీ చేసినా ఆ రోగాలు తగ్గలేదు కదా? అవి రాకుండా ఉంటాయని హామీ ఇస్తారా? ఇవన్నీ ఛాందసాలు అని వాదించేవారూ ఉన్నారు. వీటిని వాడటం వల్ల ఆయా రోగాలను కొంతవరకు నిరోధించగలుగుతాం. అంతేగాని పూర్తిగా నివారించలేం.

డాక్టరు గారి దగ్గర మందులు తీసుకున్నా సైనస్, ఆస్మా వంటి రోగాలు కొంతవరకు తగ్గుతాయి. అంతేకాని పూర్తిగా తగ్గిపోవు కదా? కాన్సర్ రోగికి ఆపరేషన్ చేసినా, కీమో ఇచ్చినా ఎంత శాతం బ్రతుకుతున్నారు?

కాబట్టి అడ్డదిడ్డంగా మాట్లాడి మీ తెలివితేటలు ప్రదర్శించాలని చూడకుండా, సహేతుకంగా ఆలోచించి వీటివల్ల ప్రయోజనం పొందండి. మనదేశంలో ఆచారాలన్నీ సైన్సుపరమైనవే అని గుర్తించండి. మనం చేసే ప్రతిపనిలోను సైన్సు దాగి ఉన్నది.

# 7. ఏది కావాలనుకుంటే అదే దొరుకుతుంది

కోరికలు రెండు రకాలు 1. ఇహానికి సంబంధించినవి. 2. పరానికి సంబంధించినవి. ధనధాన్యాలు, పదవులు, గౌరవము, గొడ్డు గోద, పాడిపంట, ఇల్లు వాకిలి; బంధువులు స్నేహితులు ఇవన్నీ ఈ లోకానికి సంబంధించినవి. స్వర్గము, భగవత్సాక్షాత్కారము, పరమపదము వంటివి పరానికి సంబంధించినవి. ఎంత ఉపాసకుడైనా, ఎంత సాధకుడైనా ఏది కావాలని కోరతాడో, అతడికి అదే దొరుకుతుంది. పూర్వ కాలంలో రాక్షసులు ఘోరమైన తపస్సు చేసి ముల్లోకాలకు ఏలిక కావాలి అని కోరుకున్నారు. మృత్యువు లేని జీవితం కావాలి అనుకున్నారు. వీటిలో ముల్లోకాలకు ఏలిక కాగలిగారు కాని మృత్యువు లేని జీవితం మాత్రం ఎవరూ పొందలేకపోయారు. ఎందుకంటే భూమిమీద పుట్టిన ప్రతిజీవి మరణించి తీరాలి. భగవంతుడే ఈ భూమిమీద అవతరించినా, కొంత కాలానికి అవతార పరిసమాప్తి జరిగి తీరాలి.

ఈ రకంగా భక్తులు ఎవరి స్థాయిని బట్టి వారు కోరుతుంటారు. వారి కోరికలు తీరుతుంటాయి. ఇక్కడ ఒక చిన్న కథ ఉంది చూడండి.

పూర్వకాలంలో సుదర్శనుడు అనే ఒక రాజుగారు ప్రజలను కన్నబిడ్డలలాగా కాపాడుతున్నాడు. అతడు స్వతహాగా వేదవేదాంగవిదుడు. చాలా గొప్ప తత్త్వవేత్త. **చరాచర జగత్తు ఆవిర్భవించటానికి, స్థితి లయాలకు మూలకారణం ఆ భగవంతుడే** అని పూర్తిగా నమ్మినవారు. నిరంతరము భగవంతుణ్ణి దర్శిస్తూ, పరమానందంలో తేలియాడేవాడు.

ఒకరోజున భగవంతుడు అతడికి దర్శనమిచ్చినప్పుడు ఏదైనా ఒక వరం కోరుకోమన్నాడు. ఆలోచించటం మొదలు పెట్టాడు మహారాజు. తనకు అన్నీ ఉన్నాయి. ధనధాన్యాలు, భోగభాగ్యాలు పుష్కలంగా ఉన్నాయి. ఇంకా తనకు కావలసింది ఏముంది? తీవ్రంగా ఆలోచించాడు. తనుగా ఏదీ అవసరం లేదు. అయినా భగవంతుడి కృప ముందు లౌకిక విషయాలకు విలువ లేదు. కాబట్టి తనకు లాగానే తన ప్రజలకు కూడా భగవత్సాక్షాత్కారం జరిగితే వారందరూ నిరంతరమూ ఆనంద డోలికలలో తేలియాడుతారు. తన ప్రజల ఆనందం కన్న తనకు కావలసింది ఏముంది? కాబట్టి భగవత్సాక్షాత్కారము తన రాజ్యంలోని

ప్రజలందరికీ కావాలని కోరితే ఎలా ఉంటుంది? అనుకున్నాడు. అదేమాట భగవంతుడికి నివేదించాడు.

ఆశ్చర్యపోయాడు భగవంతుడు. అది సాధ్యం కాదు. ఎవరి కర్మ ఫలితాన్ని వారు అనుభవించాలి. అందరికీ సాక్షాత్కరించటం జరగదు అన్నాడు. వినలేదు మహారాజు. మొండి పట్టుపట్టాడు. కాదనలేకపోయాడు భగవంతుడు "సరే రేపు అష్టమి రోజు ఉదయం రాజ్యంలోని జనులందరినీ ఊరి చివర ఉన్న కొండ దగ్గరకు తీసుకురా అక్కడకు వచ్చిన వారందరికీ దర్శనమిస్తాను" అన్నాడు.

మహదానందం చెందాడు మహారాజు. ఆ రోజే రాజ్యంలో చాటింపు వేయించాడు. 'రాజ్యంలోని ప్రజలంతా ఊరి చివరకొండ దగ్గరకి రండి. అక్కడ అందరికీ భగవంతుడు దర్శనమిస్తాడు. ఈ విషయం రాజ్యంలోని ప్రజలందరికీ చేరిపోయింది. రాజుగారి మాటలు కాదనలేక ప్రజలంతా ఊరిచివరకొండ దగ్గరకు బయలుదేరారు.

చూడటానికి పెద్ద ఉత్సవంలా ఉంది. రథాలు, గుర్రాలు, ఏనుగులు, బండ్లు ఎవరి తాహతకు తగ్గట్టుగా వారు భగవద్దర్శనానికి బయల్దేరారు. తన పరివారంతో పాటుగా బయల్దేరాడు రాజుగారు.

జన సందోహం ముందుకు సాగుతోంది. కొంత దూరం వెళ్ళేసరికి రాగినాణేలు పెద్ద కొండలాగా కనిపించినాయి. అయాచితంగా ఇన్ని రాగినాణేలు దొరుకుతుంటే కాదనే వారెవరు. ప్రజలు ఆ నాణేల కోసం పరుగులు తీస్తున్నారు. 'ఈ నాణేల మాయలో పడద్దు. భగవద్దర్శనం చేసుకుందాం రండి.' అని పిలిచాడు రాజు. కొంతమంది ఆయన మాటలు వినకుండా దొరికిన రాగినాణేలు శక్తి కొద్దీ మూట కట్టుకుని వెనుతిరిగి ఇంటికి వెళ్ళిపోయారు. 'వారికి ప్రాప్తం లేదు' అనుకుంటూ మిగిలిన వారితో ముందుకు కదిలాడు రాజు.

మళ్ళీ కొంత దూరం వెళ్ళేసరికి వెండి నాణేలు గుట్టలు గుట్టలుగా పడి ఉన్నాయి. ఆ వెండిని చూసి కొంతమంది రాజుగారి మాటలు లెక్క చెయ్యకుండా వాటిని మూటగట్టుకుని తిరిగి వెళ్ళిపోయారు. మిగిలిన వారితో ముందుకు సాగుతున్నాడు

రాజుగారు. కొంత దూరం పోయేసరికి బంగారు నాణేల గుట్టలు కనిపించాయి. రాజబంధువులతో సహా కొంతమంది ప్రజలు పరుగులు పెట్టి, బంగారు నాణేలు మూట కట్టుకుని తిరిగి వెళ్ళిపోయారు. వాళ్ళని చూసిన రాజు చాలా బాధపడి "చూశారా! భగవంతుడి ముందు లౌకికమైన ధనధాన్యాదులన్నీ ఉపయోగం లేనివి. అయినప్పటికీ వారు వాటికే విలువ నిచ్చారు. ఇక మనం నలుగురమే మిగిలాము. ఎవరికి ఎంత ప్రాప్తో అంతే కదా?" అన్నాడు మిగిలి ఉన్న రాణి, తన సోదరులతో. అవును అన్నారు వారు.

రాజుగారు ఇప్పుడు కేవలము నలుగురితో కొండను చేరబోతున్నాడు. ఇంతలో ఇంద్రధనుస్సులాగా చిత్రవిచిత్రమైన రంగులు కనిపించాయి. ఆశ్చర్యపోయారు ఆ నలుగురు. అక్కడికి దగ్గరలోనే రత్నాలకుప్పలు కనిపించాయి. సూర్యకాంతి వాటిమీద పడి ప్రకాశిస్తున్నాయి. వాటిని చూడగానే రాణి, రాజసోదరులు పరుగులు పెట్టి, చేతైనంత వరకు రత్నాలు మూటలు కట్టుకుని తమ రథాలు మీద వేసుకుని తిరిగి ఇళ్ళకి వెళ్లిపోయారు.

ఇక మిగిలింది సుదర్శన మహారాజు ఒక్కడే. ప్రజల అజ్ఞానానికి చింతిస్తూ రాజుగారొక్కడే కొండను చేరాడు. అక్కడ భగవంతుడు అతడి కోసం ఎదురు చూస్తున్నాడు.

రాజును చూడగానే భగవంతుడు 'ఏం మహారాజా! ఏరి నీ ప్రజలు వారందరి కోసం నేను చాలాసేపుగా ఎదురు చూస్తున్నాను.' అన్నాడు. సిగ్గుతో తల వంచుకున్నాడు మహారాజు. అప్పుడు భగవంతుడు అంటాడు.

"రాజా ! భౌతికమైన, సాంసారికమైన విషయాలకు ప్రాధాన్యత ఇచ్చేవారికి నేను లభించను. నా దర్శనం కాదు. వారు నన్ను ఎన్నటికీ పొందలేదు. పరమమైన భక్తితో నన్ను సేవించేవారే నన్ను పొందగలరు" అని

కాబట్టి నిరంతర సాధన చేసేవారు గాని, తపోనిష్ఠా గరిష్ఠులు కాని, వారు ఏది కావాలనుకుంటే దాన్నే పొందుతారు. ఎవరు ఏది కావాలనుకుంటే అదే దొరుకుతుంది.

# 8. నేను ఎవరు?

మానవుణ్ణి అనాదిగా పట్టి పీడిస్తున్న ప్రశ్న ఇది. ఈ లోకంలో జన్మించక ముందు ఎక్కడ ఉన్నాను? మరణించిన తరువాత ఎక్కడికి పోతాను? అసలు నేను ఉండే ప్రదేశం ఏది? ఇక్కడికి ఎందుకు వచ్చాను? ఎందుకు జన్మించాను?

మన దేశంలోనే కాదు. ఇతర దేశాలలో కూడా ఈ ప్రశ్నలు అనాదిగా తల ఎత్తుతూనే ఉన్నాయి. ఈ క్రమంలోనే పునర్జన్మ అనేది ఉన్నదా? లోకంలో జన్మించిన జీవులన్నీ ఒకే రకంగా ఎందుకు ఉండటం లేదు. కొన్ని జీవులు మనుషులుగా జన్మిస్తే, కొన్ని జీవులు జంతువులుగా, పశువులుగా, పక్షులుగా, క్రిమి కీటకాలుగా ఎందుకు జన్మిస్తున్నాయి. మనుషులలో కూడా అందరూ ఒకే రకంగా ఉండరు. కొందరు పొడవుగా, కొందరు పొట్టిగా, నల్లగా, తెల్లగా, వివిధ రకాల అవయవ లోపాలతో చిత్రవిచిత్రమైన వ్యవహార శైలితో జన్మిస్తున్నారు. మిగిలిన ప్రాణులు కూడా అంతే. ఈ తేడాలు ఎందుకుంటున్నాయి. అసలు నేను ఎవరు?

నేను అంటే పాంచభౌతికమైన శరీరమా? కన్ను, ముక్కు, కాలు, చెయ్యి మొదలైన అవయవాలా? మరి నేను ఎవరు? ఈ ప్రశ్నకు సమాధానం చెబుతున్నాయి. మన ఉపనిషత్తులు. నేను అంటే ఆత్మ. ఓ మానవుడా! ఈ శరీరం నీదికాదు. మరణాంతరము శరీరంలో ఉన్న ఆకాశం ఆకాశంలో కలిసిపోతుంది. గాలి గాలిలో కలిసిపోతుంది. ద్రవపదార్థం నీటిలో కలిసి పోతుంది. శరీరం అగ్నిలో దహించబడుతుంది. బూడిద మట్టిలో కలిసిపోతుంది. కాబట్టి పాంచభౌతికమైన శరీరం పంచభూతాలలోను కలిసిపోతుంది. మరణ సమయంలో ప్రాణాలు శరీరం నుంచి ఉత్క్రమిస్తాయి. గొంగళీ పురుగు ఒక ఆకును పూర్తిగా తినేసి, ఇంకొక ఆకు మీదికి వెళ్ళినట్లుగా ఆత్మ పంచభూతాలను వెంట పెట్టుకుని, ఇంకో శరీరంలో ప్రవేశిస్తుంది. మానవుడు జీర్ణమైన వస్త్రాన్ని వదిలి కొత్త వస్త్రాన్ని ధరించినట్లుగా, ఆత్మ మరణించిన ఈ దేహాన్ని వదిలి, క్రొత్త దేహంలో ప్రవేశిస్తుంది. ఇలా అనేక జన్మలు ఎత్తుతుంటుంది. ఈ జన్మలో మనిషిగా పుట్టావు. గతజన్మలో నువ్వు ఎవరిగా పుట్టావో తెలియదు. జీవి తను చేసిన కర్మవల్ల నూతన జన్మ ధరిస్తుంది. మంచి

పనులు చేసినవారు నీచయోనుల యందు జన్మిస్తారు. అంతకన్నా గోరమైన పనులు చేసినవారు క్రిమికీటకాలుగా పుడుతూ ఛస్తూ ఉంటారు అని చెబుతోంది బృహదారణ్యకోపనిషత్తు.

ఇప్పటి వరకు అనేక జన్మలు ఎత్తావు. క్రిమికీటకాలు, పశువులు, పక్షులు, జంతువులగా జన్మించావు. ఇదిగో ఇప్పుడు మానవజన్మ ఎత్తావు. లోకంలో మానవుడిగా జన్మించటం గత జన్మలలో చేసిన పుణ్యఫలం. అందుకే **జంతూనాం నరజన్మ దుర్లభం** అన్నారు. అందులోను బ్రాహ్మణుడిగా జన్మించటం మరీ కష్టం. బ్రాహ్మణుడిగా జన్మించటంలో ఔచిత్యం ఏమిటి? అంటే –

లోకంలో ఆహార, నిద్రా, భయ, మైథునాలు అన్ని జీవులకు సమానమే. కాని ఆలోచనా శక్తి అన్నింటికీ ఉండదు. యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం అన్నింటికీ ఉండదు. ఇది ఉండేది కేవలము మానవుడికి మాత్రమే. అందుకే జన్మలన్నింటిలోకి మానవజన్మ ఉత్తమమైనది అన్నారు.

చాతుర్వర్ణాలలోను బ్రాహ్మణుడికి జన్మతః వచ్చే సంస్కారముంటుది. బ్రాహ్మణుడు అనేది ఒక కులంకాదు. నిరంతరము సత్యాన్వేషణలో కాలం గడిపే వాడు బ్రాహ్మణుడు. వేదవేదాంగాలు చదివి వివాహం చేసుకుని కర్మలను ఉపాసించి, అంటే యజ్ఞయాగాది క్రతువులు చేసి, చివరకు వానప్రస్థము ఆ తరువాత సన్యాసాశ్రమము స్వీకరించి, సత్యాన్వేసణలో ఒంటరి ప్రదేశాలలో సంచరిస్తూ, సద్గురువును ఆశ్రయించి మోక్షమార్గంలో ప్రయాణించేవాడు బ్రాహ్మణుడు, మానవుడు సాధించాల్సినవి చతుర్విధ పురుషార్థాలు. అవే ధర్మార్ధ కామమోక్షాలు. వీటిలో ఆఖరుది అయిన మోక్షమే మనం సాధించాల్సింది. మిగిలిన మూడు పురుషార్థాలు, ధర్మార్ధ కామములు మూడు నాల్గవదైన మోక్షం సాధించటాని ఉపకరణాలు. మోక్షం అనే సింహాసనాన్ని అధిరోహించటానికి మెట్లు. కాబట్టి జీవిత లక్షం మోక్షసాధన.

నేను ఎవరు? అంటే – నువ్వు అంటే శరీరం కాదు. ఇంద్రియాలు కాదు. నువ్వు అంటే ఆత్మ. ఆత్మకు చావు పుట్టుకలు లేవు. అది ఒక శరీరాన్ని వదలి, వేరొక శరీరంలో ప్రవేశిస్తుంది. కష్టాలు, సుఖాలు, బరువులు, బాధలు, కన్నీళ్ళు,

సుఖము, దుఃఖము అన్నీ ఈ శరీరానికే, ఆత్మకు ఇవేవీ అంటవు. ఆత్మకు చావు పుట్టుకలు లేవు. ఆత్మసత్యమైనది, నిత్యమైనది, శాశ్వతమైనది. ఆత్మకు నాశనం లేదు. మరణించిన తరువాత ఆత్మ ఇంకొక శరీరంలో ప్రవేశిస్తుంది. తాను చేసిన కర్మంతా క్షయమయిన తరువాత అద్వైత సిద్ధాంతం ప్రకారం జీవాత్మ పరమాత్మలో లీనమై పోతుంది. అదే ద్వైత సిద్ధాంతం ప్రకారమైతే, సూక్ష్మరూపంలో పరమపదం చేరి, భగవంతుని సన్నిధిలో ఉండిపోతుంది.

మానవుణ్ణి సృష్టించిన తరువాత, ఈ శరీరంలోకి బ్రహ్మరంధ్రం గుండా ప్రవేశించాడు భగవంతుడు. అలా ప్రవేశించి, శరీరం చేస్తున్న కర్మలన్నింటినీ తానే చేస్తున్నట్లుగాను, ఆ కర్మలన్నింటికీ తానే కర్మా, భోక్తా అనుకుంటున్నాడు. ఇదంతా అజ్ఞానం. నిజానికి ఆత్మ దేనికీ కర్తా కాదు. భోక్తా కాదు. అజ్ఞానం గనక పటాపంచలైతే పరమేశ్వరసాక్షాత్కారం జరుగుతుంది. జీవాత్మ పరమాత్మను చేరుతుంది.

కేవలము అజ్ఞానంతో నేను అంటే శరీరము అనుకుంటున్నావు. ఆత్మకు కష్టాలు, బాధలు ఉండవు. ఆత్మ అగ్నిలో కాలదు. నీటిలో తడవదు. ఆత్మకు చావులేదు. ఈ విషయాలు నీకు తెలుసు. కాని అజ్ఞానంతో వాటిని మరచిపోయావు. అంతే. ఈ లోకంలోకి వచ్చేటప్పుడు వట్టి చేతులతో వచ్చావు. వెళ్ళేటప్పుడు ఏమీ తీసుకుపోవు. కష్టపడి సంపాదించిన ధనధాన్యాలు, ఇల్లు వాకిలి, పశువులు అన్నీ ఇక్కడే ఉంటాయి. సంపాదించిన ధనమంతా జాగ్రత్తగా ఇనప్పెట్టెలో ఉంటుంది. పోయేటప్పుడు బంధువులు, మిత్రులు స్మశానం దాకా వస్తారు. ఆ తరువాత నీతో వచ్చేది కేవలము నువ్వు చేసిన పాపపుణ్యాలు మాత్రమే. మరి ఎందుకు ఈ ఆరాటం.

జాగ్రత్తగా గమనించండి. 84 సం॥ వయస్సు, 70 సం. రాజకీయ జీవితం, 50 సం॥ పార్టీ అధ్యక్షుడు, నాలుగుసార్లు ముఖ్యమంత్రి, దక్షిణ భారతదేశంలో తిరుగులేని నాయకుడు, కేంద్ర ప్రభుత్వాన్ని శాసించిన వాడు, వేలకోట్ల రూపాయలకు అధిపతి. ఏమిటి ఉపయోగం? చచ్చిన తరువాత పాతిపెట్టటానికి కేవలము ఆరడగుల నేల కోసం కోర్టును ఆశ్రయించవలసి వచ్చింది. ఇది చేసిన కర్మని అనుభవించటం అంటే.

ఈ జన్మని నీకు ఎవరో ఇచ్చారు. పసితనం నుంచీ ఎవరో పెంచి పోషించారు. విద్యాబుద్ధులు ఎవరో చెప్పించారు. ఉద్యోగం ఎవరో ఇచ్చారు. జీవనోపాధి ఎవరో కల్పించారు. వివాహం – ఎవరినో చేసుకున్నావు. ఎవరివల్లనో పిల్లల్ని కన్నావు. మరణించిన తరువాత ఎవరో నీకు కర్మకాండలు చేస్తున్నారు. నీ చితికి ఎవరో నిప్పు అంటిస్తున్నారు. వీటిలో ఏ ఒక్కటీ నువ్వు స్వంతంగా చేసుకోవు. అన్నింటికీ ఇతరుల మీద ఆధారపడే, ఇతరుల సాయంవల్లనే చేస్తున్నావు. మరి ఎందుకు నేను నాది అనే అహంకార మమకారాలు?

బ్రతికినన్నాళ్ళు నా భార్య, నా పిల్లలు, నా బంధువులు అనుకున్నావు. వారంతా నాప్రాణం అన్నావు. వారు లేకపోతే జీవించలేను అన్నావు. మరి పోయేటప్పుడు ఒంటరిగానే పోతున్నావు. నీతోపాటుగా వచ్చేవారు ఎవరూ లేరు. నువ్వు అమితంగా ప్రేమించిన భార్య, ఇంటి దగ్గరే ఉండిపోతుంది. నీ కడుపున పుట్టిన బిడ్డలు స్మశానం వరకు వచ్చి చితికి నిప్పంటిస్తారు. ఆ తరువాత నీతో వచ్చేది ఎవరు? కేవలము నువ్వు చేసిన కర్మఫలాలే.

కాబట్టి ఓ మానవుడా! జీవితంలో ఏడవటానికి నువ్వు రాలేదు. క్షణికమైన సుఖాలు పొందటానికి రాలేదు. భయపడటానికి బాధ పడటానికి రాలేదు. ఆనందం పొందటానికి వచ్చావు. నువ్వు ఆత్మ పదార్థానివి. నీకు కష్టాలు సుఖాలు బాధలు, దుఃఖము ఏవీ ఉండవు, ఈ విషయం తెలుసుకో. ఇది తెలిస్తే నిన్ను నువ్వు తెలుసుకున్నట్లే.

నేను అంటే శరీరం కాదు–ఆత్మ. ఈ విషయం ఎప్పుడైతే తెలుసుకుంటావో, ఆ మరుక్షణంలోనే పరమపదం చేరతావు. పరమాత్మలో లీనమై పోతావు. కాబట్టి నేను ఎవరు? అన్నప్పుడు నువ్వు ఆత్మవి. భగవత్స్వరూపానివి అని తెలుసుకో.

# 9. దర్భ

దీని పేరు వినగానే మనకు అనేక విషయాలు గుర్తొస్తాయి. గ్రహణం వస్తోంది అంటే ఇంట్లో అన్ని పదార్థాల మీద దర్భపుల్లలను వేస్తాం వివాహాది శుభకార్యాలలో దీన్ని వాడతాం. అపరకర్మలలో వాడతాం. యజ్ఞయాగాది క్రతువులలో దీన్ని వాడతాం. ఇన్నెందుకు సామాన్యంగా దర్భ లేకుండా ఏ కార్యక్రమము జరగదు. అంటే దర్భ యొక్క ప్రాముఖ్యత ఏమిటో తెలుస్తోంది. ఇది చాలా పవిత్రమైనది అని హిందువుల నమ్మకం. అపవిత్రమైన వాటిని కూడా పవిత్రం చేస్తుంది. వస్తువులు అపవిత్రం కాకుండా కాపాడుతుంది.

ఇంత పవిత్రత గలిగిన ఈ దర్భ ఒక గడ్డిజాతి మొక్క. దీన్ని ఇంగ్లీషులో Halfa Grass, Big Card Grass, Salt Reed Grass అంటూ ప్రాంతాలవారీగా వివిధ పేర్లుతో పిలుస్తారు. మనకు తెలిసినంత వరకు ఈ గడ్డి నాలుగు రకాలుగా ఉంటుంది.

**1. దర్భజాతి :** దీన్ని ఎక్కువగా అపర కర్మలకు వాడతారు.

**2. కుశజాతి :** దీని వివాహాది శుభకర్మలకు వాడతారు.

**3. బర్హిస్సుజాతి :** దీన్ని యజ్ఞయాగాది క్రతువులకు వాడతారు. హోమకుండం చుట్టూ నాలుగు వైపులా ఈ దర్భలు వేస్తారు.

**4. శరము :** దీన్ని ఇళ్ళు కట్టుకోవటానికి వాడతారు. మనం దీన్ని రెల్లు అంటాం. రెల్లు గడ్డిని ఇంటిపైన కప్పుతారు. ఈ రెల్లు గడ్డిలోనే సుబ్రహ్మణ్యేశ్వరుడు ఆవిర్భవించాడు. అందుకే ఆయన **శరవణభవుడు** అనబడతాడు.

ఇది ఎంత పవిత్రమైనదంటే వినత కద్రువల కథలో తల్లిని దాస్యం నుంచి విముక్తురాలుగా చేయటాని వైనతేయుడు స్వర్గం నుంచి అమృత భాండాన్ని తెచ్చి దర్భలమీద ఉంచుతాడు. అంటే అమృతాన్ని ఉంచేంత పవిత్రమైనది దర్భ. ఇది చాలా పదునుగా ఉంటుంది. యాధాలాపంగా ఉంటే చేతులు తెగిపోతాయి. ఇంద్రుడు అమృత భాండాన్ని తీసుకుపోయిన తరువాత అమృత బిందువులు దర్భలమీద పడి ఉండచ్చు అనే ఆశతో నాగులు ఆ దర్భలను నాలికతో నాకుతాయి. దాంతో వాటి నాలుకలు రెండుగా చీలిపోయాయి. ఇప్పుడు పాముకు రెండు నాలుకలు ఉండటానికి అదే కారణము అంటున్నాయి మన పురాణాలు.

ఇంత పవిత్రమైన దర్భ ఎలా ఆవిర్భవించింది. అనే దాని వెనక పెద్ద కథే ఉంది. దర్భ విశ్వామిత్ర సృష్టి అని కొందరి అభిప్రాయము. అయితే కూర్మ పురాణంలో దీన్ని గురించిన వివరణ ఉంది. దేవదానవులు అమృతం కోసం క్షీరసాగరాన్ని మధిస్తారు. ఆ సమయంలో మందరగిరి కవ్వముగా, వాసుకి త్రాడుగా వాడుకున్నారు. మందరగిరి పెద్ద పర్వతము, చాలా బరువుగా ఉంటుంది. సముద్రంలో వెయ్యగానే ఇది కాస్తా మునిగిపోయింది. అప్పుడు శ్రీమహావిష్ణువు కూర్మావతారమెత్తి ఆ పర్వతాన్ని మోస్తాడు. ఆయన వీపుమీద మోస్తుండగా దేవదానవులు వాసుకి సాయంతో మందరగిరిని సముద్రంలో కవ్వంలాగా అటూ ఇటూ త్రిప్పారు. అలా తిరిగేటప్పుడు ఆ పర్వతం కూర్మము యొక్క వీపుమీదనే ఉంది. ఆ రాపిడికి కూర్మము యొక్క వీపుమీది వెంట్రుకలు ఊడి సముద్రంలో పడిపోయినాయి. సముద్రపు అలలకు అవి మెల్లగా వడ్డుకు చేరి గడ్డిగా రూపాంతరం చెందాయి. ఆ గడ్డే దర్భ అని పిలువబడుతోంది. అయితే క్షీరసాగర మధనంలో అంతిమ ఘట్టం అమృతం ఆవిర్భవించటము. ధన్వంతరి అమృతపాత్రను చేత్తో తీసుకువస్తాడు. ఆ పాత్రలో ఉన్న అమృతం కదిలి కొన్ని చుక్కలు ఈ గడ్డిమీద పడ్డాయి. ఇలా అమృతపానం చేసిన కారణం చేతనే దర్భకు పవిత్రత వచ్చింది.

వరాహపురాణంలో ఈ దర్భలు వరాహ రూపంలో విష్ణుమూర్తి శరీరం మీది వెంట్రుకలు అని చెప్పబడింది. అందుచేత దర్భను విష్ణుమూర్తి రూపంగా భావిస్తారు. భాద్రపద మాసంలో అష్టమి రోజున దర్భకు ప్రత్యేక పూజలు కూడా చేస్తారు. గతంలో చెప్పినట్లుగా దర్భ అత్యంత పవిత్రమైనది. దేన్నైనా పవిత్రం చేసే శక్తి గలది అని మన విశ్వాసం, ఆయుర్వేద వైద్యంలో దర్భకు చాలా ప్రాముఖ్యత ఉంది. విరేచనాలు, రక్తస్రావం, మూత్రపిండాలలో రాళ్ళు, మూత్రవిసర్జనలో ఇబ్బందులు సరిచేయటానికి దర్భని మందుగా చెప్పారు. ముంజ పర్వతం మీద పెరిగిన దర్భ అతిసార వ్యాధిని తగ్గిస్తుంది అని అధర్వణ వేదం చెబుతోంది.

గ్రహణ కాలంలో అన్ని వస్తువుల మీద దర్భలు వేస్తారు అని గతంలో చెప్పుకున్నాం. సైన్సు ప్రకారం గ్రహణ సమయంలో మనకు హాని కలిగించే కిరణాలు కొన్ని భూమిమీదకి ప్రసరిస్తాయి. ఈ కిరణాలు దర్భలను దాటి వెళ్లలేవు అనేది మన నమ్మకం. మన శాస్త్రాలు అదే విషయాన్ని చెబుతున్నాయి. ఈ మధ్య జరిగిన

పరిశోధనలు కూడా ఈ విషయాన్ని బలపరిచాయి. ఈ కారణం చేతనే పూర్వ కాలంలో శాస్త్రవేత్తలనే మన ఋషులు ఇంటిని దర్భ గడ్డితోనే కప్పండి అన్నారు. అందుకే గతంలో ఇళ్ళన్నీ రెల్లుగడ్డితో కప్పబడి ఉండేవి. రెల్లు ఒక రకమైన దర్భజాతి అని గతంలో మనం చెప్పుకున్నాము. ఆఫ్రికా దేశంలో అడవులలో జీవించే వారుకూడా రెల్లుతోనే ఇళ్ళు కప్పుకునే వారట. ఈ రకంగా మన దేశంలో రెల్లుతో ఇల్లు కప్పటమనేది ఒక సంప్రదాయమై పోయింది. ప్రతి సంప్రదాయం వెనుక సైన్సు రహస్యం ఉన్నది అనే మాట మరొక్కసారి గమనించండి. కాలక్రమంలో దర్భ విరివిగా దొరకటం తగ్గింది. జనాభా పెరిగింది. నాగరికత కూడా బాగా పెరిగింది. ఇంటిపై కప్పుగా దర్భగడ్డిని వాడటం మూఢాచారం అయింది. అయినప్పటికీ దర్భతో ఇల్లు కప్పకపోయినా, కనీసం ఇంట్లో రెండు దర్భ పుల్లలు ఉంచుకోండి. దీనివల్ల గ్రహణ సమయంలో విషపూరిత కిరణాలు మన ఇంట్లోకి రావు అని చెబుతూ, గ్రహణ కాలంలో ఇంట్లో దర్భలు వేస్తున్నారు. ఈ రోజున అలా దర్భని వాడటం కూడా తగ్గిపోయింది. యెక్స్‌రే కిరణాలు దర్భల నుంచి ప్రసరించవు. దీన్ని కొంతమంది శాస్త్రవేత్తలు పరిక్షించారు కూడా.

జపం చేసుకునేటప్పుడు, ఇతర శుభకార్యాల్లో కూర్చోవటానికి దర్భాసనాలే వాడాలి. ఈ విషయం భగవద్గీతలో భగవానుడు కూడా చెప్పాడు. తైత్తిరీయోప నిషత్తులో **బర్హిషావై ప్రజాపతిః** బర్హిష అనే గడ్డిమీద ప్రజలను ఉత్పనం చేశారు అని చెప్పబడింది. దర్భగుడి ఎక్కువగా ఉండే ద్వీపమే **కుశద్వీపము** అని చెబుతోంది ఋగ్వేదం.

వేదం వల్లె వేసేటప్పుడు దర్భ ఉంగరం కుడిచేతికి ధరించాలి. అపర కర్మలకి ఒకే ఆకు ఉండే దర్భని, శుభకర్మలకి రెండు ఆకులు ఉండే దర్భని, పిత్రుతర్పణాలు ఇచ్చేటప్పుడు మూడు ఆకులు ఉండే దర్భని, పూజా కార్యక్రమాలకు నాలుగు ఆకుల దర్భని వాడాలి అంటోంది శాస్త్రం. తద్దినం పెట్టేటప్పుడు భోక్తలు గనక దొరక్కపోతే, ఆ స్థానంలో దర్భపుల్ల ఉంచి కార్యం నడిపించవచ్చు. అలాగే హోమాది కార్యక్రమాల్లో దక్షిణదిశగా బ్రాహ్మణుడికి బదులుగా దర్భలు ఉంచవచ్చు. **'బ్రాహ్మణం దక్షిణతో దర్భేషునిషాద్యా'** అని మంత్రం.

దర్భ కొనల నుంచి తేజస్సు ఆవిర్భవిస్తుంది. అది దేవతలను, పితృదేవతలను కూడా ఆకర్షించి మన ముందు నిలబెడుతుంది. తద్వారా మనం చేసే కార్యక్రమం సజావుగా, సానుకూలంగా సాగుతుంది.

ఇక్కడ మనం గ్రహించాల్సిన విషయం ఇంకోటుంది. దర్భలో ఉండే సహజ సిద్ధమైన గుణాలు, దాన్ని నేల నుండి వేరు చేసిన తరువాత ఆరునెలల వరకే ఉంటాయి అంటోంది శాస్త్రం. ఈ దర్భల వల్ల జనుల యొక్క కోపం తగ్గుతుంది అంటోంది అధర్వణ వేదం. దర్భ గనక ఎక్కువగా వాడితే మనలో సత్వగుణం బాగా పెరుగుతుంది. దర్భని గోటితో చీల్చరాదు. అలా చేస్తే మనలో సత్త్వగుణం తగ్గి రజోగుణం, తమోగుణం పెరుగుతాయి.

దర్భని నేలనుండి ఎప్పుడు బడితే అప్పుడు వేరు చెయ్యకూడదు. బహుళ పాడ్యమి రోజునే వీటిని కోసి తీసుకోవాలి.

దర్భ గుబురుగా పెరుగుతుంది. అందుకే స్నానం చేసేటప్పుడు దర్భలు నెత్తిన పెట్టుకుని 'ఓ దర్భా! నీకు లాగానే మా వంశం కూడా దుబ్బులు దుబ్బులుగా బాగా పెరగాలి అనే అర్థం వచ్చే మంత్రం చెబుతాం.

ఈ రకంగా దర్భలవల్ల అనేక ఉపయోగాలున్నాయి. కార్యక్రమాలలో దర్భ వాడకం చాదస్తం కాదు. ఇది విజ్ఞానశాస్త్రపరమైనది అని అర్థం చేసుకుందాం.

## 10. జ్ఞానదీపం

లోకంలో జనులందరూ ఐహిక వాంఛలలో పడి కొట్టుమిట్టాడుతూ, అజ్ఞానాంధకారంలో కూరుకుపోతున్నారు. ఎప్పుడైతే 'ఐహిక వాంఛలు అశాశ్వతాలు' వాటి వల్ల పొందే సుఖం క్షణికమైనది. అనే విషయం అర్థమైందో, అప్పుడు ఐహిక బంధాలను త్రెంచుకుంటాడు. తనలోని జ్ఞానజ్యోతులను వెలగించుకుని పరమాత్మను దర్శించగలుగుతాడు. దీనికి ఒక చిన్న ఉదాహరణ చూడండి.

పూర్వకాలంలో ఒక సాధకుడు దైవత్వాన్ని గురించి తెలుసుకోవాలి అనుకున్నాడు. విపరీతమైన సాధన చేసి తనలోని జ్ఞానజ్యోతులను వెలిగించుకోవాలి

అనుకున్నాడు. ఇది ఎలా సాధ్యం అనే విషయం ఆలోచించాడు. ఎవరైనా ఒక గురువు దొరికితే బాగుండు అనుకుని గురువు వెతుకుతూ బయల్దేరాడు. నిర్జన ప్రదేశాలు, నదీతీరాలు, కొండలు, అడవులూ అన్నీ తిరుగుతున్నాడు గురువు గారి కోసం. పోగా పోగా ఒక అడవిలో పెద్దగుహ కనిపించింది. అందులో ఒక మహానుభావుడు చాలా సంవత్సరాలుగా తపస్సు చేస్తున్నాడు అని విన్నాడు. ఆయన్ను కలిస్తే మార్గం చూపక పోడు అని ఆలోచించి గుహలోకి ప్రవేశించాడు. గుహలో ఒక చిన్నదీపం వెలుగుతోంది. ఆ వెలుగులోనే గుహలోపలకు వెళ్ళాడు. అతడు లోపలికి వెడుతున్న దగ్గర నుంచి దీపపు కాంతి తగ్గిపోవటం మొదలు పెట్టింది. అతడు గుహలోపలకు వెళ్లేసరికి దీపం పూర్తిగా ఆరిపోయింది. ఇప్పుడు ఆ గుహ అంతా గాఢాంధకారం అలముకుంది. చిమ్మచీకట్లో అతడికి భయం వేసింది. దాంతో ఒక్కసారిగా బిగ్గరగా భగవన్నామాన్ని జపించాడు. ఓం నమశ్శివాయ అంటూ అరిచాడు. ఆ అరుపు విన్న తాపసి 'ఎవరది' అన్నాడు. వెంటనే సాధకుడు 'స్వామీ! నేను భగవంతుణ్ణి గురించి పూర్తిగా తెలుసుకోవాలనుకుంటున్నాను. మీ అనుగ్రహం కోసం వచ్చాను' అన్నాడు.

అతణ్ణి పరిక్షించాలి అనుకున్నాడు తాపసి. వెంటనే సాధకుడితో నాయనా ! ఆ ప్రక్కనే అగ్గిపెట్టె ఉంది. దీపపు ప్రమిద ఉన్నది. అగ్గిపెట్టె తీసుకుని దీపాన్ని వెలిగించు' అన్నాడు.

సాధకుడు అగ్గిపుల్ల వెలిగించాడు. దీపపు వత్తి అంటూ కోలేదు. మళ్ళీ ప్రయత్నించాడు. దీపం వెలగలేదు. మళ్ళీ మళ్ళీ ప్రయత్నించాడు. అగ్గిపెట్టెలో పుల్లలన్నీ అయిపోయినాయి. దీపం మాత్రం వెలగలేదు. అదే విషయాన్ని తాపసితో చెప్పాడు

అప్పుడు ఆయన 'ప్రమిదలో ఉన్న నీటిని తీసివేసి ఆ ప్రక్కనే ఉన్న చమురును పోసి ఇంకొక అగ్గిపెట్టె తీసుకుని ప్రయత్నించు' అన్నాడు.

అలాగే చేశాడు సాధకుడు. ఐనా దీపం వెలగలేదు. అప్పుడు తాపసి 'నాయనా! దీపపు వత్తి నీటిలో బాగా తడిసిపోయింది. ఆ వత్తి బాగా ఎండబెట్టి అప్పుడు ప్రయత్నించు' అన్నాడు.

సాధకుడు వత్తిని పూర్తిగా ఎండబెట్టి, చమురుతో తడిపి అగ్గిపుల్లతో అంటించాడు. దీపం వెలిగింది. ఇప్పుడు సాధకుడు ఆ దీపపు వెలుగులో తాపసి కాళ్ళు పట్టుకుని జ్ఞానజ్యోతులు వెలిగించే మార్గం చెప్పమని వేడుకున్నాడు. ఆ మాటలు విన్న తాపసి చిరునవ్వు నవ్వి 'ఇప్పుడు నేను చెప్పిందంతా అదే కదా!' అన్నాడు.

విస్తుబోయాడు సాధకుడు. 'స్వామీ! నాకు సరిగా అర్థం కాలేదు. వివరంగా చెప్పండి అన్నాడు. ఇప్పుడు గురువుగారు వివరించటం మొదలుపెట్టారు.

నీ హృదయం అనే ప్రమిదలో వత్తి అనే ఆత్మ ఉన్నది. అది ఇన్ని సంవత్సరాలుగా రాగద్వేషాలు, అహంకార, మమకారాలు, అరిషడ్వర్గాలు అనే నీటిలో తడిసి పూర్తిగా నానిపోయింది. అందుచేతనే నీలో జ్ఞానజ్యోతులు వెలగటం లేదు. ఇప్పుడు ఆ నీటిని ప్రమిదలో నుంచి తీసివేసి ప్రేమ, కరుణ అనే చమురుతో నింపు. ఆత్మ అనే వత్తిని విచక్షణ అనే ఎండలో ఆరబెట్టు. నిరంతర సాధన అనే అగ్గిపుల్లతో వత్తిని వెలిగించు. నీలో జ్ఞానజ్యోతులు వెలుగుతాయి.

భగవంతుడు అపార కరుణామయుడు. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. పిపీలికాది బ్రహ్మపర్యంతము పరమేశ్వర స్వరూపమే. ఇదే దైవత్వం అంటే. మానవుడికి స్వార్ధచింతన పనికిరాదు. సర్వమానవ సమానత్వము, సర్వ మానవ సౌభ్రాతృత్వము, విశ్వకల్యాణము, విశ్వశాంతి. ఎప్పుడూ వీటినే కోరాలి. రాగద్వేషాలు అహంకార, మమకారాలు పూర్తిగా విడిచి పెట్టెయ్యాలి.

అప్పుడు జగత్తంతా పరబ్రహ్మ స్వరూపంగానే కనిపిస్తుంది. నీలో అజ్ఞానం నశించి జ్ఞానోదయమై, 'నేనే పరబ్రహ్మని' అనే స్థాయికి చేరతావు అని చెప్పాడు తాపసి.

మనలో జ్ఞానజ్యోతులు వెలగాలంటే, దైవత్వాన్ని దర్శించాలంటే, స్వార్ధాన్ని పూర్తిగా వదలి జగత్తంతా పరమేశ్వర స్వరూపమే అని భావించాలి.

# 11. యోగా-ధ్యానం

ఉదయాన్నే లేవటము యోగాసనాలు వెయ్యటం. తరువాత కొంతసేపు ధ్యానం చెయ్యటం. ఇది మనదేశంలో అనాదిగా వస్తున్న ఆచారం. ఋషీశ్వరులు, మునీశ్వరులు అందరూ కూడా ఉదయాన్నే యోగాసనాలు వేసేవారు. కేవలము ఆసనాలు వేస్తే శారీరక పరిశ్రమ అది మంత్రంతో కలిస్తే యోగాసనము అవుతుంది. ఈ రోజున కూడా చాలామంది ఉదయం పూట ఆసనాలు వేస్తాము అని చెబుతారు. ఇది శరీరాన్ని మన అదుపులో ఉంచుకోవటానికి చేసే ప్రక్రియ. కొంతమంది ధ్యానం చేస్తాము అంటారు. ధ్యానము అంటే ధ్యేయమైన వస్తువు మీద దృష్టిని నిలిపి ఏకాగ్రత సాధించటం. ఈ రెండూ యోగము, ధ్యానము ప్రతివారు తప్పనిసరిగా చెయ్యాలి.

ప్రతిరోజు క్రమం తప్పకుండా ఆహారం తీసుకోవాలి. అలా కాకుండా వీలైన సమయంలో, ఇష్టం వచ్చినప్పుడు ఆహారం తీసుకోరాదు. ఒక రోజు మధ్యాహ్నం 12 గం॥కు ఇంకొక రోజు 2 గం॥కు, వేరొక రోజు 3 గం॥కు ఇలా భోజనం చెయ్యరాదు. ప్రస్తుతము ఏ రకమైన తేడా కనిపించకపోయినా, పోను పోను ఆరోగ్యం పాడవుతుంది. మనం తీసుకున్న ఆహారం 24 గం॥ల్లో పూర్తిగా అరిగిపోవాలి. మనం తిన్న ఆహారం జీర్ణమయి రక్తంగా మారుతుంది. ఆ రక్తం మాంసంగా, ఎముకలు, ఎముకలలో ఉండే మూలుగు ఇంకా శరీర భాగాలయిన చర్మము, వెంట్రుకలు గోళ్ళుగా రూపాంతరం చెందుతుంది. పనికిరాని పదార్థం బయటకు విసర్జించబడుతుంది. ఇదంతా 24 గం॥లలోపు జరిగిపోతుంది. ఒకవేళ ఏ కారణం చేతనైనా అలా జరగకపోతే ఆరోగ్యం చెడిపోతుంది. కలుషితమైన ఆహారం తిన్నప్పుడు అది జీర్ణం కాదు. అందువల్ల కడుపునొప్పి, విరేచనాలు, వాంతులు మొదలైనవి సంక్రమిస్తాయి. అలాగే దాహం వేసినప్పుడు నీరు త్రాగుతాం. ప్రతి మానవుడు పుష్కలంగా నీరు త్రాగాలి. అలా త్రాగితే జీర్ణప్రక్రియ తేలిక అవుతుంది. మూత్రపిండాలు సక్రమంగా పనిచేస్తాయి. మనం త్రాగిన నీరు 4 గం॥ల లోపుగా శరీరంలోని వివిధ భాగాలకు చేరిపోవాలి. మిగిలినది పనికిరాని నీరు మూత్రాశయం చేరిపోవాలి. తద్వారా బయటకు విసర్జించబడాలి. ఒకవేళ అలా జరగకపోతే

మూత్రాశయ సంబంధ వ్యాధులు వస్తాయి. మూత్రపిండాలు దెబ్బ తింటాయి. మనం పీల్చిన గాలి లోపలికి వెళ్ళిన తరువాత, అందులోని ఆక్సిజనును శరీరం తీసుకుని కార్బన్ డయాక్సైడును బయటకు పంపించేస్తుంది. ఈ ప్రక్రియ కేవలం ఒక నిమిషంలోనే జరిగిపోవాలి. లేకపోతే ఊపిరితిత్తులు సరిగా పని చెయ్యటం లేదన్నమాట. వీటిని బట్టి మనకి తెలిసేదేమంటే

మనం తిన్న ఆహారం - 24 గం॥ లోపల

మనం త్రాగిన నీరు - 4 గం॥ లోపల

మనం పీల్చిన గాలి - ఒక నిమిషం లోపల

బయటకు వచ్చెయాలి. శరీర భాగాలు తప్ప బయట నుంచి వచ్చిన ఏ పదార్థము ఎక్కువ కాలం శరీరంలో ఉండరాదు. ఉంటే అది అనారోగ్య హేతువు.

ఎవరిమీదో మనకి కోపం వచ్చింది. ఒక్కోసారి అది పగగా మారి జీవితాంతం మనలో రగులుతూనే ఉంటుంది. కోపం వచ్చినప్పుడు బి.పి. పెరుగుతుంది. దానివల్ల గుండెకు సంబంధించిన వ్యాధులు వచ్చే ప్రమాదం ఉంది. బి.పి.కి తోడు షుగరు కూడా కలిస్తే, అంటే రక్తపోటు, చక్కెర వ్యాధి రెండూ కలిస్తే ఇంకేముంది? అగ్నికి వాయువు తోడైనట్లే శరీరారోగ్యం త్వరగా దెబ్బ తింటుంది. అనేకమైన క్రొత్త రోగాలు వస్తాయి. ఇల్లు వళ్ళు గుల్లై పోతుంది.

అసూయ, ద్వేషం, మోసం (కపటం) ఇవన్నీ కూడా ఈ కోవకు చెందినవే. ఇవి గనక శరీరంలో తిష్ఠ వేస్తే, జేబులో నిప్పును దాచుకున్నట్లే. ఆరోగ్యం అతిత్వరలో నాశనమవుతుంది. ప్రతిరోజు మన వయసు పెరుగుతోంది. ప్రతిరోజునే కాదు ప్రతిక్షణం వయసు పెరుగుతోంది. దీనికి గుర్తుగా ఆనందంగా ప్రతి సం॥ము పుట్టినరోజు వేడుకలు ఘనంగా జరుపుకుంటాం. ఒకరోజు గడిచింది అంటే, నీ వయసు ఒకరోజు పెరిగిందన్న మాట. జాగ్రత్తగా ఆలోచిస్తే వయసు పెరుగుతోంది అనుకుంటాం కాని రోజు రోజుకు ఆయుష్షు తగ్గిపోతోంది అని తెలుసుకోము. వయసు పెరిగితే ఆయువు తగ్గినట్లే. ప్రతిరోజు నెగిటివ్ ఎనర్జీలతో మన ఆయుష్షు తగ్గిపోతోంది.

మనం పీల్చేగాలి కల్తీ, తినే ఆహార పదార్థాలు కల్తీ. స్కూటర్‌లో పోసే పెట్రోలు దగ్గర నుంచి ప్రతి పదార్థము కల్తీనే. మరి ఈ కల్తీ ప్రపంచంలో ఆరోగ్యంగా ఉండమంటే ఎలా ఉండగలం. ఇవన్నీ పోవాలంటే కల్తీ పదార్థాలు తినటం మానెయ్యాలి. అసూయ, ద్వేషం, పగ, ప్రతీకారం కోపం వీటికి శరీరంలో స్థానం కల్పించకూడదు. సాధ్యమైనంత వరకు శాంత స్వభావాన్ని అలవాటు చేసుకోవాలి. మన జీవితాన్ని మృతప్రాయం చేస్తున్న కోపము, ఒత్తిడి, ద్వేషము మొదలైనవే కాదు బద్ధకము, అనారోగ్యము వంటి వాటిని కూడా బయటకు పంపెయ్యాలి. శరీరాన్ని ఎప్పుడూ మన అదుపులోనే ఉంచుకోవాలి. మనం చెప్పినట్లు శరీరం వినాలి అంతేగాని శరీరం చెప్పినట్లుగా మనం వినే స్థితి రాకూడదు. అటువంటి స్థితి వచ్చిందంటే మనం వ్యాధిగ్రస్తులమైనట్లే. మంచాన పడ్డట్టే.

ఇవి రాకుండా ఉండాలంటే ప్రతిరోజు తప్పనిసరిగా వ్యాయామం చెయ్యాలి. లేదా యోగా చెయ్యాలి. దీనివల్ల శరీరం అదుపులో ఉంటుంది. మనం చెప్పినట్లు వింటుంది. ధ్యానం చేస్తే వత్తిడి తగ్గుతుంది. స్థిరత్వం ఏర్పడుతుంది. నిలకడ, నిదానం అలవడతాయి. ఏకాగ్రత పెరుగుతుంది. అన్నింటికీ మించి కోపము, అసూయ, ద్వేషము మొదలైన వాటిని నియంత్రించటం జరుగుతుంది.

శరీరంలోకి అధిక మొత్తంలో ప్రాణశక్తిని పంపే ఏకైక మార్గం యోగమే.

అందుకే ప్రతివారు ప్రతిరోజు యోగా, ధ్యానం తప్పనిసరిగా చెయ్యండి. ఆరోగ్యాన్ని కాపాడుకోండి.

## 12. ధర్మం పది రకాలు

దేశ కాలమాన పరిస్థితులను బట్టి పదిమందికి ఉపయోగపడేదే ధర్మము. సమాజ శ్రేయస్సుకు ఉపయోగపడేదే ధర్మము. జాతిని నీతి నియమాలతో, కట్టుబాట్లతో ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దేదే ధర్మము. ఈ ధర్మము పది రకాలుగా ఉంటుంది.

**ధృతి క్షమా దమోస్తేయం శౌచమింద్రియ నిగ్రహః**
**ధీర్విద్యా సత్యమక్రోథో దశకం ధర్మలక్షణం ॥**

1. ధృతి - ధైర్యము, నిలకడ
2. క్షమ - ఎటువంటి తప్పునైనా క్షమించే గుణం
3. దమము - బాహ్యేంద్రియ నిగ్రహము
4. అస్తేయము - దొంగతనం చెయ్యకుండా ఉండటం, అక్రమార్జన లేకుండా ఉండటం
5. శౌచము - శుచిత్వము
6. ఇంద్రియ నిగ్రహము - అంతరింద్రియ నిగ్రహము
7. ధీ - బుద్ధి కలిగి ఉండటము
8. విద్యా - జ్ఞానం కలిగి ఉండటము
9. సత్యము - ఎప్పుడూ నిజమే చెప్పటం
10. అక్రోధము - కోపం లేకపోవటం

ఈ పది ధర్మ లక్షణాలు అనబడతాయి అంటోంది నీతిశాస్త్రము. వీటిని విడివిడిగా చూద్దాం.

**1. ధృతి :** ధైర్యము. ఎటువంటి పరిస్థితులలోనైనా సరే భయపడకుండా నిలబడటము. యుద్ధంలో శత్రువు మనకన్న బలవంతుడైనా సరే, అతని చూసి భయపడరాదు. మనం భరించలేని, ఊహించని కష్టాలు ఎదురైనా సరే ఏ మాత్రం చెక్కు చెదరకుండా పిరికితనం ప్రదర్శించకుండా వాటిని ఎదిరించాలి. అంతేగాని కష్టాలకు భయపడి పారిపోవటం, ఆత్మహత్య చేసుకోవటం, శత్రువుకు భయపడి వెన్ను చూపటం వంటివి చేయరాదు. ఎప్పుడూ నిలకడగా మొక్కవోని ధైర్యాన్ని ప్రదర్శించాలి.

**2. క్షమ :** క్షమించే గుణం ఎదుటి వ్యక్తి ఎంత తప్పు చేసినా సరే, అతణ్ణి క్షమించటం. రామరావణ సంగ్రామంలో చివరి సమయంలో కూడా రాముడు అంటాడు. 'రావణుడు గనక తన తప్పు తెలుసుకుని సీతను ఒప్పగిస్తే, అతణ్ణి సంహరించను. క్షమించి వదిలేస్తాను' అని. యుద్ధంలో జయించటము అంటే శత్రువును సంహరించటం కాదు. అతను చేసిన తప్పును అతను తెలుసుకునేటట్లు చెయ్యటం. అతనిమీద ఆధిపత్యాన్ని సంపాదించటం. నీకు తీరని ద్రోహం చేసిన వాణ్ణి కూడా మన్నించగలగటమే క్షమ.

**3. దమము :** బాహ్యేంద్రియ నిగ్రహము.

ఇంద్రియ నిగ్రహము రెండు రకాలుగా ఉంటుంది.

1. అంతరింద్రియ నిగ్రహము. దీన్నే శమము అంటారు.

2. బాహ్యేంద్రియ నిగ్రహము. దీన్ని దమము అంటారు. సాధనా చతుష్టయంలో ఈ రెండింటినీ చెప్పటం జరుగుతుంది.

ఇక్కడ బాహ్యేంద్రియ నిగ్రహాన్ని వివరిస్తున్నారు. ఏదైనా సరే ఒక వస్తువుని ఇంద్రియాల ద్వారానే అనుభవించటం జరుగుతుంది. ఇంద్రియాలు రెండు రకాలు 1. అంతరింద్రియాలు 2. బాహ్యేంద్రియాలు.

బాహ్యేంద్రియాల ద్వారా అనుభవించటము అంటే నచ్చిన దృశ్యాన్ని కళ్ళతో చూడటము. నచ్చిన శబ్దాన్ని చెవులారా వినటం. నచ్చిన పదార్థాన్ని నాలుక ద్వారా రుచి చూడటం. నచ్చిన సువాసనను ముక్కు ద్వారా పీల్చటం. నచ్చిన వస్తువును తనివితీరా స్పృశించటం. ఇది బాహ్యేంద్రియాల ద్వారా అనుభవించటము అంటే. ఈ పనులు చెయ్యరాదు. సాధకుడు ఇంద్రియ నిగ్రహం కలిగి ఉండాలి కాబట్టి మొదటగా బాహ్యేంద్రియాలను కట్టడి చెయ్యాలి.

**4. అస్తేయము :** దొంగతనం చెయ్యకుండా ఉండటము. ఇక్కడ దొంగతనము అంటే ఇతరుల వస్తువులను వారికి తెలియకుండా, వారికి చెప్పకుండా తీసుకువెళ్ళి పోవటం. ఇది భౌతిక ప్రక్రియ. ఇక్కడ భౌతికంగానే కాదు మానసికంగా కూడా ఆ పని చేయరాదు. నిజంగా ఆ వస్తువును మనం తీసుకు వెళ్ళకపోయినా దాన్ని తీసుకు పోవాలనే ఆలోచన కూడా మనకు రాకూడదు. ఇక్కడ కేవలము దొంగతనమే కాదు. అక్రమార్జన కూడా ఇలాంటిదే. కమిషన్లు, లంచాలు తీసుకోవటం కూడా ఈ కోవలోకే వస్తాయి.

**5. శౌచము :** శుచిత్వము. ఎప్పుడూ నియమ నిష్ఠలతో కాలం గడపటం.

**6. ఇంద్రియ నిగ్రహము :** శమము. ఇందాక మనం ఇంద్రియ నిగ్రహము రెండు రకాలు 1. శమము 2. దమము అని చెప్పుకున్నాం. అక్కడ దమాన్ని వివరించుకున్నాం. ఇప్పుడు శమమును వివరిస్తున్నారు.

శమము అంటే అంతరింద్రియ నిగ్రహం. మనకు చాలా ఇష్టమైన సన్నివేశం. నేను చూడను అని రెండు కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. కాని మనసు మాత్రం దానిమీదే ఉంటుది. ఇది పనికి రాదు. మామిడిపండు మనకు చాలా ఇష్టం. దాన్ని తినను అని శపథం చేశావు. తినటం మానేశావు. కాని మనసులో మాత్రం దాన్ని తినాలనే ఉంటుంది. మంచి సంగీతం. వినను అని చెవులైతే మూసుకున్నావు. కాని మనసులో అది వినాలనే ఉన్నది. సుగంధం. వాసన చూడను అన్నావు మానేశావు. కాని మనసు దానిమీదే ఉంది. అత్యంత ఇష్టమైన వస్తువును ముట్టుకోను అన్నావు. కాని దాన్ని స్పృశించాలని ఉంటుంది. ఈ రకమైన ఆలోచన కూడా రాకూడదు.

అంటే కేవలము ఇంద్రియాలనే కాదు మనసును కూడా కట్టడి చెయ్యాలి.

**7. ధీ :** బుద్ధి కలిగి ఉండటం. ఏది మంచి, ఏది చెడు అనే విషయాలు తెలుసుకోగలగటం.

**8. విద్యా :** జ్ఞానం కలిగి ఉండటం. ఏ పని చెయ్యాలి? ఏది చెయ్యకూడదు? అనే విచక్షణ కలిగి ఉండటం. జగత్తంతా పరమేశ్వరుడి చేతనే సృష్టించబడింది. ఇందులో జీవులన్నీ వాటి కర్మానుసారము వర్తిస్తున్నాయి. అనే విషయాన్ని తెలుసుకోవటం.

**9. సత్యము :** ఉన్నది ఉన్నట్లుగా, జరిగింది జరిగినట్లుగా చెప్పటం. నిజం చెప్పటం. ఇలా చెప్పటం వల్ల అనేక సమస్యలు వస్తాయి. హరిశ్చంద్రుడు రాజ్యాన్నే కాదు తన సర్వస్వాన్నీ కోల్పోయాడు. ఎన్ని కష్టాలు వచ్చినా అబద్ధం చెప్పకుండా ఉండాలి. అయితే బృహస్పతి యొక్క నీతిశాస్త్రం, శుక్రాచార్యుని నీతిశాస్త్రము ఈ విషయంలో విభేదిస్తున్నాయి. ఎట్టి పరిస్థితులలో నైనా సరే. ప్రాణాలు పోయినా సరే అబద్ధమాడరాదు అని చెబుతాడు బృహస్పతి. కాని

**వారిజాక్షులందు వైవాహికము లందు**
**ప్రాణవిత్తమాన భంగమందు**
**జకితగోకులాగ్ర జన్మరక్షణ మందు**
**బొంకవచ్చు అఘము పొంద దధిపా**

అంటాడు శుక్రాచార్యుడు వామనావతారంలో బలిచక్రవర్తితో

**10. అక్రోధము :** కోపం లేకుండా ఉండటము. పరమ శాంత స్వభావం కలిగి ఉండటం. ఇది దైవిక గుణం.

ధర్మం ఇలా పదిరకాలుగా ఉంటుంది. లోకంలో ప్రతి మానవుడు ఈ పది రకాలైన ధర్మాలు గనక పాటిస్తే దేశం సుభిక్షమవుతుంది. మనం కోరుకునే రామరాజ్యం స్థాపించబడుతుంది.

## 13. భగవంతుని మీద నమ్మకం

భగవంతుణ్ణి చేరాలంటే ముందుగా అతనిమీద అపారమైన నమ్మకం ఉండాలి. దీనికి ఒక చిన్న ఉదాహరణ చూడండి.

పూర్వ కాలంలో త్రిలోక సంచారి అయిన నారద మహర్షి భూలోకంలో సంచరిస్తున్నాడు. అలా సంచరిస్తుండగా నిత్యానుష్టానంలో నిమగ్నమైన ఒక బ్రాహ్మణుడు కనిపించాడు. నారదుడు అతని దగ్గరకు వెళ్ళి పలకరించాడు. కుశల ప్రశ్నలు అయిన తరువాత ఆ బ్రాహ్మణుడు “నారదా ! నేను ప్రతిరోజు, ప్రతి క్షణం శ్రీమన్నారాయణుని సేవలోనే గడుపుతున్నాను. వయసు పైబడుతోంది. ఓపిక తగ్గుతోంది. ఇంక ఎక్కువ కాలం జీవించలేను అనిపిస్తున్నది. ఎంత త్వరగా శ్రీమన్నారాయణుణ్ణి చేరదామా? అని ఎదురు చూస్తున్నాను. ఈసారి నువ్వు వైకుంఠానికి వెళ్ళినప్పుడు నా దేహంలోని జీవుడు నారాయణుని పాదపద్మాలకు ఎప్పుడు చేరతాడో ఆయన్ని అడిగి నాకు చెప్పు” అన్నాడు.

‘సరే’ అని నారదుడు అక్కడ నుంచి బయలుదేరి వెడుతుండగా ఊరి చివర మర్రిచెట్టు క్రింద ఒక చర్మకారుడు కనిపించాడు. అతణ్ణి పలకరించాడు నారదుడు. అతడు అత్యంత భక్తితో నారదుడికి నమస్కరించి ఇందాక బ్రాహ్మణుడు అడిగినట్లుగానే “స్వామీ! నన్ను వైకుంఠానికి ఎప్పుడు పిలిపించుకుంటాడో శ్రీమన్నారాయణుణ్ణి అడిగి చెప్పు” అన్నాడు. ఆశ్చర్యపోయాడు నారదుడు. అక్కడ బ్రాహ్మణుడు, ఇక్కడ చర్మకారుడు ఇద్దరూ ఒకే కోరిక కోరారు. విచిత్రంగా ఉంది. అనుకుంటూ అక్కణ్ణించి బయల్దేరి వెళ్ళిపోయాడు. ముల్లోకాలు సంచరిస్తూ చివరకి వైకుంఠం చేరాడు నారదుడు. అక్కడ శ్రీమన్నారాయణుడితో ముచ్చటిస్తూ భూలోకంలో బ్రాహ్మణుడు, చర్మకారుడు ఇద్దరూ అడిగిన ప్రశ్నలను ఆయన ముందు ఉంచాడు. శ్రీహరి చిరునవ్వు

నవ్వి 'నారదా! చర్మకారుడు ఈ జన్మలోనే నన్ను చేరతాడు. కాని బ్రాహ్మణుడు మాత్రం ఇంకా కొన్ని జన్మలు ఎత్తవలసి ఉంటుంది' అన్నాడు. ఆ మాటలు విన్న నారదుడు ఆశ్చర్యపోయాడు. బ్రాహ్మణుడు నియమనిష్ఠలతో సదా శ్రీహరిని సేవిస్తున్నాడు. చర్మకారుడికి అవేవీ తెలియవు. కాని చర్మకారుడు ఈ జన్మలోనే వైకుంఠం చేరితే, బ్రాహ్మణుడు మాత్రం ఇంకా కొన్ని జన్మలు ఎత్తాలి అంటున్నాడు హరి. ఏమిటి ఇందులోని ఆంతర్యం. ఆ మాటే శ్రీహరిని అడిగాడు నారదుడు.

నారదా ! ఇందులో ఆశ్చర్యం లేదు. ఒక పనిచెయ్యి. నువ్వు నన్ను ఈ ప్రశ్న అడిగినప్పుడు నేను సూది బెజ్జంలో ఏనుగును దూర్చే ప్రయత్నం చేస్తున్నానని వాళ్ళిద్దరికీ చెప్పు. విషయం నీకే అర్థం అవుతుంది అన్నాడు. సరే అని మళ్ళీ భూలోకానికి బయల్దేరాడు నారదుడు.

ముందుగా బ్రాహ్మణుడి దగ్గరకి వచ్చాడు. నారదుణ్ణి చూడగానే శ్రీహరి ఏమన్నాడు? అని అడిగాడు బ్రాహ్మణుడు. నారాయణుడు అత్యవసరంగా సూదిలో ఏనుగును ఎక్కించే ప్రయత్నం చేస్తున్నాడు అన్నాడు నారదుడు. ఆ మాటలు విన్న బ్రాహ్మణుడు పగలబడి నవ్వి 'నారదా ! ఎక్కడైనా సూది బెజ్జంలో ఏనుగు ఎక్కుతుందటయ్యా నీ పిచ్చి గాని. అయినా నారాయణుడు అలా చెయ్యటం ఏమిటి? తెలివితక్కువ కాకపోతే' అన్నాడు హేళనగా, నారదుడు అక్కడ నుంచి బయలుదేరి చర్మకారుడి దగ్గరకు వెళ్ళాడు. హరి ఏమన్నాడు? అని అడిగాడు చర్మకారుడు. అత్యవసరంగా సూది బెజ్జంలో ఏనుగును ఎక్కించే ప్రయత్నం చేస్తున్నాడు అన్నాడు నారదుడు. ఆ మాటలు వినన చర్మకారుడు అత్యంత వినయంతో లేచి నిలబడి "శ్రీమన్నారాయణుడు ఘటనా ఘటన సమర్ధుడు. లోకాలన్నీ ఒక్క క్షణంలో సృష్టించగలడు. మళ్ళీ ఒక్క క్షణంలో లయం చెయ్యనూగలడు. గతంలో బలవంతులైన రాక్షసులను ఎంతమందిని సంహరించలేదు. ఎంత మందిని రక్షించలేదు. సూది బెజ్జంలో ఏనుగును ఎక్కించటమంటే ఆయనకు ఒక లెక్కా మళ్ళీ ఏ గొప్ప పని చెయ్యాలనుకుంటున్నాడో?" అన్నాడు.

ఆ మాటలు విన్న నారదుడికి విషయం బోధ పడింది. చర్మకారుడికి నియమ నిష్ఠలు ఏవీ తెలియకపోవచ్చు. కాని భగవంతుడి మీద అపారమైన నమ్మకము, భక్తి ఉన్నాయి. అందుకే అతడు ఈ జన్మలోనే పరమపదం చేరతాడు. బ్రాహ్మణుడి.

ఆచారాలు, నియమ నిష్ఠలు ఉన్నాయి. కాని భగవంతుడి మీద నమ్మకం లేదు. అందుకే అతడు ఇంకా కొన్ని జన్మలు ఎత్తాల్సి వస్తుంది.

భగవంతుణ్ణి చేరాలంటే భక్తి, తత్పరత, నమ్మకము పూర్తిగా ఉండాలి. **అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ** అన్నవారే భగవంతుణ్ణి చేరగలుగుతారు.

## 14. జ్ఞానాదేవతు కైవల్యం

'కర్మ' అంటే పని అని అర్థం. మనం చేసే పనినే కర్మ అంటారు. అది మంచిది కావచ్చు, చెడ్డది కావచ్చు. అయితే మంచి చెడులు ఎలా నిర్ణయిస్తారు? సమాజానికి ఉపయోగించేది, హితవు కూర్చేది సత్కర్మ. విద్యాలయాలు, అన్నసత్రాలు కట్టించటం. దానధర్మాలు చెయ్యటం వంటివి. సమాజానికి చెడు చేసేది దుష్కర్మ. దొంగతనాలు, దోపిడీలు, హత్యలు వగైరా. మనం చేసే కర్మని బట్టే ఫలితం కూడా ఉంటుంది. సత్కర్మలు చేస్తే మంచి ఫలితం పుణ్యం వస్తుంది. దుష్కర్మలు చేస్తే చెడు ఫలితం పాపం వస్తుంది. వీటి ననుసరించే మానవుడు మరణానంతరము స్వర్గనరకాలు పొందుతాడు. మంచి పనులు చేసినవారు స్వర్గానికి పోతే చెడ్డ పనులు చేసినవారు నరకానికి పోతారు. కర్మఫలాన్ని అక్కడ అనుభవించి, కర్మశేషాన్ని అనుభవించటానికి మళ్ళీ భూలోకంలో జన్మిస్తాడు.

కర్మ రెండు రకాలుగా ఉంటుంది. 1.వెంటనే ఫలితాన్ని ఇచ్చేది. నిప్పులో చెయ్యి పెడితే కాలిపోతుంది. ఈ రకమైన కర్మ వెంటనే ఫలితాన్నిస్తుంది. 2.రెండవ రకమైన కర్మలో ఫలితం రావటానికి కొంత సమయం పడుతుంది. మితిమీరి తింటే అజీర్ణం చేసి కడుపునొప్పి వస్తుంది. ఆ నొప్పి తిన్న వెంటనే రాదు. అది రావటానికి కొంత సమయం పడుతుంది. అలాగే గర్భవతి అయిన స్త్రీ బిడ్డను ప్రసవించటానికి తొమ్మిది నెలలు సమయం పడుతుంది. అదే ఏనుగుకి 27 నెలలు పడుతుంది. ఈ రకమైన కర్మలో ఫలితం రావటానికి ఎంత సమయం పడుతుందనేది అన్ని సందర్భాలలోను మనం చెప్పలేం.

కర్మని మూడు రకలుగా విభజించారు. 1.సంచితకర్మ 2.ప్రారబ్ధకర్మ 3.ఆగామికర్మ.

**1.సంచితకర్మ :** మానవుడు చేసిన కర్మ అంతా ఒక చోట పోగు వేయబడుతుంది బ్యాంకులో డిపాజిట్ లాగా దాన్నే సంచితకర్మ అంటారు. ఈ కర్మ అంతా చేసిన మానవుడు అనుభవించాల్సిందే.

**2.ప్రారబ్ధకర్మ :** మానవుడు చేసిన కర్మను పూర్తిగా ఒకే జన్మలో అనుభవించలేడు. ఒక్కో జన్మలో కొంత చొప్పున అనుభవిస్తాడు. ఈ జన్మలో అనుభవించే కర్మనే ప్రారబ్ధకర్మ అంటారు. ఏ జన్మతో ఎంత అనుభవించాలి అనేది ఆ భగవంతుడే నిర్ణయిస్తాడు. ప్రారబ్ధకర్మ విడిచిపెట్టిన బాణంలాంటిది. అనుభవించక తప్పదు. అయితే భగవంతుని అనుగ్రహం వల్ల దీని తీవ్రతను తగ్గించవచ్చు. ఉదా॥ ఏదో ప్రమాదంలో తీవ్రగాయాలు కావలసి ఉండగా, భగవంతుడి అనుగ్రహం ఉంటే చిన్న దెబ్బలతో తప్పించుకుని బయట పడతాడు.

**3.ఆగామికర్మ :** ఈ జన్మలో చేసిన కర్మనే ఆగామి అంటారు. ఇది వెళ్ళి మళ్ళీ సంచితకర్మలో చేరుతుంది. అందుకే సంచితకర్మ పెద్ద కొండలాగా ఎప్పుడూ పెరుగుతూనే ఉంటుంది. అనుభవించటం వల్ల కర్మ క్షయం కాదు.

కర్మ ఎప్పుడూ జ్ఞానం చేతనే క్షయమవుతుంది. జ్ఞానాగ్నిలో సంచితకర్మ పూర్తిగా క్షయమవుతుంది. జ్ఞాని ఈ జన్మలో ఏ కర్మ చెయ్యడు. కాబట్టి ఆగామి ఉండదు. ప్రారబ్ధకర్మ క్షయంగానే జీవన్ముక్తుడై, ఆయుష్షు ఉన్నంతవరకు జీవించి, తరువాత పరమపదం చేరతాడు. పరమపదము అంటే ఉత్కృష్టమైన చోటు, పరమేశ్వరుడుండే ప్రదేశము అని అర్థం. అదే మోక్షం.

అయితే ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. జ్ఞాని కర్మ చేస్తే ఫలితం ఉంటుందా? దాన్ని అతడు అనుభవించాలా? పరమేశ్వరుడు గొప్ప జ్ఞాని. కర్మ గనక చేసినట్లైతే పరమేశ్వరుడైనా సరే ఫలితాన్ని అనుభవించి తీరాల్సిందే. ఇందులో అనుమానం లేదు. ఈ విషయం పురాణాల్లో అనేకసార్లు వివరించబడింది. నారదుడికి కోతిముఖం ఇచ్చినందుకే శ్రీమన్నారాయణుడు నారదుడి శాపంతో శ్రీరాముడిగా జన్మించాడు. రాముడు అవతారపురుషుడు, చెట్టు చాటునుంచి వాలిని సంహరించినందువల్లనే మళ్ళీ కృష్ణుడిగా అవతరించి బోయవాడి బాణానికి బలి అయ్యాడు. శ్రీకృష్ణుడు కురుక్షేత్ర సంగ్రామంలో కౌరవులందరినీ సంహరించాడు అనే కోపంతోనే గాంధారి యదువంశం నాశనమవుతుందని శపించింది.

సాక్షాత్తు పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు కూడా కర్మఫలితాన్ని అనుభవించక తప్పలేదు. కాబట్టి ఎంత వారైనా కర్మ చేస్తే దాని ఫలితాన్ని అనుభవించాల్సిందే.

అనుభవించటం వల్ల కర్మక్షయం కాదు. కేవలము జ్ఞానం వల్లనే కర్మక్షయ మవుతుంది.

కర్మక్షయమయిన జీవుడు ముక్తి పొందుతాడు **'జ్ఞానాదేవతు కైవల్యం'.** జ్ఞానమే ముక్తిని ప్రసాదిస్తుంది.

## 15. ధర్మాన్ని ఆచరించాలి

ధర్మం సమాజానికి ఉపయోగపడేది. సమాజాన్ని తీర్చిదిద్దేది. యువతను చైతన్యవంతులుగా చేసేది. పిల్లలను మంచి పౌరులుగా తీర్చిదిద్దేది. అటువంటి ధర్మాన్ని అందరూ ఆచరించి తీరాలి. లేకపోతే సమాజం కుంటుపడుతుంది. నాకేదో అన్యాయం జరిగింది అని మనం ధర్మం తప్పకూడదు. ఒకరు అధర్మాన్ని ఆశ్రయిస్తే ఒక్కోసారి అది అతిపెద్ద నష్టాన్ని కలగచేస్తుంది.

మహాభారతంలో ఇదే జరిగింది. కర్ణుడికి చాలాసార్లు అన్యాయం జరిగింది. దాంతో అతడు దుర్యోధనుడి పక్షాన చేరాడు. కర్ణుడి తలపైనే మహాభారతం నడిచింది. 18 అక్షోహిణీల సైన్యం నాశనమయింది. దీనికంతటికీ కారణం కర్ణుడు. కర్ణుడి అండ చూసుకునే దుర్యోదనుడు పేట్రేగిపోయాడు. ఇదే విషయాన్ని కృష్ణుడితో అంటాడు కర్ణుడు.

ఒకరోజున కృష్ణ పరమాత్ముడు "కర్ణా! నువ్వు చేస్తున్నది అధర్మం. నిన్ను చూసుకునే దుర్యోధనుడు పాండవులతో కయ్యానికి కాలు దువ్వుతున్నాడు. యుద్ధాన్ని కోరుతున్నాడు. నువ్వు గనక దుర్యోధనుడి పక్షాన ఉండకుండా ఉంటే, దుర్యోధనుడు పాండవులతో సంధి చేసుకుంటాడు. మహాభారత యుద్ధం జరగదు. కాబట్టి నువ్వు చేస్తున్న తప్పును సరిదిద్దుకో. అధర్మాన్ని వదిలిపెట్టు" అంటాడు. ఆ మాటలు విన్న కర్ణుడు.

కృష్ణా ! నేను పుట్టగానే నా తల్లి నన్ను వదిలేసింది. అశాస్త్రీయమైన జన్మను పొందటం నా తప్పు కాదు కదా? విద్య నేర్చుకోవటానికి ద్రోణాచార్యుల వారి

వద్దకు వెళ్ళాను. నేను క్షత్రియుణ్ణి కాదని ఆయన విద్య నేర్పటానికి నిరాకరించాడు. అక్కడి నుండి పరశురాముడి దగ్గరకు వెళ్ళాను. ఆయన విద్యనైతే నేర్పారు గాని నేను క్షత్రియుణ్ణి కాదు కాబట్టి ఆ విద్యను నేను మరిచి పోతానని శాపం పెట్టారు.

నేను బాణాలు వేస్తున్నప్పుడు పొరపాటున నా బాణం తగిలి ఒక ఆవు చచ్చిపోయింది. ఆ ఆవు యజమాని కోపించి నాకు శాపం పెట్టాడు.

ద్రౌపదీ స్వయంవరంలో నాకు పరాభవం జరిగింది. ఈ రోజున కుంతీ మాత వచ్చి నేను తన కుమారుణ్ణి అని చెప్పింది. దీనికి కారణం నామీద ప్రేమ కాదు. మిగిలిన కుమారులను కాపాడుకోవటానికే ఇలా చేసింది.

కృష్ణా! నీకు తెలియనిది ఏముంది? నేను ఈ రోజున పొందేదంతా దుర్యోధనుని దయాధర్మం వల్లనే జరుగుతోంది. అందుకే నేను అతని పక్షాన నిలిచాను. అది తప్పెలా అవుతుంది?" అని అడిగాడు. దానికి కృష్ణుడు.

'కర్ణా ! నేను పుట్టటమే కారాగారంలో పుట్టాను. నేను పుట్టక ముందు నుంచే నాచావు నాకోసం కాచుకుకూర్చున్నది.

పుట్టినరోజు రాత్రే కన్నతల్లి తండ్రుల నుంచి వేరు చేయబడ్డాను.

కర్ణా ! నీ బాల్యమంతా కత్తులు, బాణాలు, గుర్రాలు, రథాల శబ్దాల మధ్య గడిచింది. మరి నా బాల్యం గోశాలలో పేడకుప్పల మధ్య గడిచింది.

చిన్నతనంలో నామీద ఎన్నో దాడులు జరిగాయి. అప్పటికి నాకు నడిచే వయస్సు కూడా రాలేదు.

నా చుట్టూ ఉన్న వారంతా ఆ సమస్యలకు నేనే కారణం అని నన్ను నిందించే వారు.

చిన్నతనంలో నాకు చదువు లేదు. మీరందరూ విలువిద్యా ప్రదర్శన చేసే రోజుకి నేను ఓనమాలు కూడా దిద్దలేదు. విద్యాభ్యాసం కోసం సాందీపుడి దగ్గరకు పదహారవ ఏట వెళ్ళాను.

కర్ణా ! నువ్వు నీకు నచ్చిన పిల్లని వివాహం చేసుకున్నావు. కాని నేను అలా చెయ్యలేకపోయాను. నన్ను కోరుకున్న వారిని, నేను రాక్షసుల బారి నుంచి రక్షించిన వారినీ వివాహం చేసుకున్నాను.

జరాసంధుడి బారి నుంచి రక్షించటానికి గోకులాన్నంతా యమున వద్దు నుంచి దూరంగా తీసుకు వెళ్ళాను. అప్పుడు అందరూ నన్ను పిరికివాడు అన్నారు.

అదంతా అలా ఉండనీ ఇప్పుడు జరగబోయే యుద్ధంలో దుర్యోధనుడు గెలిచాడనుకో. నీ పరాక్రమం వల్లనే గెలిచాడు అంటారు. నీకు మంచి పేరు వస్తుంది. అదే ధర్మరాజు గెలిస్తే నాకు వచ్చేది ఏమీ లేదు. అంతే కాదు యుద్ధం రావటానికి, మిగిలిన సమస్యలకి కారణం నేనే అంటారు.

కర్ణా ! ఒక విషయం గుర్తుంచుకో. జీవితంలో సమస్యలు, సవాళ్లు నీ ఒక్కడికే కాదు అందరికీ ఉంటాయి. జీవితం ఎవరికీ పూలబాట కాదు. అన్ని రోజులు మనవి కాదు. దుర్యోధనుడు కాని, ధర్మజుడు కాని జీవితంలో దెబ్బలు తిన్నవారే. కర్ణా ! ఇన్ని మాటలెందుకు. ఏది సరైనదో, ఏది కాదో, ఏది ధర్మమో, ఏది అధర్మమో నీకు బాగా తెలుసు. నువ్వు బాగా చదువుకున్నావు. గొప్ప పండితుడివి. రాజనీతిజ్ఞుడివి. పరాక్రమవంతుడివి.

మనకు ఎంత అన్యాయం జరిగినా, పరాభవం జరిగినా, రావలసింది రాకపోయినా, మనం ఎలా ఉంటామో అదే మన అసలైన వ్యక్తిత్వం. అదే మనిషికి చాలా ముఖ్యమైనది.

జీవితంలో కష్టాలు వచ్చినంత మాత్రం చేత, చెడు అనుభవాలు చవిచూసినంత మాత్రం చేత, ఇంకా ఇతర కారణాల వల్ల అధర్మ మార్గంలో నడవటానికి లైసెన్సు పొందినట్లు కాదు. మనం కష్టపడ్డామని, బాధ పడ్డామని జీవితాన్ని చెడుమార్గంలోకి మళ్ళించరాదు. దీనివల్ల భావితరాలు దెబ్బ తింటాయి. దేశం నష్టపోతుంది. అందుకే ఎట్టి పరిస్థితుల్లోను అధర్మాన్ని ఆశ్రయించరాదు. నువ్వు చేస్తున్నది తప్పు. నీకు అన్యాయం జరిగిన మాట నిజమే. అందుకని ఇంత పెద్ద యుద్ధం జరిపిస్తున్నావు. ఇది ఏ మాత్రం క్షంతవ్యం కాదు" అంటాడు.

ఈ మాటలు కృష్ణుడు కర్ణుడికి చెప్పాడు. ఈ రోజున మనందరికీ వర్తిస్తాయి. మన పూర్వీకులకి నష్టం జరిగిందనో, రావలసింది రాలేదనో పగ పెంచుకుని ఉగ్రవాదులుగా మారుతున్నారు. పలురకాల హింసలకు పాల్పడుతున్నారు. దానివల్ల వీరు సాధించేదేమిటి? ప్రాణనష్టం, ఆస్తినష్టం తప్ప. వారు సుఖంగా జీవించలేరు.

ఎప్పుడు ఎవరు దాడి చేస్తారో అనే భయం. సభ్యసమాజంలో జీవించలేరు. అడవులు, కొండలలో నివాసముంటారు.

చేసే పనిలో నీతి, న్యాయం, ధర్మం లేకపోతే తాము కష్టాలపాలై, ఇతరులను కూడా కష్టపెడతారు. కాబట్టి ఎటువంటి పరిస్థితులలోనైనా సరే ధర్మాన్ని తప్పరాదు.

## 16. ఎంతటి కష్టానికైనా ఒక పరిష్కారముంటుంది

జీవితంలో ఎవరికైనా సరే కేవలం సుఖాలే ఉండవు. అలా అని కేవలము దుఃఖాలే ఉండవు. జీవితం అంటేనే సుఖదుఃఖాల కలయిక. ప్రతి సుఖంలోను దుఃఖం ఉంటుంది. ప్రతి దుఃఖంలోను సుఖం ఉంటుంది. ధనం బాగా సంపాదిస్తే జీవితంలో అన్ని రకాలైన సుఖాలు పొందవచ్చు. కాని ఆ ధనం వల్ల అనేక కష్టాలు వస్తాయి. సంపాదించిన ధనాన్ని జాగ్రత్తగా కాపాడుకోవటానికి కష్టపడాలి. దాన్ని ఎవరైనా ఎత్తుకుపోతారనే భయం. నిద్ర పట్టదు. ఇలా మనం సంపాదించిన ధనం వల్ల కూడా అనేక దుఃఖాలుంటాయి. జీవితాంతం ఉద్యోగం చేశాడు. పిల్లల్ని చదివించాడు. పెళ్ళిళ్ళు చేశాడు. పదవీ విరమణ చేశాడు. ప్రభుత్వం వారిచ్చిన ధనం బ్యాంకులో వేసుకున్నాడు. జీవితం హాయిగా గడిచిపోతోంది. కాని ఇప్పుడు వచ్చింది పెద్ద ఇబ్బంది.

ఒకరోజు కూతురు వచ్చి 'నాన్నా ! మేం ఇల్లు కొనుక్కోవాలనుకుంటున్నాం. బ్యాంకులో అప్పు తీసుకున్నాం ఇంకా పది లక్షలు కావాలి. నీ దగ్గర డబ్బులు ఉన్నాయి కదా. బ్యాంకు వారిచ్చే వడ్డీ మేమే ఇస్తాం. మాకు సర్దుబాటు చెయ్యి. అని అడిగింది.

ఇక్కడే ఉంది అసలు సమస్య అడిగింది కూతురికి డబ్బులు ఇస్తే తిరిగి రావు. అలా అని వాటిని వదులుకోలేడు. వాటిమీద వచ్చే వడ్డీనే జీవనాధారం. పోనీ అంటే బాకీ తీర్చమని కూతుర్ని అడగలేడు.

కొడుకు వచ్చాడు. నాన్నా ! నేను ఇల్లు కొనుక్కోవాలి అనుకుంటున్నాను. ఇక్కడ ఇల్లు అమ్మేస్తే కొంత డబ్బు వస్తుంది. మిగిలినది నేను బ్యాంకులో అప్పు తీసుకుంటాను. మా ఆఫీసు దగ్గరలోనే ఇల్లు కొందాం.

ఎలాగూ మీరు పెద్దవారై పోయారు. ఎప్పటికైనా నా దగ్గరకి వచ్చెయ్యాల్సిందే. అదేదో ఇప్పుడే చేస్తే సరిపోతుంది అన్నాడు. ఏం చెయ్యాలి? ఉన్న ఇల్లు అమ్మి వచ్చే డబ్బును కొడుక్కు ఇచ్చెయ్యాలా? కాదని అతనితో తగాదా పెట్టుకోవాలా.

ఇలాంటి సమస్యలు జీవితంలో ప్రతివారికీ వస్తూనే ఉంటాయి. సమస్య వచ్చినప్పుడు దాన్ని పరిష్కరించుకునే మార్గం వెతకాలి. అంతే కాని సమస్య నుంచి పారిపోవటానికి ప్రయత్నించరాదు. ప్రతి సమస్యకి ఒక పరిష్కారం ఖచ్చితంగా ఉండి తీరుతుంది. దాన్ని వెతికి పట్టుకుని జాగ్రత్తగా దాన్నుంచి బయట పడాలి. ఇక్కడ ఒక చిన్న కథ ఉంది.

పూర్వకాలంలో ఒక ఊళ్ళో ఒక రైతు ఉండేవాడు. అతడు సామాన్యుడు. అతడి దగ్గర ఒక గాడిద ఉండేది. పగలంతా ఆ గాడిద మీద సరుకులు రవాణా చేసి ధనార్జన చేసేవాడు. దాంతోనే జీవితం గడిపేవాడు. ఇలా చాలాకాలం గడిచింది. గాడిద బాగా ముసలిదై పోయింది. ఇదివరకటిలాగా బరువులు మోయలేకపోతోంది.

ఒకరోజు సాయంత్రం. గాడిదమీద సరుకు రవాణా అవుతోంది. చీకటి పడుతోంది. దారి సరిగా కనిపించటంలా. దాంతో గాడిద దారి తప్పి ప్రక్కనే ఉన్న పాడుబడ్డ బావిలో పడిపోయింది. బావైతే పాడు పడిపోయింది గాని చాలా లోతుగా ఉంది. అందులోంచి గాడిదను బయటకు లాగటానికి శతవిధాలా ప్రయత్నం చేశాడు రైతు. అతనివల్ల కాలా, ఇప్పుడు ఆలోచించటం మొదలుపెట్టాడు.

ఎలాగూ ఈ గాడిద ముసలిదై పోయింది. ఇంక ఎక్కువ కాలం బ్రతకదు. కాబట్టి బావిలోంచి దీన్ని బయటకు తీయటానికి ప్రయత్నం చెయ్యటం అనవసరం. దీనికి పెట్టే ఖర్చుతో ఇంకో గాడిదనుకొంటే మళ్ళీ సరుకును గతంలో లాగానే రవాణా చెయ్యచ్చు. అయితే అదికూడా ఈ గాడిదలాగానే బావిలో పడిపోతే? అప్పుడేం చెయ్యాలి? అందుకని ముందుగా ఈ బావిని పూడ్చెయ్యాలి. అందులో ఉన్న గాడిద ఎలాగూ చచ్చిపోతుంది. ఇలా ఆలోచించి ఊళ్ళో ఉన్న మిగిలిన రైతులతో సంప్రదించాడు. వారంతా సరే అన్నారు. బావి పూడ్చే కార్యక్రమం మొదలైంది.

ప్రతి రైతు ఒక తట్టతో మట్టి తెచ్చి బావిలో పోస్తున్నాడు. ఇప్పుడు బావిలో ఉన్న గాడిదకు అర్థమైంది తనను భూస్థాపితం చేస్తున్నారు అని. జాగ్రత్తగా ఆలోచించి బావిలో గోడవారగా పోయి నుంచుంది. పై నుంచి మట్టి పోస్తున్నారు. ఆ మట్టి ఎత్తుగా దిబ్బలాగా అవుతోంది. క్రమంగా ఈ గాడిద ఆ దిబ్బమీదకు ఎక్కటం మొదలు పెట్టింది. దగ్గర దగ్గరగా బావంతా పూడిపోయింది. ఆ మట్టితో పాటే గాడిద కూడా పై దాకా వచ్చేసింది. ఇప్పుడు అదను చూసుకుని ఒక్కసారి నేలమీదకి దూకి పారిపోయి ప్రాణాలు దక్కించుకుంది.

ఏ మాత్రం చదువు లేని, తెలివి లేని, ఆలోచనా శక్తిలేని గాడిదే తనకు వచ్చిన సమస్య నుంచి బయటపడ గలిగినప్పుడు, తన కష్టాన్ని అధిగమించ గలిగినప్పుడు చదువు, తెలివితేటలు, ఆలోచన, విచక్షణా జ్ఞానము ఉన్న మనం కష్టాల నుంచి బయటపడలేమా? జాగ్రత్తగా ఆలోచించండి.

కష్టాలు వచ్చినప్పుడు దుఃఖము, బాధ కలుగుతాయి. దానివల్ల ఆలోచనాశక్తి కోల్పోతాము. ఈ సమయంలోనే స్థిరచిత్తంతో ఆలోచించండి. పరిష్కార మార్గం ఆలోచించండి. బాధల నుంచి, దుఃఖం నుంచి విముక్తి పొందండి. ఎంతటి కష్టానికైనా, దుఃఖానికైనా ఒక పరిష్కారముంటుంది.

## 17. కృషితో నాస్తి దుర్భిక్షం

'అసాధ్యం' అంటే మనకు సాధ్యం కాని పని. మనకి చేతకాని పని. మనం చెయ్యలేని పని. 'సుసాధ్యం' అంటే మనం తేలికగా చేయగలిగిన పని. జాగ్రత్తగా ఆలోచిస్తే మానవుడికి అసాధ్యమనేది ఏదీలేదు. దేన్నైనా చెయ్యగలడు. కాకపోతే చెయ్యాలి అనే పట్టుదల ఉండాలి అంతే. అందుకే **పట్టుదలే ఉంటే కాగలడు మరో బ్రహ్మ.**

పూర్వకాలంలో మన మహర్షులు చంద్రలోకానికి దేవలోకానికి వెళ్ళే వాళ్ళు అని పురాణాల్లో చదివాం. ఇదంతా అభూత కల్పన అన్నవారున్నారు. వారు మానసికంగా వెళ్ళారు అన్నారు. దేన్నీ మనం కాదనలేదు. ఖండించలేము. ఎందుకంటే మన దగ్గర ఆధారాలు లేవు. భౌతికంగా చంద్ర మండలం చేరే పనికాదు

అన్నారు. కాని మానవుడు చంద్ర మండలానికి వెళ్ళాడు. ఇతర గ్రహాలకు వెళ్ళాడు. ఇప్పుడు సూర్యగ్రహానికి బయల్దేరాడు. ఈ పనులు చెయ్యటంలో ఏదీ అసాధ్యం కాదు. కాకపోతే ఏకాగ్రత, పనిచేసి తీరాలనే పట్టుదల ఉండాలి. మన ఆటగాళ్ళను చూడండి. వారిలో కొంతమంది చాలా పేద కుటుంబం నుంచి వచ్చారు. కాళ్ళకి బూట్లు కూడా లేవు. అలాగే పట్టుదలతో కృషి చేసి బంగారు పతకాలు సాధించారు. కన్నకలలు నెరవేర్చుకున్నారు. మానవుడు ఏదైనా సాధించగలడు అనటానికి ఒక యధార్థగాధని చూడండి.

అది మహారాష్ట్రం. బుల్డానాజిల్లా. అందులో ఒక చిన్న గ్రామం ఆ గ్రామంలో లత, భగవాన్ ఖరే అనే దంపతులుండేవారు. వీరికి ముగ్గురు ఆడపిల్లలు. ముగ్గురు పిల్లలకీ పెళ్ళిళ్ళు చేశారు. దాంతో అంతవరకు కూడబెట్టినదంతా కరిగిపోయింది. చేసిన అప్పులు మాత్రం మిగిలాయి. కూలీ నాలీ చేసైనా సరే అప్పులు తీర్చెయ్యాలి అని నిరంతరము శ్రమిస్తున్నారు. లతకు 65 సం॥ ఆమె భర్తకు 70 సం॥లు ఇప్పుడు అనుకోకుండా ఒక విపత్తు వచ్చింది భర్తకు అనారోగ్యం రూపంలో. ఒక రోజున భర్త ఒంట్లో బాగా లేదు అన్నాడు. డాక్టరు దగ్గరకు వెళ్ళారు. 'ఏదో తెలియనటువంటి ఇన్‌ఫెక్షన్ వచ్చింది. నాకు అంతు పట్టటం లేదు. పెద్దాసుపత్రికి వెళ్ళండి' అన్నాడు డాక్టరు. నెత్తిమీద పిడుగు పడినంత పైంది లతకి. ఇద్దరూ కష్టపడి పని చేస్తేనే రోజు గడుస్తుంది. ఇప్పుడు పెద్దాసుపత్రి అంటే మాటలా? డబ్బులు చాలా ఖర్చు అవుతాయి. ఎక్కడి నుంచి తేవాలి? చేతిలో చిల్లి గవ్వలేదు. ఏం చెయ్యాలో పాలుపోవటం లేదు.

దగ్గరలో ప్రభుత్వాసుపత్రికి తీసుకువెళ్ళింది భర్తని వారు ఇంకా రోగనిర్ణయం చెయ్యలేదు. రెండు రోజులు గడిచాయి. భర్త నడువలేని స్థితికి చేరాడు. రోజు రోజుకీ పరిస్థితి దిగజారిపోతోంది. ప్రభుత్వాసుపత్రిలో సరైన సదుపాయాలు లేవు. రోగనిర్ధారణ జరగాలంటే కొన్ని పరీక్షలు చేయించాలి దగ్గరలో 'బారామతి' అనే నగరానికి వెళ్ళి కొన్ని పరీక్షలు చేయించండి. అవి రోగ నిర్ణయం చెయ్యటానికి అత్యవసరం' అన్నారు. లతకు కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగాయి. మాట రావటం లేదు. ఆవేదనతో క్రుంగిపోతోంది. దుఃఖం పొర్లుకు వస్తోంది. భర్త పరిస్థితి రోజురోజుకీ దిగజారుతోంది. భర్త తనచేతుల్లోనే చనిపోతాడు తప్పదు. ఈ నిజాన్ని

ఊహామాత్రంగా కూడా భరించలేదు లత. కాని ఏమీ చెయ్యలేని స్థితి నిస్సహాయంగా రోదించింది. ఆదుకునే వారు ఎవరూ లేరు.

చుట్టుప్రక్కల వారిని సాయం అడిగింది. కొంతమంది మనసున్న మా రాజులు సాయం చేశారు. దాంతో భర్తని బారామతికి తీసుకువెళ్ళింది. అక్కడ వాళ్ళు పరీక్షలు చేశారు. అవి సరిపోలేదు యం.ఆర్.ఐ. చేయించాలి అన్నారు. దాంతో పాటుగా ఇంకొన్ని పరీక్షలు కూడా చెయ్యాలి అన్నారు. అంతవరకు రోగ నిర్ధారణ జరగదు అన్నారు. లతకు దుఃఖం ఆగలేదు. కళ్ళముందు దీనాతి దీనమైన స్థితిలో భర్త కనిపిస్తున్నాడు. నిస్సహాయ స్థితిలో బోరున విలపించింది.

ఆ రాత్రి ఆస్పత్రి వరండాలో పడుకున్నారు భార్యా భర్తలిద్దరూ. ఆస్పత్రి నుంచి బయటకు వచ్చి, తన దగ్గర ఉన్న చిల్లరతో రెండు సమోసాలు కొని తీసుకువెళ్ళి భర్తకు ఇచ్చింది. తాను తిన్నానని అబద్ధం చెప్పింది. కాగితంలో ఉన్న సమోసాలు భర్త చేతికి ఇచ్చి, కాగితం అవతల పడెయ్యబోతున్న సమయంలో, ఆపేపరులో ఒక ప్రకటన కనిపించింది. **"బారామతి మారాథాన్‌లో గెలవండి. రూ. 3000 నగదు బహుమతి పొందండి."** కారు చీకట్లో కాంతి పుంజం. ఆ పోటీలో తాను పాల్గొని గెలిస్తే ఆలోచనలతో రాత్రంతా గడిచింది.

ఆ మరునాడు అంటే 19-12-2013 బారామతి మారాథాన్ మొదలవుతుంది. అందులో పాల్గొనే పోటీదార్లంతా బూట్లు వేసుకుని సిద్ధంగా ఉన్నారు. లత అక్కడికి చేరింది. సాదానేత చీర ధరించింది. కాళ్ళకి చెప్పులు కూడా లేవు. పోటీలో పాల్గొనటానికి వచ్చింది. ఆమె వాలకం చూసి కనీసం స్పోర్ట్సు బట్టలు, బూట్లు కూడా లేని ఆమెని పోటీకి అనుమతించలేదు నిర్వాహకులు. ఆమె పట్టువదల్లేదు. తన పరిస్థితి వివరించింది. వాళ్ళని ప్రాధేయపడింది. బ్రతిమాలింది. చివరికి వాళ్ళని ఒప్పించింది. అభ్యర్థిగా పోటీలో దిగింది.

పోటీ మొదలైంది. లత చీరెను పైకి మడిచి కట్టింది. పరుగు ప్రారంభించింది 65 సం॥ వయసున్న ముసలి స్త్రీ. ఎండ మండి పోతోంది. కాళ్ళు కాలిపోతున్నాయి.

ఇవేమీ పట్టలేదు లతకి. ఏమైనా సరే పోటీ గెలవాలి. భర్తకి వైద్యం చేయించాలి. తన వయసు గాని, మండిపోయే ఎండని గాని, రోడ్డు మీద గుచ్చుకుంటున్న

రాళ్ళను గాని లెక్క చెయ్యలేదు. భర్తకు వైద్యం చేయించటమే లక్ష్యంగా పరుగు పెట్టింది. అదే పరుగు, అదే వేగం. అదే పట్టుదల. బారామతి మెరాథాన్‌లో 65 సం॥ వృద్ధురాలు కనీసం కాళ్ళకి బూట్లు కూడా లేకుండా తిరుగులేని విజయం సాధించింది. ఒక గొప్ప చరిత్ర సృష్టించింది.

బారామతి ప్రజలకు అది ఒక అపూర్వమైన సంఘటన, అదృష్టం. నిర్వాహకులతో పాటుగా పోటీకి వచ్చిన వారంతా ఆమె కథను విని చలించిపోయారు. మామూలుగా ప్రైజ్ మనీ రూ. 3000/– కానీ సీనియర్ సిటిజన్ విభాగంలో దాన్ని లతమ్మ కోసం రూ. 5000/–కు పెంచారు. పోటికి వచ్చి వారుకూడా తమ వంతు సాయమందించారు.

ఆ డబ్బులతో ఆమె ఆస్పత్రికి పరుగు పెట్టింది. భర్త పట్ల ప్రేమ, ఆమె పట్టుదల వ్యర్థం కాలేదు. వాటి ముందు సమస్య చిన్నబోయింది. భర్తకి అంతకన్నా మెరుగైన వైద్యం అందింది.

పత్రికలు లతమ్మను గురించి గొప్పగా వ్రాశాయి. దేశం నలుమూలల నుంచి ప్రశంసల జల్లులతో పాటుగా వదాన్యులు ఆర్థిక సాయం చేశారు. మొత్తం రూ. 1,75,000 ప్రోగయినాయి. భర్తకు రోగం తగ్గింది. ఆ కుటుంబం కష్టాల నుంచి గట్టెక్కింది.

అందరూ కష్టాలు వచ్చినప్పుడు క్రుంగిపోతారు. ఏమీ చేయలేము, ఈ కష్టాల నుంచి బయట పడలేము అని భావిస్తారు. అది నిజం కాదు. ప్రతి సమస్యకి ఒక పరిష్కారం దొరుకుతుంది. దాన్ని జాగ్రత్తగా వెతికి పట్టుకోవాలి. ఈ పని మన వల్ల అవుతుందా అని ఆలోచించకూడదు. అధైర్య పడకూడదు. ప్రారంభిస్తే ఎంతటి కష్టమైన పనైనా సరే తేలిక అవుతుంది. కొండైనా సరే పగలకొట్టి రాళ్ళు తియ్యటం మొదలుపెడితే, కొంత కాలానికి కొండ మిగలదు. అలాగే కష్టాలు కూడా.

కాబట్టి కష్టం వచ్చినప్పుడు అధైర్యంతో డీలా పడకుండా సమర్థవంతంగా దాన్నుంచి బయటకు పడటానికి ప్రయత్నించాలి.

**'కృషితో నాస్తి దుర్భిక్షం'**

# 18. మారటం అసాధ్యమా?

జీవితంలో మానవుడు చెయ్యలేని పని అనేది ఏదీలేదు. ఆ పని చెయ్యటం కష్టం కదా? దాన్ని మనం చెయ్యలేము అని అధైర్యపడరాదు. **'కష్టేఫలీ'** కష్టపడిన వాడికే ఫలితం వస్తుంది. కష్టపడిన వాడే విజయం సాధిస్తాడు జీవితంలో ముందుకు వెడతాడు. 'ఇది మనం చెయ్యలేంలే' అనుకున్న వాడు ఎప్పుడూ విజయం సాధించలేడు. ఉన్నత శిఖరాలు చేరలేడు. జీవిత లక్ష్యం సాధించాలంటే కష్టపడి తీరాలి. ఇందులో సందేహం లేదు. దీనికి పక్షిరాజైన గ్రద్ద జీవితం మంచి ఉదాహరణ.

గ్రద్ద పక్షులన్నింటిలోకి చాలా బలమైనది. తీక్షణమైన దృష్టి గలది. చాలా ఎత్తులో ఎగురుతుంది. ఎగరటంలో కూడా దీనికి ఒక ప్రత్యేకత ఉంది. దీని రెక్కలు చాలా పెద్దవి. ఎంత పెద్దవి అంటే అవి రెండుగా మడతపడి ఉంటాయి. ఎగిరేటప్పుడు మడత తొలగిపోయి పెద్దరెక్కలు అవుతాయి. అందువల్లనే మిగిలిన పక్షులకన్న అతివేగంగా ఎగురుతుంది. ఆకాశంలో అంత ఎత్తున ఎగురుతూ నేలమీద తిరుగాడే కోడిపల్లని, చిట్టెలుకల్ని కూడా గమనిస్తుంది. అంత తీక్షణమైన దృష్టి దానిది. అందుకే రామాయణంలో వానరులు సీతను వెతుకుతున్నప్పుడు జటాయువు సోదరుడైన సంపాతి తన తీక్షణమైన దృష్టితో చూసి సీత లంకలో ఉన్నది అని చెబుతాడు. అది దాని శరీరానికి పదిరెట్ల బరువును మోయగలదు. ఆకాశంలో ఎగురుతూ చెట్లమీద గంతులు వేసే కోతులను ఎత్తుకుపోతుంది. నేలమీద తిరుగాడే పాములను పట్టుకుపోతుంది. గ్రద్ద ఎంత బలమైన పక్షి అంటే కొండ గొర్రెలను కూడా ఎత్తుకుపోతుంది. సముద్ర తీరంలో కొంగలు చేపలను వేటాడి ఎగిరిపోతుంటే, అలా ఎగిరిపోయే కొంగలను తన్నుకుపోతుంది గ్రద్ద. మనుషులు చేరలేనంత ఎత్తైన ప్రదేశాలలో, కొండ అంచున గూడు కట్టి గుడ్లు పెడుతుంది. వేటలో గ్రద్దను మించిన పక్షి ఇంకొకటి లేదు. అందుకే గ్రద్దను పక్షిరాజు అంటారు. సుమారుగా డెబ్భై సంవత్సరాలు జీవిస్తుంది గ్రద్ద. గ్రద్ద జీవితం మనకి ఒక గొప్ప పాఠాన్ని చెబుతోంది.

నలభై సంవత్సరాలు పూర్తయ్యేసరికి దాని గోళ్ళు బాగా పెరిగిపోతాయి. ఆహారాన్ని పట్టుకోవటానికి సహకరించవు. దాని ముక్కు బాగా పెరిగిపోయి ముక్కు

కొన చివరి భాగం వంగిపోయి పట్టుకున్న ఆహారం తినటానికి అనువుగా ఉండదు. శరీరం మీద ఈకలు దట్టంగా పెరగటం వల్ల శరీరం బరువు పెరిగి వేగంగా ఎగరటం కష్టమవుతుంది. దీనివల్ల గ్రద్ద జీవితం ప్రశ్నార్థకమవుతుంది. అప్పుడు దాని ముందున్నవి రెండే మార్గాలు. 1.వేటాడలేక ఆహారం తినలేక సుష్కించి మరణించటం 2. తనను తాను మార్చుకోవటం.

లోకంలో ఏ జీవీ కూడా మరణించాలనుకోదు. ఇంకా జీవించాలనే అనుకుంటుంది. అలాగే గ్రద్ద కూడా ఇంకా జీవించాలనుకుంటుంది. అలా జీవించాలంటే తనను తాను మార్చుకోవాలి. కష్టమైనా సరే. వేరే దారి లేదు. ఈ మార్పు చాలా బాధాకరము, భయంకరము అయింది. అయినా తప్పదు. జీవించాలంటే మార్పు వచ్చితీరాలి. తనను తాను మార్చుకుని తీరాలి. ఈ మార్పు అనేది ఒకరోజులో జరిగేది కాదు. 150 రోజుల ప్రక్రియ. అంటే ఐదు నెలలన్న మాట. ఇంత కాలం నిద్రాహారాలు మాని కష్టపడాలి. ముందుగా తన ముక్కును సరిచేసుకోవటానికి ప్రయత్నిస్తుంది. ముక్కు బాగా పెరిగిపోయింది. దాన్ని కత్తిరించాలి. అలా చెయ్యటానికి గ్రద్ద అనుసరించే పద్దతి ఏమిటో తెలుసా? తన ముక్కును బండలకు వేసి రాస్తుంది. అలా రాయగా రాయగా ముక్కు అరిగిపోయి చిన్నదవుతుంది. ఈ పని జరగటానికి ఒకటిన్నర నెల పడుతుంది. అప్పుడు తన ముక్కు యధాస్థితికి వస్తుంది. ఇప్పుడు కాలిగోళ్ళను పట్టుకుంటుంది. తన ముక్కుతో ఆ గోళ్ళను రుద్ది రుద్ది అవి ఊడిపోయేటట్లుగా చేస్తుంది. కొంత కాలం జరిగేటప్పటికి బాగా పెరిగిన కాలి గోళ్ళు కత్తిరించుకుపోయి చిన్నవిగా పూర్వస్థితికి వస్తాయి. ఆ తరువాత తన ముక్కుతో శరీరం మీద బాగా పెరిగిన ఈకలను పీకేస్తుంది. దాంతో బాగా పెరిగిన పెద్ద పెద్ద ఈకలన్నీ ఊడిపోయి మళ్ళీ కొత్త ఈకలు వస్తాయి. ఇదంతా ఎంత కష్టమైన పనో ఆలోచించండి. తన ముక్కు తనే నరుక్కోవడం. తన గోళ్ళు తనే కత్తిరించుకోవడం. తన శరీరం మీద ఈకలు తనే పీక్కోవడం. చాలా బాధననుభవించాల్సి ఉంటుంది. అయినా జీవించాలంటే తప్పదు. ఈ పని చేసి తీరాలి. అందుకే కఠోరమైన సాధనతో సుమారు ఐదునెలల కాలం నిద్రాహారాలు లేకుండా కొండ చరియలలో కూర్చుని ఈ పని చేస్తుంది.

ఇప్పుడు దాని ముక్కు గతంలో లాగా చిన్నదై పోయింది. ఆహారం తినటానికి అనువుగా ఉంది. కాలిగోళ్ళు బాగా తగ్గిపోయినాయి. వేటాడటానికి అనువుగా తయారైనాయి. శరీరం మీద పొడవాటి ఈకలు పోయి మళ్ళీ చిన్న చిన్న ఈకలు వచ్చినాయి. శరీరం బరువు తగ్గిపోయి వేగంగా ఎగరటానికి అనుకూలంగా తయారైంది. నలభై సంవత్సరాల క్రితం ఎలా ఉండేదో ఇప్పుడు అలా తయారైంది. ఇక మామూలే వేగంగా ఎగిరి ఆహారాన్ని అలవోకగా సంపాదించుకుంటుంది.

చదువు, సంధ్య, ఇంగిత జ్ఞానము లేని ఒక పక్షి అలా తన శరీరాన్ని మార్చుకోగలిగినప్పుడు, మనం మాత్రం మారలేమా?

మనలో ఉన్న కోపం, అహంకారం, దర్పం, స్వార్థం, మమకారం ఇత్యాది గుణాలను వదులుకోలేమా? మనసును అదుపు చేసుకోలేమా? ఇది జరిగే పనేనా అనిపించవచ్చు. కాని గ్రద్ద కథ విన్న తరువాత కూడా జీవితాన్ని మార్చుకోవటం అసంభవం అంటారా? ఒక్కసారి ఆలోచించండి.

ఈ రోజు నుంచే మారటానికి ప్రయత్నించండి. తీవ్రప్రయత్నం చేస్తే సాధించలేనిది ఏదీలేదు. మారటం అసాధ్యం కాదు.

## 19. ప్రసాదం

ఒక భక్తుడు ఆలయంలోకి వెళ్ళాడు. భగవంతుడి దర్శనం చేసుకుని తిరిగి వస్తున్నాడు. గేటు దగ్గర ప్రసాదం పంచుతున్నారు. అందరితో బాటుగా తాను కూడా లైన్లో నుంచుని ప్రసాదం తీసుకున్నాడు. అడ్డాకులతో చేసిన చిన్న దొన్నె. అందులో దద్ధోజనం పెట్టి ఇచ్చారు. బాగుంది. అసలే ఆకలితో ఉన్నాడు ప్రసాదం మంచి రుచిగా ఉంది అనుకున్నాడు. వెళ్ళిపోయాడు. ప్రతిరోజు దేవాలయానికి వచ్చిన వాళ్ళకి ఈ రకంగా ఉపాహారం ఇస్తారన్న మాట. అయితే దాన్ని 'ప్రసాదం' అంటారు. అంటే దేవుడికి నివేదన చేసిన తరువాత మిగిలిన దాన్ని భక్తులకు పంచుతారు. దేవుడికి నివేదన చేస్తే, ఆ పదార్థాన్ని దేవుడు నిజంగా తినడా? ఆయన తినేస్తే ఇంకా ఎలా మిగులుతుంది? ఇదీ ప్రశ్న. దీనికి సమాధానం దొరకలేదు అతడికి. దానితో పరీక్షించి చూద్దాం అనుకుని మర్నాడు కొబ్బరికాయ పట్టుకొచ్చాడు. పూజారి కాయను కొట్టి దేవుడికి నివేదన చేసి ఒక చిప్ప ఇతడికిచ్చాడు. ఇది

స్వామివారి ప్రసాదం అన్నాడు. విచిత్రంగా చూశాడు భక్తుడు. భగవంతుడికి నివేదన చేస్తే ఆయన తినాలి. ఆయన తిన్న తరువాత ఇంకా ఎలా మిగులుతుంది? దీన్ని గురించే ఆలోచిస్తూ తనకు తెలిసిన ఒక పెద్దాయన దగ్గరకు వెళ్ళాడు. తన అనుమానాన్ని వివరించాడు. ఆ సమయంలో ఆయన పిల్లలకు పద్యాలు, శ్లోకాలు చెబుతున్నాడు. ఒక పిల్లవాడికి సుమతీశతకంలోని అక్కరకు రాని చుట్టము పద్యం చదువుకు రమ్మని చెప్పాడు నిన్న. ఆ పిల్లవాడు చదువుకు వచ్చాడు. ఈ భక్తుడు అక్కడ కూచుని ఉండగానే పద్యాన్ని ఒప్పగించాడు. ఇప్పుడు గురవుగారు భక్తుడితో

'ఈ పిల్లవాడు పుస్తకంలోని పద్యాన్ని చదివాడు కదా' అన్నాడు. 'అవును కంఠస్తం చేశాడు' అన్నాడు భక్తుడు. 'మరి ఇందులోని పద్యం ఇలాగే ఉంది కదా? పిల్లవాడికి ఎలా వచ్చింది?' అంటూ పుస్తకంలోని పద్యాన్ని చూపించాడు. నిజమే. పుస్తకంలోని పద్యం అక్కడే అలాగే ఉంది. కాని పిల్లవాడికి మాత్రం వచ్చేసింది. ఏం సమాధానం చెప్పాలో అర్థం కాలేదు భక్తుడికి. అలా చూస్తున్నాడు. అప్పుడు గురువుగారే మళ్ళీ చెప్పాడు. పుస్తకంలోని పద్యం స్థూలరూపంలో ఉంది. పిల్లవాడు చదివినప్పుడు అది సూక్ష్మరూపంలో అతని బుర్రలోకి ప్రవేశించింది. అతడు ఈ పద్యం చదవటం వల్ల పుస్తకంలోని స్థూలరూపానికి ఏ రకమైన ఆటంకము రాదు. అలాగే మనం నైవేద్యాన్ని భగవంతుడికి సమర్పించినప్పుడు అది స్థూలరూపంలో ఉంటుంది. దాన్ని సూక్ష్మరూపంలో భగవంతుడు గ్రహిస్తాడు. కాని స్థూలరూపానికి ఏ రకమైన హాని అంటే పెరగటం, తగ్గటం ఉండదు. అందుకే అక్కడ ఉన్న స్థూలరూప పదార్థాన్ని ప్రసాదంగా తీసుకుంటున్నాం.

ఇంకా వివరంగా చెబుతాను నాతో బాటు రా అన్నాడు. గురువుగారు భక్తుడు ఇద్దరూ కలిసి బ్యాంకుకు వెళ్ళారు. ఈ గురువు గారి కుమారుడు ఢిల్లీలో చదువుకుంటున్నాడు. అతడికి పదివేలు డబ్బులు పంపించాడు గురువుగారు. డబ్బులు వెళ్ళిపోయినాయి అని చెప్పారు బ్యాంకు వారు. అంత వరకు గురుశిష్యులిద్దరూ బ్యాంకులోనే ఉన్నారు. గురువుగారు తన కొడుక్కి ఫోను చేశాడు 'డబ్బులు పంపించాను' అని. కొడుకు సమాధానం చెప్పాడు. 'డబ్బులు వచ్చాయి నాన్నా, ఇప్పుడే మెస్సేజ్ వచ్చింది. నేను వీలున్నప్పుడు బ్యాంకు నుండి తీసుకుంటాను' అన్నాడు. ఈ మాటలన్నీ వింటూనే ఉన్నాడు భక్తుడైన శిష్యుడు.

ఇప్పుడు గురువుగారు అడిగారు. నేను బ్యాంకులో కట్టిన డబ్బులు ఇక్కడే ఉన్నాయి కదా? మరి నా కొడుక్కి ఎలా చేరాయి? అలా చూస్తుండిపోయాడు భక్తుడు. గురువు గారే మళ్ళీ చెప్పారు. 'ఇక్కడ బ్యాంకులో నేను కట్టిన డబ్బులు నా కుమారుడికి ఢిల్లీలో చేరినట్లే ఇక్కడ భగవంతుడికి నివేదించిన పదార్థము ఆయనకు సూక్ష్మరూపంలో చేరుతుంది. ఇక్కడ ఉన్నదాన్ని స్వామివారి ప్రసాదంగా మనం తీసుకుంటాము అని వివరించారు.

భగవంతుడికి నివేదన చేస్తే ఆయన తింటాడా? పేరు ఆయనది నోరు మాత్రం మనది. మనం తినాలనుకున్నవి ఆయనకు నివేదన చేస్తాం. ఆయన పేరుతో మనం తింటాం. ఇలాంటి అర్థం లేని వాదనలు మాని ప్రతిదాంట్లోను అంతరార్థాన్ని గ్రహించండి. మీకు తెలియకపోతే పెద్ద వాళ్ళని అడిగి తెలుసుకోండి.

## ౨౦. జన్మచరితార్థం

మనిషి లోకంలోకి వచ్చేటప్పుడు ఏమీ తీసుకురాడు. వెళ్ళేటప్పుడు ఏదీ తనతో పట్టుకుపోడు. ఇది జీవిత సత్యం. ఈ విషయం అందరికీ తెలుసు. కాని మూణ్ణాళ్ళ ముచ్చట కోసమే. ఈ లోకంలో బంధాలు, అనుబంధాలు పెంచుకుంటాడు. ఇల్లు పొలము, ఆస్థి పాస్థి, గొడ్డుగోద, ధనధాన్యాలు, సిరిసంపదలు, పరువు ప్రతిష్ఠ, గౌరవము హోదా, పలుకుబడి అన్నీ సంపాదించాలి. భోగభాగ్యాలతో తులతూగాలి. బాగా ధనార్జన చేసి గొప్పవాడనిపించుకోవాలి. అందరూ తన చుట్టూ తిరగాలి. అందరినీ తాను శాసించాలి. ఈ ప్రపంచానికే తాను చక్రవర్తి కావాలి. ఇలా ఆలోచిస్తాడు. కాని చివరకి జరిగేదేమంటే అతడు సంపాదించిన ఇల్లు ఆస్తిపాస్తి అన్నీ ఇక్కడే ఉన్నచోటే కదలకుండా ఉంటాయి. గొడ్డు గోదా అన్నీ పశువుల శాలలో యథాప్రకారం గడ్డిమేస్తూనే ఉంటాయి. అతడి శవాన్ని అక్కడ పడుకోపెట్టినా అవి ఏమీ పట్టించుకోవు. అతడు సంపాదించిన ధనమంతా ఇనప్పెట్టెలోనో, బ్యాంకు లాకర్లోనో, విదేశీ బ్యాంకుల్లోనో భద్రంగా ఉంటుంది. పూర్వకాలంలో ధనం దాచుకునే చోటు ప్రత్యేకంగా బ్యాంకుల్లాంటివి లేవు కాబట్టి, భూమిలో గొయ్యి తీసి జాగ్రతగా పాతిపెట్టేవాళ్ళు అలా పాతిపెట్టిన ధనమే ఇప్పుడు మనవాళ్ళకి గుప్తనిధి రూపంలో

దొరుకుతోంది. కేరళ రంగనాథుడి ఆలయంలో దొరికిన లక్షల కోట్ల సంపద అలాంటిదే. కాబట్టి మనిషి పోయేటప్పుడు తాను సంపాదించినవిఏవీ వెంటరావు. భార్య ఇంటిదగ్గరే ఉండిపోతుంది. పిల్లలు, మిత్రులు, బంధువులు, స్మశానం దాకా వెడతారు. ఆ తరువాత అతనితో వెళ్ళేది అతడు చేసిన పాపపుణ్యాలే. ఇక్కడ ఒక చిన్న విషయం చూడండి.

ఒకసారి ఒక మనిషి చనిపోయాడు. అతడి శరీరం లోపలి ఆత్మ బయటకు వచ్చింది. చుట్టూ చూసింది. ఎదురుగా దేవుడు నుంచుని ఉన్నాడు. అతడి చేతిలో ఒక చిన్నపెట్టె ఉన్నది. చనిపోయిన వ్యక్తి దగ్గరకు వచ్చాడు భగవంతుడు ఆ పెట్టెతో సహా. ఇప్పుడు భగవంతుడు అంటున్నాడు.

భ : మానవా! నీ జీవితం అయిపోయింది. నీ ఆయుష్షు తీరిపోయింది. ఈ జన్మ పూర్తయింది. ఇంక పోదాం పద.

మనిషి : అయ్యో ! ఇంత త్వరగానా స్వామీ నేను భవిష్యత్తును గురించి చాలా ఊహించుకున్నాను. చాలా కలలు కన్నాను.

భ : తప్పదయ్యా ! నీ ఆయుష్షు ముగిసిపోయింది చేసేది ఏమీ లేదు. ఇక బయల్దేరు.

మ : అలాగే స్వామీ! నా కోసం ఆ పెట్టె తెచ్చారు. కదా. అది ఇవ్వండి. అందులో ఏముందో చూస్తాను.

భ : ఇందులో నీకు సంబంధించినవే ఉన్నాయయ్యా

మ : అవునా స్వామీ! అయితే నా బట్టలు, నేను సంపాదించిన ధనము, ఆస్తిపాస్తుల తాలూకు పత్రాలు ఉండి ఉంటాయి.

భ : కాదు నాయనా ! అవన్నీ ఎక్కడివక్కడే ఉంటాయి. నువ్వు సంపాదించిన ధనం ఇనప్పెట్టెలో ఉంది. గొడ్డుగోదా గోశాలలో ఉంది. ఆస్తిపాస్తులు మీ ఇంటి దగ్గరే ఉన్నాయి. అవేవీ కాదు.

మ : పోనీ నా జ్ఞాపకాలు ఏవైనా ఉన్నాయా?

భ : జ్ఞాపకాలనేవి కాలానికి సంబంధించినవి. అవి కాలగర్భంలో కలిసిపోతాయి.

మ : అయితే నా తెలివితేటలు, గొప్పదనము ఉన్నాయా?

భ : అవన్నీ పరిస్థితుల ప్రభావంతో వచ్చినవి. అంతేకాని నీవి కావు.

మ : పోనీ నా స్నేహితులున్నారా?

భ : స్నేహితులు నీతో కొద్ది దూరం మాత్రమే వచ్చే ప్రయాణికులు వారు ఉండరు.

మ : అయితే నా భార్యా, బిడ్డలు ఉన్నారా?

భ : జీవితమనే నాటకంలో వారు నీతో పాటుగా నటించిన పాత్రధారులు. నాటకం పూర్తి కాగానే వారికీ, నీకూ సంబంధం ఉండదు.

మ : అయితే ఆ పెట్టెలో నా శరీరమున్నదా?

భ : ఈ శరీరం పంచభూతాలతో ఏర్పడింది. అది పంచభూతాలలోను కలిసిపోతుంది.

మ : అయితే నా ఆత్మ ఉన్నదా?

భ : ఆత్మ నీదెలా అవుతుందయ్యా? అది నాది

మ : ఆ పెట్టె ఇటివ్వు స్వామీ ! అందులో ఏముందో చూస్తాను. అని భగవంతుడి దగ్గర నుంచి పెట్టెను తీసుకుని తెరిచాడు. అందులో ఏమీ లేదు. ఖాళీగా ఉంది. అప్పుడు ఆలోచించాడు. జీవించినంతకాలం అది చెయ్యాలి. ఇది చెయ్యాలి. సంపాదించాలి. అని పరుగులు పెట్టాను. కాని భగవంతుణ్ణి మాత్రం స్మరించను కూడా లేదు. అంటూ బాధ పడ్డాడు. బ్రతికినంత కాలం ఇవన్నీ నావే అని భావించాను. కాని నాది అనేది ఏదీ లేదు అంటూ దుఃఖిస్తున్నాడు.

మ : స్వామీ ! చివరగా అడుగుతున్నాను. అసలు నాది అనేది ఏదైనా ఉందా?

భ : ఉన్నది. నువు బ్రతికినంత కాలం ప్రతిక్షణము నీదే. ఆ సమయంలో నువ్వు చేసే మంచి చెడు, పాపము, పుణ్యము అన్నీ నీవే.

అందుకే జీవించినంత వరకు మంచి పనులే చెయ్యాలి. సమాజానికి ఉపకారం చెయ్యాలి. భగవంతుణ్ణి స్మరించాలి. తప్పు చేసిన వారిని క్షమించాలి. పరమ శాంతంగా ఉండాలి. మానవసేవే మాధవసేవ అని గుర్తించాలి. నువ్వు చేసిన పాపపుణ్యాలే నీతో వస్తాయి అన్నాడు భగవంతుడు.

కాబట్టి జీవితంలో ఎంత సంపాదించామనేది కాదు. ఎన్ని మంచి పనులు చేశామనేదే లెక్క. ఎంత గొప్పవాడైనా, బీదవాడైనా, రాజైనా, బంటైనా, దాసుడైనా, పశువైనా, పక్షైనా మరణానంతరము ఈ మట్టిలోనే కలిసిపోతుంది. ఇక్కడ అందరూ సమానమే. నువ్వు ఎంత సంపాదించినా, నీతో తీసుకుపోయేది ఏదీలేదు. విశ్వవిజేత అలెగ్జాండరు ఏం పట్టు కెళ్ళాడు? అందరూ అంతే. చనిపోయిన తరువాత కావలసింది కేవలము ఆరడుగుల స్థలం అంతే.

కాబట్టి జీవించినంత కాలం మంచి పనులు చేయండి. సమాజ శ్రేయస్సుకు పాటు పడండి. భగవన్నామాన్ని జపించి జన్మ చరితార్థం చేసుకోండి.

## 21. నాగులు-సర్పాలు

నాగులచవితి, సుబ్బారాయుడి షష్టి ఇలాంటి పండుగలు ఏవి వచ్చినా సరే పాము పుట్ట ఎక్కడున్నదో వెతికి పట్టుకుని, ఆ పుట్టకి పూజ చేస్తాం. అందులో ఉన్న పాము త్రాగుతుంది అనే నమ్మకంతో పాలు పోస్తాం. పాము తింటుంది అని కోడిగ్రుడ్లు కూడా పుట్టలో వేస్తాం. నిజంగా పాము పాలు త్రాగుతుందా? పుట్టలో వేసిన గ్రుడ్లను తింటుందా? వీళ్ళు చేసే పూజలు స్వీకరించటానికి నిజంగా పాము పుట్టలోంచి బయటకొస్తే? ఒకసారి ఒక ఊళ్ళో ఇలాగే నాగులచవితినాడు పుట్టలో పాలుపోస్తున్నారు. అది పల్లెటూరు. ఊళ్ళో జనం అంతా ఇక్కడ ప్రోగయ్యారు. పుట్ట దగ్గర చాలా కోలాహలంగా ఉంది. ఈ హడావిడికి నిజంగానే పుట్టలోని పాము బయటకు వచ్చి ప్రక్కన ఉన్న గడ్డివామి మీద కూచుంది. పాము పుట్టలోంచి బయటకు రాగానే జనం అందరూ ఒకటే పరుగు. ఆ తరువాత గడ్డివామి మీది పామును క్రిందికి రమ్మని, జనానికి హానిచెయ్యద్దని దండాలు, భజనలు, పాటలు.

పాము నిజంగా పాలు త్రాగదు. జనం పుట్టకు పూజచేసి, పాలు పోసి పామును హింసిస్తున్నారు అని మీడియా గోల. ఇదంతా మూఢాచారం–పాము ఎక్కడైనా దేవుడవుతుందా? అంటూ అన్యమతస్థుల విమర్శ. ఒకసారి టి.టి.డి. తరఫున ధార్మిక ఉపన్యాసం చెప్పటానికి విజయవాడ నుంచి బయల్దేరి బస్సులో. బస్సులో బందరు వెడుతున్నాను. అన్నీ ఇద్దరూ కూర్చునే సీట్లే. నా ప్రక్కన సీటు ఖాళీగా ఉంది. బెంజి సెంటరు దగ్గర బస్సు ఆగింది. కొంతమంది ఎక్కారు. అందులో ఒకాయన సుమారు అరవై సం॥ ఉంటాయి. చేతిలో నల్లఅట్ట, ఎరుపురంగు అంచులు గల పుస్తకం పట్టుకుని బస్సు ఎక్కి వచ్చి నా ప్రక్కన కూర్చున్నాడు. ఆ పుస్తకాన్ని చూడగానే తెలుస్తోంది అది క్రిష్టియన్ల పవిత్ర గ్రంథమైన బైబులు అని. ఆ రోజు ఆదివారం కాదు. అందులోను సమయం సాయంత్రం నాలుగు గంటలు. కాబట్టి అతడు చర్చికి వెళ్ళటం లేదు. అతడు మతపెద్ద అయి ఉండాలి. లేదా బైబులు మీద, క్రిష్టియన్ మతం మీద, అపారమైన నమ్మకమున్న వాడై ఉండాలి. కొద్దిదూరం వెళ్ళిన తరువాత నేనే అతణ్ణి పలకరించాను. అతను హిందువు. బ్రాహ్మణుడు. అతని తాతలు వేదపండితులు. అతని కుమారుడికి మూర్ఛరోగం వచ్చింది. ఎంత మంది డాక్టర్లకు చూపించినా అది తగ్గలేదు. చివరిగా ఒక క్రిష్టియన్ ఫాదర్ దగ్గరకు వెళ్ళాడు. ఆయన ఏమందూ ఇవ్వలేదు. కేవలం ప్రార్థన చేసి తన కొడుకు రోగాన్ని తగ్గించాడు. దాంతో ఆ మతం మీద అపారమైన నమ్మకం కుదిరి తానుకూడా క్రిష్టియన్ మతం పుచ్చుకున్నాడు.

ఇదంతా సరే. ఇంతకీ విషయం ఏమంటే ఆ రోజు నాగులచవితి. బస్సు వెళ్ళే దారిలో అన్నీ పొలాలే, పొలాల్లో కొన్ని చోట్ల పుట్టలున్నాయి. ఆ పుట్టల దగ్గర జనం పూజలు చేసినట్లుగా పసుపు, కుంకుమ, ఇత్యాదులు పడి ఉన్నాయి. వాటిని చూపిస్తూ ఆయన అన్నాడు 'చూడండి హిందువులు ఎంత మూర్ఖులో, పాముని దేవుడిగా పూజిస్తున్నారు. అయినా చెట్టు, పుట్ట ఇవన్నీ దేవుడేమిటండీ?"

ఆ మాటలు విన్న నాకు కొంచెం బాధాకరం అనిపించింది. స్వతహాగా అతడు హిందువు. అందునా బ్రాహ్మణుడు. ఈనకి బుద్ధి చెప్పాల్సిందే అనుకుని ఆయనతో 'చరాచర జగత్తులో అన్నీ దైవస్వరూపమే కదా? అలాంటప్పుడు పాములు కూడా దైవానికి ప్రతీకలే కదా?' అన్నాను.

'జగత్తులో అన్నీ దైవ స్వరూపాలే' అని ఎవరు చెప్పారు. ఎక్కడ ఉంది?' అన్నాడు కొంచెం ఆవేశంగా. 'క్రీస్తు చెప్పాడు. ఆ మాట బైబుల్‌లో ఉంది? అన్నాను ఆ మాటకి ఒక్కసారిగా షాక్ అయి, తేరుకుని 'క్రీస్తు ఎక్కడ చెప్పాడు?' అన్నాడు.

అదేమిటి? తన ఆఖరి భోజనంలో తన మాంస సదృశ్యమైన రొట్టెను, తన రక్తసదృశ్యమైన ద్రాక్షసారాయినీ అక్కడ ఉన్న అందరికీ పంచి తాను భగవత్స్వరూపంగా అందరిలోను ప్రవేశించాడు అని బైబిలులో ఉంది కదా? అందరిలోను ప్రవేశించాడు అంటే జగత్తులోని జీవరాసి యందంతటా ప్రవేశించాడు అని కదా చెప్పింది? అలాంటప్పుడు చెట్లు, చామలు, పశువులు, పక్షులు, పాములు అన్నీ దేవతా స్వరూపాలే కదా?' అన్నాను.

ఈ విషయం మీద అతనింక మాట్లాడలేదు. తరువాత అనేక విషయాలపైన చర్చ జరగింది. అవి అప్రస్తుతం. ఇక మన విషయానికి వస్తే

మన శాస్త్రాలలో నాగులు, సర్పాలు అని రెండు జాతులున్నాయి. ఈ రెండూ ఆకారంలో ఒకటిగా ఉన్నా వేరు వేరు జాతులకు సంబంధించినవి. భగవద్గీతలోని పదవ అధ్యాయం విశ్వరూప సందర్శన యోగంలో భగవానుడు **'సర్పాణామస్మివాసుకిః** ' సర్పాలలో నేను **వాసుకి**ని అన్నాడు. ఈ వాసుకే శివుడి మెడలో అలంకారంగా ఉంది. క్షీరసాగరమథనం చెయ్యటానికి ఈ వాసుకినే త్రాడుగా చేసుకున్నారు దేవదానవులు. ఈ వాసుకి కద్రువ కుమారుడు 28వ శ్లోకంలో సర్పాణామస్మి వాసుకిః అని చెప్పి, 29వ శ్లోకంలో **'అనంతశ్చాస్మినాగానాం'** నాగులలో అనంతుడను అన్నాడు. అనంతుడు అంటే ఆదిశేషుడు. కద్రువ పెద్దకుమారుడు. కాగా రెండవ వాడు వాసుకి.

విష్ణుమూర్తిని గురించి ఘోరతపస్సు చేసి, ఆయనకు పాన్పుగా ఉండే వరం పొందాడు అనంతుడు. బ్రహ్మ గారి ఆదేశం వల్ల ఈ అనంతుడే భూభారాన్ని కూడా మోస్తున్నాడు. అనేక అవతారాలలో అనంతుడు స్వామితోనే ఉన్నాడు.

| | | |
|---|---|---|
| రామావతారంలో | – | లక్ష్మణుడు |
| కృష్ణావతారంలో | – | బలరాముడు |
| వెంకటేశ్వరుడికి | – | గోవింద రాజులు |
| వైష్ణవ మతంలో | – | రామానుజుల వారు |

గీతలో భగవానుడు సర్పాలలో – వాసుకి, నాగులలో – అనంతుడు నేనే అన్నాడు. కాబట్టి ఈ రెండూ వేరు వేరా అని చిన్న అనుమానం. అయితే సర్పాలు విషపూరితాలు, నాగులు విషరహితాలు అని కొంతమంది నమ్మకం.

సర్పాలకు, నాగులకు చాలా తేడా ఉంది. నాగులు కామరూపులు. కావలసిన రూపాన్ని ధరించగలవు. అవసరమైనప్పుడు మానవరూపంలో కూడా దర్శనమివ్వగలవు. సర్పాలు నేలను అంటిపెట్టుకొనే ఉంటాయి. నేలమీద ప్రాకుతాయి. నాగులకు ప్రత్యేకమైనలోకం నాగలోకమున్నది. వీటికి వాయువే ఆహారం గాలి తిని బ్రతుకుతాయి. సర్పాలు కప్పలు, ఎలుకలు మొదలైన వాటిని ఆహారంగా తీసుకుంటాయి. నాగులు మానవ సంచారమున్న ప్రాంతాల్లో జీవించవు. వీటిలో మళ్ళీ తొమ్మిది రకాల జాతులున్నాయి. మానవులు పట్టుకోవటానికి ఇవి దొరకవు. అదే సర్పాలలో దేవతాసర్పాలు అని ప్రత్యేకంగా ఉన్నాయి.

మన కంటికి కనిపించేవి ఎక్కువగా పాములు. ఎనభై శాతం పాములకు విషముండదు. పాములు ఎక్కడా పాలు త్రాగవనేది నిజం. కాని మానవుల భక్తికి మెచ్చి నాగదేవతలు అనేక రూపాల్లో దర్శనమిస్తారు. ఆరోగ్యము, సంతానము వంటివి నాగదేవతలు ప్రసాదిస్తారు. దేవతా సర్పాలకు కూడా ఆ శక్తి ఉంది. నాగులు, సర్పాలు పాలు త్రాగుతాయి. పాములు మాత్రమే పాలు త్రాగవు.

పూర్వకాలంలో దేవతలు అవసరమైనప్పుడు భూలోకానికి వచ్చేవారు. అని అనేక గ్రంథాలలో చెప్పటం జరిగింది. అలాగే ఈ నాగులు కూడా ఈ లోకంలో సంచరించేవి. మానవులు వాటిని అత్యంత భక్తిశ్రద్ధలతో పూజించి పసుపు, కుంకుమ, సారె సమర్పించేవారు. తరువాత కాలంలో నాగులు ఈ లోకంలోకి రావటం, తిరగటం తగ్గిపోయింది. అలాగే దేవతాసర్పాలు కూడా ఈ లోకానికి రావటం తగ్గిపోయింది. అందుకని మానవులు నాగులను, దేవతా సర్పాలను విగ్రహాల్లో ఆవాహన చేసి, వాటిని పూజిస్తున్నారు.

ప్రస్తుత కాలంలో బయట పుట్టల్లో కనిపించేవి మామూలు పాములే. ఈ పాములు పాలు త్రాగవు. వీటికి పూజలు కూడా ఉండవు. ఒకవేళ పూజించవలసి వస్తే రాతిలో ఆవాహన చేసిన నాగ విగ్రహాలను పూజిస్తారు.

సంతానం లేనివారు, వివాహం కాని వారు నాగదేవతలను అర్చించి వాటిని పొందుతారు. ఇప్పటికీ ఇది జరుగుతూనే ఉంది. ఇక నాగులచవితి రోజున పాములను పూజించటం మూఢాచారమా? అంటే మొదట్లో నాగులు ఈ లోకంలో తిరుగాడినప్పుడు అది సదాచారమే. రాను రాను నాగులు, దేవతాసర్పాలు ఈ లోకంలోకి రావటం మానేసినా వాటిని పూజించటం, పాములకు పాలు పొయ్యటం అలవాటై పోయింది. ఇది

విషయం తెలుసుకుని ఆచరిస్తే ఫలితం ఎక్కువగా ఉంటుంది.

## 22. బంధాలు-అనుబంధాలు

నేటి సమాజంలో అందరిదీ 'బిజీలైఫే' ఎవరికీ ఒక క్షణం కూడా తీరిక ఉండదు. పెద్ద పెద్ద జీతాలు తీసుకుంటున్నాం. పెద్ద కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాం అంటారు కాని ఇంట్లో భార్యాపిల్లలతో గడపటానికి క్షణం తీరిక ఉండదు. తల్లితండ్రులతో మాట్లాడటానికి అసలు సమయమే ఉండదు. వారిని అనాథ శరణాల యందులోనో వృద్ధాశ్రమంలోనో చేర్పించి చేతులు దులిపేసుకుంటున్నారు. ఇలా చెయ్యటం పెద్ద అంటురోగంలా వ్యాపిస్తోంది. ఇక్కడ ఒక చిన్నికథ చూడండి. ఇది కేవలము కథ కాదు యథార్థ గాథ.

రామారావు ఇంజనీరింగ్ చేశాడు. ఒక పెద్ద సాఫ్ట్వేర్ కంపెనీలో ఉద్యోగం. సంవత్సరానికి యాభై లక్షలు జీతం. ఇంట్లో భార్యా, తను, ఎనిమిది సం॥ల పాప ఉంటున్నారు. వీరితో బాటే రామారావు గారి తల్లికూడా ఉంటోంది. తండ్రి లేడు. పాపకి నాయనమ్మ తోచనువు ఎక్కువ. ఆమె ఇంట్లో లేదు. ఎక్కడికి వెళ్ళింది అని అడిగితే చుట్టాల ఇంటికి వెళ్ళింది. ఓవారం పాటు అక్కడే ఉంటుంది అన్నారు అమ్మా నాన్నా. సరేననుకుంది పాప. ఆ మరునాడు పాపా వాళ్ళ స్కూల్లో చిన్నపాటి ప్రోగ్రామ్ అరేంజి చేశారు. అదేమంటే ఊళ్లో ఉన్న వృద్ధాశ్రమానికి రేపు శనివారం వెళ్ళాలి.

సరే శనివారం రానే వచ్చింది. అనుకున్న ప్రకారం స్కూల్లో అందరూ బయల్దేరి వృద్ధాశ్రమానికి ప్రయాణమయ్యారు. వృద్ధాశ్రమంలో పిల్లలందరూ అక్కడున్న

వృద్ధులందరినీ కలిసి వారికి పళ్ళు, బిస్కట్లు వంటివి పంచి పెడుతున్నారు. వృద్ధులంతా వరుసలో వస్తున్నారు. ఇప్పుడు పంచి పెట్టటం పాపవంతయింది. చేతో పళ్ళు తీసుకుని తల తిప్పింది పాప. ఎదురుగా నుంచుని ఉంది వాళ్ళ మామ్మ. వీరిచ్చే పండ్లు, బిస్కట్లు తీసుకోవటానికి వరుసలో వచ్చింది నానమ్మ. నానమ్మను చూడగానే మనసు ఆగలేదు పాపకి. నానమ్మా అంటూ ఆమెను కౌగిలించుకుని వెక్కి వెక్కి ఏడ్చింది పాప. ఇంట్లో అడిగితే, ఎవరో చుట్టాల ఇంటికి వెళ్ళిందన్నారు. కాని నానమ్మని ఇక్కడ చేర్పించారన్న మాట. విషయం తలచుకుంటే హృదయం బరువుతో నిండిపోతోంది. ఏం కర్మ వచ్చింది? లంకంత కొంప. బోలెడంత ఆస్తి. నానమ్మ చాలా మంచిది. ఆవిడని వృద్ధాశ్రమంలో ఎందుకు చేర్పించారు. చుట్టాల ఇంటికి వెళ్ళిందని అబద్ధం ఎందుకు చెప్పారు? అర్థం కాలేదు పాపకి. విపరీతంగా ఏడ్చింది.

ఇదే సందర్భంలో ఇంకో కథ చెబుతా వినండి. ఒక వృద్ధాశ్రమం రాత్రి పది గంటలవుతోంది. అందరూ విశ్రాంతి తీసుకోవటానికి వెళ్ళిపోయారు. కాపలాదారుడు గేట్లు వేసెయ్యటానికి వచ్చాడు. గేటు దగ్గర డబ్బై సం॥ స్త్రీ నుంచుని బయటకు చూస్తోంది. 'అమ్మా! టైము పది గం॥ అవుతోంది. వెళ్ళి పడుకోండి తలపులన్నీ తాళాలు వేసెయ్యాలి. అని చెప్పి తన పని చేసుకుపోతున్నాడు కాపలావాడు. ఆ స్త్రీ అక్కడే ఉంది. ఏమ్మా! మీకే చెప్పేది. రాత్రి పదయింది ఇంక లోపలికెళ్ళండి అన్నాడు కాపలాదారు. లేదు మా అబ్బాయి వస్తాడు. వచ్చి నన్ను తీసుకు వెళ్ళిపోతాడు అంది ముసలావిడ. కాపలాదారుకు ఏమీ అర్థం కాలేదు. ప్రక్కనే ఇంకొక సెక్యూరిటీ అతను వచ్చి" ఒక వారం క్రితమే ఈమె ఆశ్రమంలో చేరింది. అది కూడా

వారిది మంచి సంపన్న కుటుంబం. భార్యా భర్త ఇద్దరూ ఒకరి కోసం ఒకరు అన్నట్లుండే వారు. సంతానం లేదు. పిల్లల కోసం వారు చెయ్య పూజలు గాని, వ్రతాలు గాని, దానాలు ధర్మాలు లేవు. ఇలాంటివన్నీ చేయగా చేయగా చివర భార్య ఒక పండండి పిల్లవాడ్ని కన్నది. ఆ పిల్లవాణ్ణి చాలా జాగ్రత్తగా, అల్లారుముద్దుగా పెంచారు. అతడు మంచి చదువు చదువుకున్నాడు. అమెరికాలో ఉద్యోగం తల్లి ఇతణ్ణి వదలి ఉండలేదు. అయినా తప్పదు అమెరికా వెళ్ళి తీరాలి. అమెరికా వెళ్ళాడు. తల్లికి జబ్బు చేసింది. ఇండియా వచ్చాడు. ఏం చెయ్యాలి తల్లినీ? దీర్ఘంగా ఆలోచించి

వృద్ధాశ్రమానికి తీసుకు వచ్చాడు. తల్లిని ఇక్కడ వప్పగించి, పోతూ పోతూ నేనిప్పుడే వచ్చి నిన్ను తీసుకుని వెడతాను అని చెప్పాడు. తనను ఆశ్రమంలో చేర్పించిన సంగతి ఆమెకు తెలియదు. దాంతో ఆ పిచ్చితల్లి, తన సూట్‌కేస్‌తో సహా వచ్చి వీధి గుమ్మం దగ్గర నుంచున్నది. కొడుకు ఇక్కడ కట్టవలసిన డబ్బులు చెల్లించి తల్లితో మాటైనా చెప్పా పెట్టకుండా వెళ్ళిపోయాడు అమెరికాకి. ఈ మాట తరువాత ఆశ్రమ నిర్వాహకులు ఆమెకు చెప్పారు. విషయం వినేసరికి ఆమె మెదడు దెబ్బ తిన్నది. పని చెయ్యటం మానేసింది. ఒక రకమైన షాక్‌లో ఉంది. అప్పటి నుంచి ప్రతిరోజు రాత్రి బాగా పొద్దు పోయే దాకా సూట్‌కేస్‌తో వచ్చి వాకిట్లో నుంచుటుంది. ఎవరైనా ఏమైనా అడిగితే మా అబ్బాయి వచ్చి తీసుకుపోతాడు అని చెబుతుంది. ప్రతిరోజు ఇదే తంతు. ఈ రకంగానే ప్రతిరోజూ జరుగుతుంది వాడు రాడు. ఈమెను తీసుకువెళ్ళడు. ఈవిడ సూట్‌కేస్ చేత్తో పట్టుకుని అస్తమానము వాకిట్లో గేటు దగ్గరే నుంచుని వీధిలోకి చూస్తుంటుంది. ఏమైనా అడిగితే నన్ను తీసుకు వెళ్ళటానికి కొడుకు వస్తున్నాడు అని చెబుతుంది. ఇప్పుడు కూడా అదే పని చేస్తోంది" ఆ మాటలు వినగానే కాపలా వాడి కళ్ళ వెంట నీళ్ళు తిరిగినాయి. తల్లేమో పిల్లవాడిమీద అమితమైన ప్రేమ చూపిస్తోంది. పిల్లవాడికేమో తల్లి గురించి అసలు పట్టదు" పెద్ద నిట్టూర్పు విడిచాడు కాపలాదారు. ఏం పిల్లలో ఏం మమకారాలో.

ఒక ఊళ్ళో ఒక చిన్న కుటుంబం ఉండేది. భార్య, భర్త, ఎనిమది సం॥ కుమారుడు. భర్త కుమారుడు, మామగారు ముగ్గురికీ భోజనం వడ్డించింది కోడలు. భర్తకి, కుమారుడికి పప్పు, కూర, సాంబారు, మామ గారికి మాత్రం పచ్చడి మెతుకులు ఆకలిమీద ఉన్న డెబ్బై ఏళ్ళ మామగారు పచ్చడి మెతుకులు నోట్లో పెట్టుకోగానే కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగాయి. గొడ్డు కారం, కనీసం నెయ్యి కూడా లేదు. జాలిగా చూసిన మనవడు అడిగాడు తల్లిని. 'అమ్మా! తాతయ్యకి కూడా కూర వెయ్యవచ్చు కదా?!

'కూరా లేదు గీరా లేదు. ఎక్కణ్ణించి వస్తాయి అయినా కొంతమంది వయసై పోయినా ఇక్కడే పట్టుకు వెళ్ళాడతారు. ఆ పాడు భగవంతుడు వీళ్ళని తీసుకుని పోను కూడా పోడు.' ఒక్కసారి కస్సుమంది కోడలు. ఎవరూ ఇంకేం మాట్లాడలేదు. కన్న కొడుక్కే పట్టలేదు తండ్రి దుస్థితి ఇంకెవరికి పడుతుంది?

చిన్నప్పుడు ఒకసారి తెలియక మిరపకాయ కొరికాడు ఈ కొడుకు. నోరంతా మంట పెట్టి అల్లాడిపోయాడు. చాలా సేపటిదాకా తగ్గలేదు. అప్పుడు ఈ తండ్రి మనసు ఎంతగా క్షోభించిందో, అదే కొడుకు ఇంట్లో ఇప్పుడు అదే తండ్రికి గొడ్డుకారం మెతుకులు. విధి విపరీతం మింగలేడు కక్కలేడు. నోరంతా మంట గొడ్డుకారం.

పదిరోజుల తరువాత చచ్చిపోయాడు తండ్రి. దిన వారాలు గొప్పగా చేశాడు కొడుకు. పదవ రోజున తండ్రి ఫోటోకి నమస్కారం పెట్టి, పిండం పెట్టమన్నారు. వెండి పళ్ళెంలో పంచ భక్ష్య పరమాన్నాలు వడ్డించారు. పిత్రుదేవతలు కాకి రూపంలో వచ్చి పిండాలు తింటారని నమ్మకం. ఒక్క కాకి కూడా లేదు తినటానికి కాకులు వచ్చి చుట్టూ కూచున్నాయి. కాని అన్నం మాత్రం ముట్టుకోలేదు.

'బ్రతికున్నప్పుడు సరిగా చూసినట్లు లేరు. అందుకే కాకులు రావటం లేదు' అన్నారు ఒకరు. 'నాకు తెలుసు. అన్నం కూడా సరిగా పెట్టలేదు' అన్నారు. ఇంకొకరు

'బ్రతికున్నప్పుడు గంజినీళ్ళు కూడా పొయ్యకుండా, చచ్చిన తరువాత పంచభక్ష్యాలు పెట్టి ఏం లాభం' అన్నారు మరొకరు.

'మనం మన తల్లి తండ్రుల్ని సరిగా చూడకపోతే, రేపు మన పిల్లలు మాత్రం మనల్ని సరిగా చూస్తారా?' తలోమాట అంటున్నారు. అవమాన భారంతో తల దించుకున్నాడు కొడుకు.

తల్లిదండ్రులకు వారసులు పిల్లలు. కేవలం వారు సంపాదించిన ఆస్థి అనుభవించటమే కాదు. వారిని జాగ్రత్తగా చూడవలసిన బాధ్యత కూడా వారిమీద ఉంటుంది. మాకు తీరిక లేదనో, చూసే వారు లేరనో, ఇంకా ఏ ఇతర కారణాల వల్లనో కన్నతల్లితండ్రులను వృద్ధాశ్రమాలపాలు చెయ్యకండి. విదేశాలలో ఇలాగే జరుగుతుంది కదా? అని అడగద్దు. వాళ్ళ సంస్కృతి వేరు. బంధాలు, అనుబంధాలు వారికి ఉండవు. మనది ఆ సంస్కృతి కాదు. మన పిల్లల్ని చిన్నప్పుడు మనం హాస్టల్లో పడేస్తే, వారు పెద్దైన తరువాత తల్లితండ్రుల్ని వృద్ధాశ్రమానికి పంపక ఏం చేస్తారు? అనురాగము, ఆప్యాయత ఆదరణ పెంపొందింప చేయండి. **తాతమూకుడే తరతరాన** అనే సామెతకు స్వస్థి పలకండి. తల్లితండ్రుల్ని భగవంతుడికి ప్రతీకలుగా కాకపోయినా, కనీసం సాటి మనుషులుగా నైనా గౌరవించి ఆదరించండి.

# 23. ప్రశాంత జీవనం

సమాజంలో స్త్రీ అంటే గౌరవం లేకుండా పోయింది. స్త్రీ ఒక భోగ్య వస్తువుగా చూడబడుతున్నది. స్త్రీల మీద అత్యాచారాలు బాగా పెరిగిపోతున్నాయి. వాటిని ఏ రకంగా అరికట్టాలో కూడా తెలియటం లేదు. అయితే మనదేశంలో మొదటి నుంచీ స్త్రీ యొక్క పరిస్థితి ఇలాగే ఉన్నదా? అంటే లేదు అనే చెప్పాలి.

వేదకాలంలో స్త్రీకి చాలా గౌరవం ఉండేది. ప్రాముఖ్యత ఉండేది. ప్రత్యేకంగా తొలివేద కాలంలో స్త్రీకి అత్యంత గౌరవం ఉండేది. రాజకీయంగా అంతర్గత సలహా మండలిలో రాణిగారికి ప్రత్యేక అధికారాలుండేవి. వర్ణవ్యవస్థకు అతీతంగా స్త్రీ గౌరవించబడేది. మలివేదకాలం వచ్చేసరికి స్త్రీ యొక్క ప్రాముఖ్యత తగ్గింది. ఆ తరువాత కాలంలో స్త్రీ ప్రాముఖ్యత బాగా తగ్గిపోయి స్త్రీ అంగడి బొమ్మగా, ఆటబొమ్మగా, బానిసగా కూడా చూబడింది. ఇది మన సంస్కృతిలో లోపం కాదు. కొంతమంది స్వార్థపరుల ఆలోచన. సమాజం దృక్పథంలో లోపం.

జగత్తులో పిపీలికాది బ్రహ్మ పర్యంతము 84 లక్షల రకాలయిన జీవరాసులు శరీరాన్ని పొందుతుంటారు. ఉత్తమ కర్మలు చేసినవారు ఉత్తమ యోనులయందు జన్మిస్తే, నీచపు కర్మలు చేసిన వారు నీచయోనుల యందు జన్మిస్తారు. ఈ జీవరాసిలో ఒక్క మానవుడు తప్ప, మిగిలిన వాటికన్నింటికీ ఆహార నిద్రాభయమైథునాలు సమానమే. ఇందులో ఒక్క మానవుడికి మాత్రమే ఆలోచించగల శక్తి ఉంది. యుక్తాయుక్త విచక్షణ ఉంటుంది. ఏది మంచి ఏది చెడు అనే విషయాలు పూర్తిగా ఆలోచించి మరీ నిర్ణయం తీసుకుంటాడు. సృష్టిలో మానవుడు ఒక్కడే కర్మలు చెయ్యగలడు. మిగిలిన జీవులన్నీ తమ ప్రారబ్ధకర్మను అనుభవించటానికే జన్మిస్తాయి. అయితే మానవుడు కర్మఫలాన్ని అనుభవించటమే కాదు. మళ్ళీ కర్మను కూడా చెయ్యగలడు. ఈ రకంగా జీవరాసిలో 'మానవజన్మ దుర్లభమైనది' **జంతూనాం 'నరజన్మ దుర్లభం'** అన్నారు. అందులోను బ్రాహ్మణ జన్మ మరీ దుర్లభమైనది. ఎందుకంటే బ్రాహ్మణుడికి పుట్టుకతోనే కొంత సంస్కారం ఉంటుంది. తల్లితండ్రుల నుంచి కొంత శక్తి వస్తుంది. అందుకే ఈ మానవజన్మలో కూడా బ్రాహ్మణజన్మ మరీ ఉత్తమమైనది. తల్లితండ్రులు తాత ముత్తాతలు పండితులు, తపస్సంపన్నులు,

నిష్ఠాగరిష్ఠులు అయినప్పుడు, ఆ శక్తి ఇతడిలో తప్పకుండా వచ్చి తీరుతుంది. కాబట్టే బ్రాహ్మణుడుగా జన్మించాలంటే కొన్ని వందల జన్మల పుణ్యఫలం ఉండి తీరాలి. ప్రవృత్తి మార్గంలో కర్మ ప్రోగు చేసుకుని సుఖాలు అనుభవించటానికి ఇతర వర్ణాలలో జన్మ సరిపోతుంది. కాని నివృత్తిమార్గంలో చరించాలంటే బ్రాహ్మణజన్మ తప్పనిసరి. కొందరికి అనుమానం వస్తుంది. బ్రాహ్మణేతరులు కూడా నివృత్తి మార్గంలో ఉన్నారు కదా? అని నిరంతరము సత్యాన్వేషణలో కాలం గడిపే వారందరూ బ్రాహ్మణులే. బ్రాహ్మణజన్మ ఎత్తిన తరువాత విహితకర్మలు చేస్తూ ఒక్కొక్క మెట్టుపైకి పోవాలి. అలాగే పోతారు. కాని ఒక్కొక్కసారి పతనం కూడా కావచ్చు. పిల్లలకు సరైన విషయ పరిజ్ఞానమందించవలసిన బాధ్యత తల్లి తండ్రులదే.

ఇక స్త్రీ విషయానికి వస్తే సమాజంలో స్త్రీకి ప్రముఖమైన స్థానం ఉంది. దేశ సంస్కృతి అంతా స్త్రీ మీదనే ఆధారపడి ఉంటుంది. అందులోను బ్రాహ్మణ కులంలో జన్మించిన స్త్రీ ఇంకా ముఖ్యమైన భూమిక పోషిస్తుంది. చిన్నప్పటి నుంచి తల్లితండ్రుల అడుగుజాడలలో నడిచి వేదవేదాంగాలు, పురాణాలు, ఇతిహాసాలలో చెప్పిన విషయాలన్నీ గ్రహిస్తుంది. మన సంస్కృతి సంప్రదాయాలకు పెద్దపీట చేస్తుంది. ఆడపిల్ల ఇంట్లో పుడితే సాక్షాత్తు లక్ష్మీదేవే ఇంట్లో జన్మించింది అని ఆనందిస్తారు. అన్ని కళలలోను ఆరితేరిన తరువాత యుక్తవయసు రాగానే తగిన వరుణ్ణి చూసి వివాహం చేస్తారు. అప్పటి నుంచి అన్ని విషయాలలోను భర్తనే అనుసరిస్తూ పుట్టినింటికీ, మెట్టినింటికీ పేరు ప్రఖ్యాతులు తెచ్చి పెడుతుంది. ఈ రోజులలో చదువుకున్న స్త్రీలైతే, తగిన ఉద్యోగాలు నిర్వహిస్తూ ఉన్నత శిఖరాలు అధిరోహిస్తున్న వారు ఎందరో ఉన్నారు. అదంతా వారి పూర్వీకులు నిర్వహించిన పూజా పునస్కారాలు, యజ్ఞయాగాదుల ఫలితం. కొంతమంది స్త్రీలను చూడగానే చేతులెత్తి దణ్ణం పెట్టాలనిపిస్తుంది. కట్టు, బొట్టు, ఆచార వ్యవహారాలు అన్నీ ప్రత్యేకంగా కనిపిస్తాయి. వారివల్లనే భారతీయ సంస్కృతి, సంప్రదాయాలు వెల్లివిరుస్తాయి. అయితే నేటి సమాజంలో కొందరు స్త్రీలు పాశ్చాత్య నాగరికత వెంట పరుగులు తీస్తున్నారు. ఈ విషయంలో స్త్రీలనే కాదు పురుషులను కూడా మనం హర్షించకూడదు. పాశ్చాత్య సంప్రదాయం మనల్ని నావనం చేస్తుంది. ప్రపంచం మొత్తం మీద హిందూ సంప్రదాయం చాలా గొప్పది అని అందరూ మెచ్చుకుంటుంటే,

మనమేమో మన సంప్రదాయాన్ని వదిలి పాశ్చాత్యుల వెంట పరుగులు పెడుతున్నాం. ఇది మనలో ఉండే ప్రశాంతతని, జీవన విధానాన్ని నాశనం చేస్తుంది.

**"స్వధర్మే నిధనం శ్రేయః"** ధర్మాలన్నింటిలోకి నీ ధర్మమే నీకు శ్రేయస్కరమైనది. పరధర్మం చాలా ఆకర్షణీయంగా కనిపించినప్పటికీ ఆచరణ యోగ్యం కాదు. చిన్న ఉదాహరణ చూడండి. హిందూ ధర్మంలో వివాహమే కాని విడాకులు లేవు. ఇది పాశ్చాత్య సంస్కృతి. ఇప్పుడు ఇది మరీ బరితెగించి పోయింది. దీంతో సామాజిక కట్టుబాట్లు, ధర్మాలు, నీతి, న్యాయము అన్నీ దెబ్బ తింటాయి. వీటి ఫలితము ఇప్పుడే కాదు. ఇంకా కొన్ని సంవత్సరాల తరువాత కనిపిస్తుంది. అప్పుడు తెలుస్తుంది. మనం ఎంత పతనమై పోయామో?

కాబట్టి ఓ యువతా ! ధర్మాన్ని పాటించండి. మీరు ప్రశాంతంగా జీవించండి. ఇతరులకు కూడా ప్రశాంత జీవనం అందించండి.

## 24. తద్దినాలు పెట్టాలా?

మరణించిన వారికి వారు మరణించిన రోజున సంవత్సరానికి ఒకసారి పెట్టేదే తద్దినము. దీన్నే ఆబ్దీకము అని కూడా అంటారు. బ్రాహ్మణులు తద్దినం పెట్టాలంటే మంత్రం చెప్పేవాడు కాక ఇద్దరు భోక్తలు కావాలి. ఇతర వర్ణాలవారైతే పెద్దల తిథి వచ్చిన రోజున బ్రాహ్మణుడికి స్వయంపాకం ఇస్తారు. దీనికి కారణము తద్దినం పెట్టించే బ్రాహ్మణుడు బ్రాహ్మణేతరులింట్లో భోజనం చెయ్యడు. బ్రాహ్మణుల ఇంట్లో మాత్రం యథావిధిగా తద్దినం పెడతారు. ఆ రోజున అపరాహ్ణం దాటితే గాని భోక్తలు రారు. తద్దినం పెట్టాలంటే ముందు అపరాహ్ణానికి తిథి ఉండాలి. ఒంటి గంటదాకా కనీసం ఆ తిథి ఉంటేనే తద్దినం పెట్టటం జరుగుతుంది. మంత్రం చెప్పే బ్రాహ్మణుడు, ఇద్దరు భోక్తలు, వంట చెయ్యటానికి మనిషి. తద్దినం పూర్తయ్యేసరికి హీనపక్షం మూడు నుంచి ఐదువేలు ఖర్చవుతుంది. ఇది కాకుండా హైరాణా డబ్బులు పోయినా ఫరవాలేదు. కాని ఈ హైరాణా మాత్రం పడలేము. అని చాలామంది రాఘవేంద్రస్వామి మఠం లాంటి చోట్లకు వెళ్ళి అక్కడ తద్దినాలు పెడుతున్నారు. ఈ మధ్య కాలంలో ఈ రకంగా ఆబ్దీకం పెట్టటం ఎక్కువై పోయింది. అయితే అక్కడ కూడా డబ్బులు బాగా పెంచేశారు. రూ. 3500 కట్టించుకుంటున్నారు

తద్దినానికి బ్రాహ్మణులకు ముగ్గురికీ కాక ఇంక ఇద్దరికే భోజనం పెడతారు. ఒకవేళ ఎక్కువమంది వస్తే మనిషికి రూ. 125/– చొ॥న ముందుగానే కట్టవలసి ఉంటుంది. ఇది సామాన్య మానవుడికి పెనుభారంగా మారింది. దాంతో బ్రాహ్మణులు దొరకటం లేదనో, డబ్బులు బాగా ఖర్చవుతున్నాయని ఆఫీసులో శెలవు దొరకటం లేదనో, రకరకాల వల్లనో, తద్దినం పెట్టటం మానేస్తున్నారు. ఇది సరైన పనేనా? తద్దినాలు పెట్టటం మానెయ్యచ్చా? ఈ విషయాన్ని కూలంకుషంగా చూద్దాం.

1. ఇలా చేస్తే అంటే తద్దినాలు పెట్టటం మానేస్తే వంశాభివృద్ధి జరగదు. వంశంలో మహా అయితే ఆడపిల్లలే తప్ప మగపిల్లలు జన్మించరు. కొన్ని సమయాల్లో ఆడపిల్లలు మాత్రమే పుడతారు. మగపిల్లలు లేరు. కాబట్టి వంశాభివృద్ధి జరగదు. ఇది ముమ్మాటికి జరుగుతున్నది. పిత్రుదేవతలు సంతసించకపోతే వంశాభివృద్ధి జరగదు. తద్దినం పెట్టాలంటే మడిదడి, ఆచార వ్యవహారాలు పాటించి తీరాలి. ముందురోజు రాత్రి కర్త భోజనం చెయ్యరాదు. తడిబట్టలతోనే వంట చేసి, బ్రాహ్మణులకు వడ్డించాలి. పొడిబట్ట పనికిరాదు. ఆ క్రితం రోజు రాత్రి బ్రహ్మచర్యం పాటించాలి. నేలమీదనే నిద్రించాలి. భక్తిశ్రద్ధలతో పెట్టే దాన్నే **శ్రాద్ధము** అంటారు. లెక్క ప్రకారమైతే, ఇంటి కోడలే వంట చేసి వడ్డించాలి. ఇలా చేస్తే పిత్రుదేవతలు అనుగ్రహిస్తారు. దేవ పిత్రుకార్యక్రమాలు తాము ఉండే ఇంట్లోనే పెట్టాలి.

పిత్రుదేవతలు అంటే కేవలము గతించిన మన తండ్రులు, తాతలే కాదు. జీవుల యొక్క జనన మరణాలు, వారి గతులను మార్చేందుకు సమర్ధవంతంగా నిర్వహించేందుకు ఒక ప్రత్యేక వ్యవస్థ ఉంటుంది. ఆ వ్యవస్థను సమర్ధవంతంగా నిర్వహించే వాళ్ళని పిత్రుదేవతలు అంటారు. ఇందులో వసువులు, ఆదిత్యులు, రుద్రులు కూడా ఉంటారు. వీరినే పిత్రుదేవతలు అంటారు. ఇక్కడ ఒక చిన్న అనుమానం వస్తుంది. మరణించిన తరువాత జీవుడు ఇంకొక జన్మ ఎత్తుతాడు కదా? మరి మనమిచ్చే తర్పణాలు, పిండప్రదానాలు వారు ఎలా తీసుకుంటారు. ఒకవేళ వారు పునర్జన్మ ఎత్తితే, మనమిచ్చేవి వారికి చేరవు కదా? మరణించిన జీవి తాను చేసిన పాపపుణ్యాలు అనుభవించి మళ్ళీ జన్మించటానికి సుమారుగా ముప్పై సంవత్సరాలు పడుతుంది. అయితే కొన్ని జీవులు వెంటనే జన్మించవచ్చు. కొన్నింటికి ఇంకా ఆలస్యం కూడా కావచ్చు. అది ఆ జీవుని యొక్క సంకల్ప బలం మీద

ఆధారపడి ఉంటుంది. అతను చేసిన కర్మలమీద ఆధారపడి ఉంటుంది. ఒకవేళ వారు మళ్ళీ జన్మించినా మనం చేసే పిండప్రదానము వంటివి వారికి తప్పకుండా అందుతాయి. ఆ జీవి ఆవుగా జన్మించింది అనుకోండి. మనం చేసే పిండప్రదానం వల్ల ఆ ఆవుకు గడ్డి లభిస్తుంది. ఇలా జరగటానికి అక్కడ ఒక వ్యవస్థ ఏర్పాటై ఉంది. మనం ఇలా చేసినందుకు పిత్రుదేవతలు సంతోషించి మనకు మంచిని కలిగిస్తారు. ఒకవేళ గతించిన వారు ఉత్తమగతులు పొందితే, మనం చేసే కర్మలు వారికి అవసరం లేకపోతే, అప్పుడు మనం చేసిన కర్మల ఫలితం మనకే తిరిగి వస్తుంది. ఉదాహరణకు మనం వెంకట్రావు పేరుతో రెండు వేల రూపాయలు యం.ఓ. చేశాము. ఆ వ్యక్తి అక్కడ లేడు. ఇప్పుడు మనం పంపిన డబ్బు మనకే తిరిగి వస్తుంది కదా? అలాగే గతించిన వారు ఒకవేళ అక్కడ లేకపోతే మనం చేసిన కర్మ ఫలం తిరిగి మనకే చేరుతుంది.

అయితే గతించిన వారు ఎక్కడ ఉన్నారు? ఎలా ఉన్నారు? అనే విషయం మనకు తెలియదు కాబట్టి మనం జీవించి ఉన్నంత కాలం పిత్రుకర్మలు చేయవలసిందే.

ఆబ్దీకం పెట్టేటప్పుడు పిత్రుస్థానంలో ఒక భోక్తను కూర్చోపెట్టి, అతనిమీదకి వసురూపంలో తండ్రిని, రుద్ర రూపంలో తాతను, ఆదిత్య రూపంలో ముత్తాతను ఆవాహన చేస్తాం. ఈ కారణం చేతనే భోక్తలలో 'అయ్యా! కాలాతీతమై పోయింది. సావధానంగా తినండి' అంటాము. అక్కడ తినేది భోక్త రూపంలో ఉన్న మన పిత్రుదేవతలు.

పూర్వకాలంలో మనుషులకు తిండి పుష్టి ఉండేది. భోజనానికి కూర్చున్న వారు కనీసం ఇద్దరి భోజనం ఒక్కరే చేసేవారు. ఇవాల్టి రోజున ఆ శక్తి వీరికి లేదు. పైగా బి.పి., షుగరు మొ॥ వ్యాధులు కూడా. భోక్తగా ఉండే వారు ఎలా ఉండాలి అనే దానికి సమాధానం చెబుతోంది. వారికి ఏ అంగవైకల్యము ఉండరాదు. ఏ రోగము ఉండరాదు. ఈ రోజుల్లో అలాంటివారు దొరకటం కూడా చాలా అరుదు.

అపరాహ్నం అంటే పన్నెండు గంటలు దాటిన తరువాతే తద్దిన కార్యక్రమం ప్రారంభించాలి. భోజనాలయ్యే సరికి సాయంత్రం అవుతుంది. ఇవాల్టి రోజున అంత తీరిక ఎవరికుంది. ఆఫీసు పనులు. తద్దినం పెట్టేసి, తాను భోజనం చేసి

ఆఫీసుకెళ్ళిపోవాలి. కాబట్టి 11 గం॥లలోపే కార్యక్రమం అంతా పూర్తి కావాలి. ఈ బిజీలైఫ్‌లో తద్దినం పెట్టామా లేదా? అనే స్థితికి వచ్చాం. తద్దినాలు పెట్టించే వివిధ సంస్థలు కూడా మన కనుగుణంగానే నడుస్తున్నాయి. ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమంటే అపరాహ్నమయితే గాని పిత్రుదేవతలు రారు. వారు రానప్పుడు ఇక్కడ పిండప్రదానం జరిపేది ఎవరి కోసం? తద్దినం పెట్టించే బ్రాహ్మణుడి కోసమా? లేక తద్దినం పెట్టే కర్త కోసమా? ఏదో ఒక తంతుగా జరుగుతున్నాయి ఇవాల్టి రోజున ఈ తద్దినాలు. ముక్తి పొందిన వారు తప్ప మిగిలిన వారు మనమిచ్చే తర్పణలు స్వీకరిస్తారు. ఉపనయనం జరుగుతున్నప్పుడు నాందీ ముఖం పేరుతో ముందుగా పిత్రుదేవతలను ఆవాహన చేసేది అందుకే.

వివాహాలు సంప్రదాయబద్ధంగానే జరగాలి. లేకపోతే ఇరువైపులా పిత్రుదేవతలు అథోగతి చెందుతారని శాస్త్రాలు చెబుతున్నాయి. అగస్త్య మహర్షి పోతూ ఉంటే త్రోవలో కొంతమంది ఒక చెట్టుకు తలక్రిందులుగానే వ్రేలాడుతూ కనిపిస్తారు. వారు అన్నపానీయాలు లేక విలపిస్తుంటారు. వారిని చూసి అగస్త్యుడు 'మీరెవరు? ఇలా ఎందుకున్నారు?' అని అడుగుతాడు. అప్పుడు వారు 'మా వంశంలో ఒకడు వివాహం చేసుకోలేదు. వాడు సంప్రదాయబద్ధంగా వివాహం చేసుకుంటేనే మాకు విముక్తి లభిస్తుంది' అంటారు. 'అతనెవరో చెప్పండి. నేను వెళ్ళి అతన్ని ఒప్పించి వివాహం జరిపిస్తాను' అంటాడు అగస్త్యుడు. అప్పుడు వారు 'అతడు నువ్వే నాయానా, మేమంతా నీ పిత్రుదేవతలము' అంటారు. ఆ మాటలు విన్న అగస్త్యుడు సిగ్గుపడి వెళ్ళి లోపాముద్రను వివాహం చేసుకుంటాడు. పురాణ కథలన్నీ ఇలాంటి విషయాలు మనకి తెలియదు చెప్పటానికే ఉన్నాయి.

ఈ కారణంగానే వివాహాది కార్యాలలో సంప్రదాయానికి అంత ప్రాధాన్యత ఇచ్చారు. ఒకవేళ ఎవరైనా సంప్రదాయ విరుద్ధంగా వివాహం చేసుకుంటే, వారితో తెగతెంపులు చేసుకునేవారు. పిత్రుదేవతలు అథోగతి పొందకూడదనే అలా చేసేవారు.

వివాహం జరిగిన తరువాత సంతానాన్ని పొంది పిత్రుకర్మలు యథావిధిగా చేస్తే, పిత్రుదేవతలకు పున్నామనరకం ఉండదు. అయితే వివాహం జరిగినా పిల్లలు లేకపోతే? అందులోను మగపిల్లలు లేకపోతే? అప్పుడేం చేస్తారు? అందులో మన

ప్రయత్న లోపం లేదు కాబట్టి విచారించాల్సిన పని లేదు అంటోంది శాస్త్రం. దీనికి ప్రత్యామ్నాయం చేస్తే సరిపోతుంది.

నవమాసాలు మోసి కని, అల్లారు ముద్దుగా పెంచి, విద్యాబుద్ధులు నేర్పించి నిన్ను ఇంత ప్రయోజకుణ్ణి చేసిన నీ తల్లితండ్రులకు తద్దినం పెట్టటం నీ కనీస కర్తవ్యం. పెట్టలేని స్థితిలో ఉన్న వారిని వదిలెయ్యండి. మిగిలిన వారికేమయింది? వారు చెయ్యటం లేదు. వారికి ఏమీ కాలేదు. వీరికి ఏమీ కాలేదు. నాకు మాత్రం ఏమవుతుంది? అని కొంతమంది ఈ పనులు మానేస్తున్నారు. వారికీ, వీరికీ ఏమయిందో నీకు తెలుసా? ఎక్కడో దెబ్బ తగిలింది. అది ఎక్కడ ఎలా ఎప్పుడు తగిలిందో తెలియదు. ఇలాంటి దెబ్బలన్నీ ఇలాంటి వాటివల్ల వచ్చేవే. కాబట్టి పిత్రుకార్యాలు తప్పనిసరిగా నెరవేర్చండి. పిత్రుదేవతల ఆగ్రహానికి గురి కాకండి. పిత్రుకార్యాలు చెయ్యకుండా ఎన్ని జపాలు, తపాలు చేసినా ఫలితం లేదు. పిత్రుకార్యాలు చేసిన వారికే దేవకార్యాలు సిద్ధిస్తాయి. వంశాభివృద్ధికి, అభీష్టసిద్ధికి, సంతాన క్షేమానికి పిత్రుకార్యాలు ప్రధానం. తల్లితండ్రులిచ్చిన ఆస్తిపాస్తులు అనుభవించటమే కాదు. వారి అభీష్టాలు కూడా నెరవేర్చాలని గుర్తించండి. చిన్నపిల్లలుగా ఉన్నప్పుడు తల్లితండ్రులు మన అవసరాలు ఎలా తీర్చారో, అలాగే మరణించిన తరువాత వారికి మనం మాసికాలు, తద్దినాలు పెట్టి తీరాలి. అది మన బాధ్యత. మన కర్తవ్యం.

పిత్రుదోషమనేది ఒక శాపం. పిత్రుకార్యాలు సరిగా చెయ్యకపోతే వారు శపిస్తారు. దానివల్ల మనకు తెలియని అనారోగ్యం వస్తుంది. తరువాత తరాలవారు కష్టాలపాలవుతారు. గౌరవ ప్రతిష్టలకు భంగం కలుగుతుంది. కావలసిన పనులు ముందుగానే ఆటంకాలు వచ్చి ఆగిపోతాయి. చిన్నతనంలోనే వైధవ్యం వస్తుంది. పిల్లల మానసిక స్థితి బాగుండదు. సంతానం కలగదు. పుట్టినపిల్లలు బ్రతకరు. సంతానం వల్ల సమస్యలు. ఇవన్నీ ఎందుకు జరుగుతున్నాయనే దానికి ఏ వైద్యుడు సమాధానం చెప్పలేడు.

కాబట్టి జీవితంలో ఇన్ని సమస్యలు ఎదుర్కొనే కన్న, సంవత్సరానికి ఒకసారి తల్లికి, తండ్రికి తద్దినం పెడితే సరిపోతుంది.

# 25. అన్నింటినీ పట్టించుకోవద్దు

జీవితంలో అనేక సంఘటనలు జరుగుతుంటాయి. కొన్ని మంచివి మరికొన్ని చెడ్డవి. అయితే ప్రతి విషయాన్ని మనం పట్టించుకోకూడదు. చిన్న చిన్న విషయాలు మనం వదిలెయ్యాలి. లేకపోతే అవి ఒక్కోసారి ప్రమాదానికి దారి తీయవచ్చు. అదే విషయాన్ని తీవ్రంగా ఆలోచించటం వల్ల ఆరోగ్యం దెబ్బ తింటుంది. బి.పి. పెరుగుతుంది. విపరీతమైన కోపం వస్తుంది. విషయం చిన్నదే కావచ్చు. కాని దాన్ని మనం తీసుకునే విధానం మీద ఆధారపడి ఉంటుంది. దాన్ని గనక మనం ఎక్కువగా ఊహించుకుని, సీరియస్‌గా తీసుకుంటే మన ప్రాణానికి కూడా ప్రమాదం జరగవచ్చు. దీనికి ఉదాహరణగా ఒక చిన్న కథ చూడండి.

పూర్వకాలంలో ఒక వడ్రంగి ఉండేవాడు. రకరకాలు సామాగ్రి చేసి అమ్ముతుండే వాడు. ఏదైనా మరమతులు కావాలన్నా చేసి పెడుతుండేవాడు. దాంతో అతను ఎప్పుడూ బిజీగానే ఉండేవాడు. ఒకరోజు రాత్రి బాగా ప్రొద్దు పోయేదాకా పనిచేసి, ఎక్కడి సామాను అక్కడే వదిలేసి, షాపుకు మాత్రం తాళం వేసి వెళ్ళిపోయాడు. అర్ధరాత్ర దాటిన తరువాత భయంకరమైన విషసర్పం ఒకటి ఆహారం వెతుక్కుంటూ అటూ ఇటూ తిరుగుతోంది. అలా తిరుగుతూ వడ్రంగి వాడి దుకాణంలోకి ప్రవేశించింది. అక్కడ ఉండే వస్తువుల గురించి దానికి ఏమీ తెలియదు. పనివాళ్లు ఎక్కడి సామాను అక్కడ వదిలేసి వెళ్ళారు కదా. దానిలో ఒక రంపాన్ని అలానే వదిలేశారు. అది నిలువుగా నుంచుని ఉంది. అది రంపమని, ముట్టుకుంటే తెగుతుందని పాముకు తెలియదు. పాము ప్రాకుతూ నిలువుగా ఉన్న రంపం మీదకి ఎక్కింది. ఎప్పుడైతే రంపం మీదకి ఎక్కిందో అప్పుడు రంపం పళ్ళు దాని శరీరంలోకి దిగాయి. పాముకు బాధ కలిగింది. ఎవరో తనని కావాలనే ఇబ్బంది పెడుతున్నారు అనుకుంది. అసలే దానికి రెండు రోజుల నుంచి ఆహారం లేకపోవటంతో విపరీతమైన ఆకలిగా ఉంది. ఆహారం దొరకలేదు కాబట్టి బాగా కోపంగాను, కసిగాను కూడా ఉంది. ఏమైనా శత్రువును చంపెయ్యాలి అనుకుని వెంటనే బుసలు కొడుతూ కాటువేసింది. కాటు వేయగానే రంపం పళ్ళు పాము నోట్లో దిగాయి. రక్తం కారింది. పాముకు నొప్పితో పాటు కోపం ఇంకా ఎక్కువైంది. దీని పని ఇలాకాదు అనుకుని

శరీరాన్ని రంపానికి వేసి గట్టిగా చుట్టేసింది. మామూలు పరిస్థితి లోనైతే శత్రువు ప్రాణాలు ఒక్క దెబ్బలో గాల్లో కలసిపోతాయి. కాని ఇక్కడ శత్రువు ఒకజీవి కాదు. ప్రాణం లేని పదునైన రంపం. శరీరం రంపానికి చుట్టుకునేసరికి, పాము శరీరానికి పెద్ద గాయమయింది. దగ్గర దగ్గరా ఒళ్ళంతా చిన్న చిన్న ముక్కలుగా తెగిపోయింది. కేవలం చర్మం ఆధారంగా పాము బ్రతికి ఉంది. ఆలోచన లేకపోవటం వల్ల, రంపం గురించి తెలియకుండా దీనిమీద దాడిచేసి, వంటితో గట్టిగా చుట్టేసుకోవటం వల్ల పాము శరీరం ముక్కలు ముక్కలుగా తెగిపోయి పాము చచ్చిపోయింది.

ఇక్కడ పాముకు – రంపానికి మధ్య తగాదా లేదు. ద్వేషం అంతకన్న లేదు. అయినప్పటికీ పాము తన అజ్ఞానంతో పదునైన రంపాన్ని గట్టిగా చుట్టుకుని తన చావును తనే కొనితెచ్చుకుంది.

అలాగే జనం కూడా జీవితంలో తమకి బాధ కలిగినప్పుడు, ఆ బాధకు కారణం వేరెవరో అనుకోవటం ఇలా చెయ్యటం వల్ల బి.పి., షుగర్, మొదలైనవి మొదలయ్యే అవకాశం ఉంది ఒక్కసారి బి.పి., షుగర్ ఎప్పుడైతే పెరిగాయో అప్పుడు శరీర ఆరోగ్యం దెబ్బ తింటుంది. కాబట్టి కోపం వచ్చినప్పుడు దాన్ని తగ్గించుకునేందుకు ప్రయత్నం చెయ్యాలి. తన ప్రయత్నాలేవీ ఫలించలేదని త్రికరశుద్ధిగా నమ్మాలి. అంతే కాని వృధాగా శత్రువుల మీద అనవసరంగా ప్రతాపం చూపటానికి ప్రయత్నించరాదు.

## 26. ఆవు చాలా పవిత్రమైనది

ప్రాచీన కాలంలో మనదేశంలో గోసంపద ఎక్కువగా ఉండేది. ఆవు చాలా పవిత్రమైనది. గోవును కాలితో తన్నరాదు అంటోంది ధర్మశాస్త్రం. ఆవుకు సంబంధించి పదిరకాల వీర్యాలున్నాయి. ఇవన్నీ బలవర్ధకాలు అంటోంది ఋగ్వేదం.

1. అప్పుడే పితికిన పాలు
2. వేడిపాలు
3. మీగడ
4. తోడు పెట్టిన పాలు
5. బాగా తోడుకోని పాలు
6. గడ్డ పెరుగు
7. వెన్న
8. నెయ్యి
9. గోదావరి
10. గోదావరి రసం

అంతేకాదు ఆవువల్ల ఇంకా అనేక ఉపయోగాలున్నాయి.

1. ఆవునెయ్యి రెండు చుక్కలు ముక్కు రంధ్రాలలో వేసుకుంటే మెదడు బాగా పని చేస్తుంది. ఎలర్జీ తగ్గుతుంది. పక్షవాతం రాదు. వచ్చిన వారికి తగ్గుతుంది. మంచి నిద్ర పడుతుంది. మైగ్రేన్ (పార్శ్వపునొప్పి) తగ్గుతుంది. కోమాలో ఉన్నవారు అందులోంచి బయటపడే అవకాశమున్నది. జుట్టు ఊడటం తగ్గిపోతుంది. కొత్త జుట్టు వస్తుంది. జ్ఞాపకశక్తి పెరుగుతుంది.

ఒక చెంచా ఆవునెయ్యిలో పటికబెల్లం కలిపి తినిపిస్తే భంగు, గంజాయి వంటి పదార్థాల మత్తు తగ్గుతుంది.

అరచేతులు, అరికాళ్ళు మంటలన్న వారికి ఆవునేతితో మర్దన చేస్తే మంటలు తగ్గుతాయి.

ఎక్కిళ్ళు వచ్చేవారు అరచెంచా ఆవునెయ్యి తింటే ఎక్కిళ్ళు ఆగిపోతాయి.

ప్రతిరోజు క్రమం తప్పకుండా ఆవునెయ్యి వాడితే ఎసిడిటీ, మలబద్ధకం రావు. ఒకవేళ ఉంటే పోతాయి. ఆవునెయ్యి బలవర్ధకము, వీర్య వర్ధకము మానసిక బలాన్ని పెంచుతుంది.

కఫము, శ్లేష్మము ఉన్న పిల్లల ఛాతీకి వీపుకి ఆవునెయ్యి రాసి మర్దన చేస్తే తగ్గిపోతుంది.

బలహీనంగా ఉన్నవారు గ్లాసుపాలల్లో ఒక చెంచా ఆవునెయ్యి, పటికబెల్లం పొడి కలిపి త్రాగితే బలం వస్తుంది. ఆవునెయ్యి కేన్సర్ రాకుండా చేస్తుంది. వచ్చిన వారికి తగ్గిస్తుంది.

హృద్రోగులకు పెద్ద వరం. బ్రెస్ట్ కేన్సర్, ప్రేగుల కేన్సరులను నిరోధిస్తుంది. రాత్రి పడుకోబోయే ముందు ఒక గ్లాసు ఆవుపాలలో ఒక చెంచానెయ్యి వేసుకుని త్రాగితే అలసట తగ్గుతుంది. కొలెస్ట్రాల్ తగ్గుతుంది. ఆవుపాలలో మిరియాల పొడి వేసుకొని త్రాగితే కంటి సమస్యలు తగ్గుతాయి.

అంతేకాదు ఆవుపేడతో ట్యాబ్లెట్లు చేసి అమ్ముతారు. రోజు రెండు మాత్రలు వేసుకుంటే మంచి ఆరోగ్యం సిద్ధిస్తుంది. ఈ రకంగా ఆవువల్ల ఉపయోగాలు ఎన్నెన్నో ఉన్నాయి. అందుకే ఋగ్వేదం పదవ మండలంలోని పన్నెండవ సూక్తంలో

గోవులారా ! మీరు మా వద్దకు రండి. మాకు పాలిచ్చి మమ్మల్ని పోషించండి. గోవులు మా అధీనంలోనే ఉండాలి. మా దగ్గరే ఉండాలి. గోవులు మేత మేసి ఇంటికి తిరిగి రావాలి. గోవులను మేపేవారు, వెదికేవారు, ఇంటికి తెచ్చేవారు అంతా క్షేమంగా ఉండాలి. “ఓ ఇంద్రా! మా గోవులను మాకు తిరిగి ఇవ్వండి. ఓ గోపబాలా ! మా గోవులను మా దగ్గరకు తిరిగి తీసుకురా. నలువైపుల నుండి గోవులను తోలుకు రావలసింది’ అని ప్రార్థిస్తున్నారు.

ఆవుపేడ, పంచకము చాలా పవిత్రమైనవి. అవి యాంటీ బయాటిక్‌గా పని చేస్తాయి. ఇలా ఆవువల్ల అనేక ఉపయోగాలున్నాయి. అందుకే ఆవు చాలా పవిత్రమైనది. పూజింపదగినది.

## 27. అవసాన దశలో దేన్ని స్మరిస్తే దానియందే లయమవుతారు

అవసార దశలో ముందుగా కర్మేంద్రియాలు పని చెయ్యటం మానేస్తాయి. అవి పోయి జ్ఞానేంద్రియాలలో లీనమవుతాయి. తరువాత జ్ఞానేంద్రియాలు మనసులో లీనమవుతాయి. అంటే జ్ఞానేంద్రియాలు కూడా పని చెయ్యకుండా కేవలము మనసు మాత్రమే పని చేస్తుంది. ఆ సమయంలో అతడికి అన్నీ తెలుస్తాయి. ఏదో చెయ్యాలి. ఏదో చెప్పాలి అనుకుంటాడు. కాని అతని శరీరం సహకరించదు. మనసు మాత్రం పని చేస్తోంది. కళ్ళ వెంబడి నీళ్ళు కారుతుంటాయి. ఈ స్థితిలో అతడు దేన్ని స్మరిస్తే దాన్నే పొందుతాడు. మనసు ఎవరిపైన లగ్నమై ఉంటుందో, వారు దానియందే లయమవుతారు. మరుజన్మలో వారు దాన్నే పొందుతారు. ఈ జన్మలో డబ్బు డబ్బు అని వెంట పడి నీచంగా డబ్బులు సంపాదించే వారంతా గతజన్మలో మరణించే సమయంలో, అవసాన కాలంలో కేవలం డబ్బును మాత్రమే స్మరిస్తూ మరణించిన వారని గుర్తించండి. ఇలా జరుగుతుందనటానికి మన పురాణాలలో ఉదాహరణలు కూడా ఉన్నాయి. భాగవతంలో పురంజనుడను రాజు దీనికి చక్కని ఉదాహరణ.

పురంజనుడు హిమాలయ పర్వతాలలో ఒక నగరంలో ప్రవేశిస్తాడు. ఆ రాజ్యాన్ని ‘ప్రమదోత్తమ’ అనే స్త్రీ పరిపాలిస్తున్నది. పురంజనుడు ఆ స్త్రీని చూడటంతోనే ఆమెను

మోహిస్తాడు. ఆమె అంగీకారంతో ఆమెను వివాహం చేసుకుంటాడు. భార్య అంటే పిచ్చి ప్రేమ పురంజనుడికి. చివరి క్షణాల్లో కూడా భార్యనే తలచుకుంటూ ప్రాణాలు వదుల్తాడు. భార్యనే తలచుకుంటూ ప్రాణాలు వదిలాడు కాబట్టి మరుజన్మలో స్త్రీగా విదర్భ రాజకుమార్తెగా జన్మించి మలయకేతుడనే రాజును వివాహ మాడటం జరిగింది. అలాగే జడభరతుడు కూడా.

ఇతని అసలు పేరు భరతుడు. ఋషభుని కుమారుడు తండ్రి తరువాత ఇతడు రాజై చాలా సంవత్సరాలు 'అజనాభ' దేశాన్ని పాలించాడు. చాలా గొప్ప పండితుడు. వయసు మళ్ళిన తరువాత రాజ్యాన్ని కుమారుల కప్పగించి వానప్రస్థానికి వెళ్ళాడు. గంగానదీ తీరంలో ఆశ్రమం నిర్మించుకుని నివసిస్తున్నాడు. ఒకరోజున ఇతడు నదికి స్నానానికి వెళ్ళాడు. ఆ సమయంలో ఆకాశం మేఘావృతమైంది. పెద్ద పెద్ద ఉరుములు, మెరుపులు వస్తున్నాయి. గాలి వేగంగా వీస్తోంది. ఆ సమయంలో గర్భిణి అయిన ఒక లేడి నదీతీరానికి వచ్చింది. ఇంతలో భయంకరమైన శబ్దంతో పెద్ద ఉరుము ఉరిమింది. ఆ శబ్దానికి భయపడి ఒక బిడ్డను ప్రసవించి ఆ లేడి కాస్తా మరణించింది.

అప్పుడే పుట్టిన లేడిపిల్లను జాగ్రత్తగా చేతుల్లోకి తీసుకున్నాడు రాజైన భరతుడు. దానికి ప్రాణాపాయం కలగకుండా ఆశ్రమానికి తీసుకువెళ్ళి పెంచటం మొదలు పెట్టాడు. ఆ లేడిపిల్ల భరతుడికి బాగామాలిమి అయింది. ఎప్పుడూ భరతుడి వెంటే తిరుగుతుండేది. క్షణం కూడా వదిలేది కాదు. రాజుకూడా లేడిపిల్లని అత్యంత అనురాగంతో అలాగే చూసేవాడు. అవసాన కాలం సమీపించింది. భరతుడి దగ్గరే ఉంది లేడి. ఆ లేడి పిల్లనే తలచుకుంటూ ప్రాణాలు వదిలాడు భరతుడు. పర్యవసానంగా మరుజన్మలో లేడిగా జన్మించాడు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు అర్జునునితో

**అంతకాలేచ్చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్**
**యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥**

అర్జునా మరణ కాలంలో ఎవరు నా రూపాన్ని స్మరిస్తూ మరణిస్తారో, వారు నా స్వరూపాన్నే పొందుతారు. సందేహం లేదు.

**యం యం వాపి స్మరన్భావం త్యజత్యంతే కళేబరమ్ ।**
**తం తమే పైతి కౌంతేయ సదా తద్భావ భావితః ॥**

మరణ కాలంలో ఎవరు ఏ రూపాన్ని స్మరిస్తారో, వారు ఆ రూపాన్ని పొందుతారు.

కాబట్టి మరణ సమయంలో ఇతర ఆలోచనలు లేకుండా కేవలము భగవంతునిపైనే దృష్టి ఉంచగలిగిన వారు మోక్షం పొందుతారు.

## 28. అక్షింతలు - ఆశీర్వాదాలు

మన దేశంలో ఒక సంప్రదాయం ఉంది. పెద్దవారు కనిపిస్తే వంగి వారి పాదాలకు నమస్కరిస్తాం. వారి చెయ్యి మన నెత్తిన పెట్టి ఆశీర్వదిస్తారు. ఏవైనా శుభకార్యాలు జరిగినప్పుడు పెద్దలందరూ మన నెత్తిన అక్షతలు వేసి ఆశీర్వదిస్తారు. బియ్యంలో పసుపు కలిపి అక్షింతలు తయారుచేస్తారు. దీనికి నెయ్యి మాత్రమే వాడతారు. ఇక్కడ నెయ్యి అంటే ఆవునెయ్యి అని గుర్తుంచుకోవాలి. ఆశీర్వాదానికి ఎప్పుడు పసుపు అక్షింతలే వాడాలి. ఎరుపు అక్షింతలు శాక్తేయపూజలో మాత్రమే వాడతారు. అసలు ఆశీర్వదించేటప్పుడు నెత్తిన అక్షింతలు ఎందుకు వేస్తారు?

క్షతం కానివి అంటే నాశనం లేనివి అక్షింతలు. శ్రేష్టమైన బియ్యం. వడ్లను కొయ్యరోలులో పోసి దంచితే వచ్చిన బియ్యాన్నే వాడాలి అంటోంది వేదం. అయితే ఆ రోజుల్లో రోలు రోకలిని వాడేవారు. కాని ఇవాల్టి రోజున యంత్రాల ద్వారా బియ్యం తయారవుతాయి.

నవగ్రహాల్లో చంద్రుడికి చెప్పిన ధాన్యం - బియ్యం చంద్రుడికి దానం ఇవ్వాలంటే బియ్యమే ఇవ్వాలి. చంద్రుడు మనః కారకుడు. మానవుడి బుద్ధికి, గుణాలకి, వ్యసనాలకి కారణము చంద్రుడు అంటోంది జ్యోతిషశాస్త్రం. మనిషి మీద చంద్రుడి ప్రభావం ఎక్కువగా ఉంటుంది. చంద్రుడికి సంకేతమైన బియ్యం కూడా మనిసి మనస్సు మీద ప్రభావం చూపుతుంది. మనస్సును నియంత్రిస్తుంది. అందుకే అక్షతలను మీద వేస్తారు.

శాస్త్రప్రకారం చూసినప్పటికీ బియ్యం విద్యుత్ శక్తిని గ్రహిస్తాయి. మానవదేహం విద్యుత్కేంద్రం. విద్యుత్ సరఫరాలో హెచ్చుతగ్గులు సర్వసామాన్యం. ఇవి మానవుడి మనసుమీద, ఆరోగ్యం మీద ప్రభావం చూపుతాయి.

పెద్దవాళ్ళు మన శిరస్సు మీద అక్షింతలు వేసి ఆశీర్వదించే సమయంలో వారి దేహంలోని కొంత విద్యుత్తు ఈ అక్షింతలను తాకుతుంది. దాంతో ఆశీర్వాదం ఇచ్చేవారి నుండి పుచ్చుకునే వారికి ఈ విద్యుత్తు సరఫరా అవుతుంది. మానవదేహంలో 24 విద్యుత్ కేంద్రాలున్నాయి. వాటిలో ప్రధానమైనది శిరస్సు. ఇది విద్యుదుత్పతి కేంద్రమే కాకుండా విద్యుత్ప్రసారకేంద్రం కూడా, తలమీద అక్షింతలు వేయటం వల్ల వాటిలోని విద్యుత్తును గ్రహించి శరీరంలోని మిగిలిన భాగాలకు అందిస్తుంది శిరస్సు. ఈ రకంగా పెద్దలలో ఉండే సాత్వికగుణాలు అక్షింతల ద్వారా పిల్లలకి చేరతాయి.

అయితే అక్షింతలకి పసుపు ఎందుకు కలపాలి? అంటే పసుపు క్రిమిసంహారి. ఒకవేళ ఆశీర్వదించే వారికి చర్మరోగాల వంటి ఏవైనా ఉంటే, ఆశీస్సులు తీసుకునే వారికి అవి రాకుండా చేస్తుంది.

ఇక ఆధ్యాత్మికపరంగా చూస్తే అన్నం నుంచే జీవులు ఆవిర్భవిస్తున్నాయి అంటోంది వేదం. అంటే జీవుడికి సంకేతం–బియ్యం. అటువంటి బియ్యాన్ని భగవంతుడి మీద వేసిన నమస్కరించటము అంటే జీవాత్మని పరమాత్మ దగ్గరకు చేరుస్తున్నామని అర్థం.

పెద్దల దగ్గర ఆశీర్వాదం తీసుకునేటప్పుడు వారి పాదాలకు నమస్కరిస్తాం. ఇది సంప్రదాయం. మనిషి శరీరంలో రెండు ధృవాలుంటాయి. రెండు చివరలు 1. శిరస్సు 2. పాదాలు

శిరస్సు ఉత్తరధృవం అయితే పాదాలు దక్షిణ ధృవం వ్యతిరేక ధృవాలు ఆకర్షించుకుంటాయి. అప్పుడు శక్తి విడుదల అవుతుంది. అందుకే పెద్దల దగ్గర ఆశీర్వాదం పొందేటప్పుడు మన తలను వారి పాదాలకు తాకిస్తాం. శిరస్సు అనే ఉత్తర ధృవం పాదాలు అనే దృక్షిణ ధృవాన్ని తాకుతుంది. అప్పుడు శక్తి విడుదల అవుతుంది. పెద్దల శక్తి మనలోకి ప్రసరిస్తుందన్న మాట. అందుకే పీఠాధిపతులు వారి పాదాలను తాకనివ్వరు.

# 29. దేవాలయ సందర్శనలో జాగ్రత్తలు

మొన్నటి రోజున ఒక మిత్రుడు కలిశాడు. చాలాకాలం తరువాత కలిశాం. అందుకని చిన్నప్పటి విషయాలన్నీ మాట్లాడుకున్నాం. భోజనాలయి విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో "మిత్రమా ! మనిద్దరం కలిసి ఆడుకున్నాం. చదువుకున్నాం. నేనేమో లౌకిక వృత్తిలో పడిపోయాను. నువ్వు పారలౌకికంగా ప్రయాణిస్తున్నావు. చాలామందికి గురువు అయినావు కూడా. ఈ విషయం నేను చాలా చోట్ల విన్నాను. ఎంతైనా చిన్ననాటి మిత్రుడివి కదా. అందుకని నిన్ను గురువుగారు అనలేను. నా అహం అడ్డు వస్తుంది. కాని ఈ విషయంలో నువు చాలా పెద్దవాడివి. నాకు ఒక చిన్న సందేహం ఉంది. తీరుస్తావా?" అన్నాడు 'తప్పకుండా తీరుస్తాను నాకు తెలిస్తే. విషయం ఏమిటో చెప్పు' అన్నాను.

'విషయం చాలా చిన్నది' మనలో చాలా మంది ప్రతిరోజు దేవాలయానికి వెడతారు. కొంతమంది వారానికి ఒకసారి వెడతారు. ఇదంతా వారి వీలును బట్టి ఉంటుంది. దేవాలయానికి వెళ్ళినప్పుడు మనం అనుసరించవలసిన పద్ధతులు ఏవైనా ఉన్నాయా?' అని అడిగాడు.

ఆ మాటలు వినగానే 'ఇది పదిమందికీ సంబంధించిన విషయం. కాబట్టి తప్పకుండా చెబుతాను. అంటూ ప్రారంభించాను.

ముందుగా అసలు దేవాలయము అంటే ఏమిటో చూద్దాం. ఆలయము అంటే నివాస స్థానము. దేవాలయము అంటే – దేవుని నివాసస్థానము. భగవంతుడు ఉండేచోటు. అక్కడ ఉండేది భగవంతుడు కాబట్టి అది పవిత్ర ప్రదేశం. భక్తుల కోరికలు తీర్చటానికి భగవంతుడు కొలువై ఉన్నచోటు. పరమ పవిత్రమైనది. కాబట్టి అలాంటి చోటికి వెళ్ళేటప్పుడు తప్పనిసరిగా కొన్ని ధర్మాలు పాటించి తీరాలి. అలా పాటిస్తేనే దైవానుగ్రహం కలుగుతుంది.

గుడికి వెళ్ళాలి అంటే ఏదో షాపింగ్‌కు వెళ్ళినట్లుగా కాకుండా శుచిగా వెళ్ళాలి. అంటే స్నానం చేసి ముఖాన విభూతి, కుంకుమ పెట్టుకుని సంప్రదాయ వస్త్రాలలోనే దేవాలయానికి వెళ్ళాలి. ఆడపిల్లలు జీన్సు ప్యాంట్లు, టీ షర్టులు, అలాగే మోకాళ్ళ పైకి ఉండే బట్టలు వేసుకోరాదు. మగవారు పొట్టిలాగూలు ధరించి ఆలయానికి

వెళ్ళరాదు. ఆలయానికి వెళ్ళే వారి వేషధారణ పవిత్రంగా ఉండాలి. ఇంటిదగ్గర బొట్టు పెట్టుకోవటానికి అవకాశం లేకపోతే ఆలయంలో విభూతి, కుంకుమ తప్పని సరిగా ధరించాలి.

ఆలయంలో పూజ చేయించాలి అనుకుంటే పూజాసామాగ్రిని తీసుకువెళ్ళాలి. పెద్దవారి దగ్గరకు, పిల్లల దగ్గరకు ఒట్టి చేతులతో వెళ్ళరాదు. పత్రం పుష్పం ఫలంతోయం ఏదో ఒకటి భగవంతుడికి సమర్పించండి. ఇంటిదగ్గర స్నానం చేసినా సరే ఆలయానికి వెళ్ళగానే కాళ్ళు కడుక్కోవాలి. ఆలయంలో ప్రవేశించటానికి ముందుగా ఆలయ గోపురానికి నమస్కరించాలి. ఆ తరువాత మెట్లకు నమస్కరించాలి. గతజన్మలలో అవి చాలా పుణ్యం చేసుకుని ఉంటాయి. అందుకే నిరంతరము భగవంతుని సన్నిధిలో ఉన్నాయి. ఆలయంలో ప్రవేశించినప్పటి నుంచి భగవన్నామ స్మరణే చెయ్యాలి. అంతేకాని పోచికోలు కబుర్లు చెప్పరాదు. మనస్సంతా భగవంతుని మీదనే లగ్నం కావాలి. చిత్తం శివుడి మీద, భక్తి చెప్పుల మీద అన్నట్లుగా ఉండరాదు. భగవన్నామాన్ని స్మరిస్తూనే ఆలయం చుట్టూ మూడు ప్రదక్షిణలు చెయ్యాలి. 11,108 ఇలా చెయ్యరాదు. ఇక భగవంతుడి దర్శనం కోసం స్వామికి కుడివైపు పురుషులు, ఎడమవైపు స్త్రీలు వరుసగా నిల్చోవాలి.

దర్శనం చేసుకునేటప్పుడు మొదటగా స్వామి వారి పాదాలు దర్శించి, క్రమేణా చూపుపై వైపుకు మళ్ళించి ముఖము, శిరస్సు దర్శించాలి. స్వామికి అర్చన చేయించాలంటే ఆలయ గుమాస్తా దగ్గర టిక్కెట్టు తీసుకోవాలి. అందులో పూర్తి పేరు, గోత్రము వ్రాయించాలి. గోత్రనామాలు చెప్పేటప్పుడు ఇంటి యజమాని పేరు చెబితే సరిపోతుంది. 'సకుటుంబస్య' అంటే ఇంటిల్లిపాదీ అందులోకి వచ్చేస్తారు. అంతేకాని ఇంట్లో ప్రతివారి పేరు, కుక్కపిల్లతో సహా అందరి పేర్లు చెప్పాల్సిన అవసరం లేదు. పూజ అయిన తరువాత తీర్థం తీసుకోవాలి. అప్పుడు అరచేయిని దొన్నెలాగా పట్టాలి. తీర్థం స్వీకరించిన తరువాత చాలామంది ఆ చేతిని తలకు రాచుకుంటారు. అలా చెయ్యరాదు.

దర్శనము, పూజ అయిపోగానే వచ్చిన పని అయిపోయింది' అని పరుగు పెట్టకూడదు. ఆలయంలో కాసేపు కూర్చోవాలి. ప్రశాంత చిత్తంతో భగవన్నామాన్ని జపించాలి. అంతేకాని కబుర్లు చెప్పుకోరాదు. భక్తులందరికీ ప్రసాదం పంచిన

తరువాతనే మనం స్వీకరించాలి. అంతేకాని ముందుగా మనం ప్రసాదం తీసుకుని, తరువాత ఇతరులకు పంచరాదు. తిరిగి బయల్దేరే ముందు భగవంతుడికి దూరం నుంచే నమస్కారం చేసి బయల్దేరాలి. బయటకు వచ్చాక మళ్ళీ గోపురానికి నమస్కరించి బయల్దేరాలి.

ఇక ప్రదక్షిణలు చేసేటప్పుడు ప్రశాంత చిత్తంతో మామూలుగా, సావధానంగా నడవాలి. అంతేకాని పరుగులు పెట్టరాదు. ఆలయంలో ఉన్నంతసేపు భగవంతుణ్ణి గురించే మాట్లాడాలి. అనవసర విషయాలు మాట్లాడరాదు. కోపం వచ్చినా పరుష పదజాలం వాడరాదు. దేవాలయం పరమపవిత్రమైనది. మనం కూడా అక్కడ పవిత్రంగానే ఉండాలి. ఆవలించటం కాని, జుట్టు పీక్కోవటం గాని చెయ్యరాదు. తమలపాకులు, వక్కపొడి, కిళ్ళీలు, గుట్కా ఇత్యాదులు ఆలయ ప్రాంగణంలో వాడరాదు. కొన్నిచోట్ల ఆలయ ప్రాంతంలో రాత్రులు బసచేసి మద్యం సేవిస్తున్నారు. అది పూర్తిగా నిషేధం. దర్శనానికి వచ్చినప్పుడు తలకు టోపీలు, తలపాగాలు పెట్టుకోరాదు. ఎట్టి పరిస్థితులలోను ధ్వజస్తంభము, బలిపీఠాలను త్రొక్కరాదు. ఆలయానికి వచ్చేటప్పుడు ధగధగ మెరిసే దుస్తులు వాడరాదు. స్వామిని దర్శించిన తరువాత వెంటనే వెనక్కి తిరిగి స్వామికి వీపు చూపరాదు. వెనక్కి నాలుగు అడుగులు వేసి, ఆ తరువాత వెనుదిరగాలి. స్వామికి ఒంటిచేత్తో నమస్కరించకూడదు. రెండు చేతులతోను భక్తి ప్రపత్తులతో నమస్కరించాలి. దర్శనానికి వెళ్ళేటప్పుడు భుజంమీద కండువా ఉండటం సంప్రదాయం. ఎవరూ చూడటం లేదు కదా అని దేవుడి సొమ్ము అపహరించరాదు. నిషిద్ధమైన రోజుల యందు బిల్వదళాలు కొయ్యరాదు. అష్టమి, నవమి, అమావాస్య, పౌర్ణమి, పాడ్యమి, సోమవారం ఇవి నిషిద్ధ దినాలు. దర్శనం చేసుకోవటానికి వెళ్ళినప్పుడు మూలవిరాట్ దగ్గర దీపం తప్పనిసరిగా ఉండాలి. ఒకవేళ లేకపోతే దీపారాధన చేసిన తరువాతే భగవద్దర్శనం చెయ్యాలి. ఆలయంలోకి వెళ్ళేటప్పుడు కాళ్ళు కడుక్కుంటాం. కాని ఆలయంలోంచి బయటకు రాగానే కాళ్ళు కడుక్కోరాదు. నవగ్రహాల దగ్గరకి వెడితే కాళ్ళు కడుక్కోవాలి.

కొన్ని ఆలయాలలో మర్రి, రావిచెట్లు పెంచుతారు. సాయంత్రం ఆరు గం॥ తరువాత ఆ చెట్లకు ప్రదక్షిణలు చెయ్యరాదు. వాటి క్రింద కూచోరాదు. ఆలయంలో పెద్దగా శబ్దం చెయ్యరాదు. గట్టిగా మాట్లాడరాదు. మనం చేసే ఏ పనీ ఇతరులకు

ఇబ్బంది కలిగించకూడదు. సామాన్యంగా ప్రదక్షిణాలు చేసేటప్పుడు ఆలయం వెనుక భాగాన్ని తాకుతాం, ఆలయం వెనుక భాగం అసుర భాగం అంటారు. కాబట్టి దీన్ని తాకరాదు. దేవాలయంలో గంటను ఆడవారు మ్రోగించరాదు. హారతిని ముందు కళ్ళకు అద్దుకుని తరువాత బ్రహ్మరంధ్రానికి అద్దుకోవాలి. ఇలా మూడుసార్లు చెయ్యాలి. గర్భాలయంలోకి అర్చకులు తప్ప మనం పోరాదు. వి.ఐ.పి.లను గర్భాలయంలోకి తీసుకుపోతున్నారు. అది నిషేధం. తీర్థం పరమ పవిత్రంగా స్వీకరించాలి. బుర్రుమని చప్పుడు చేస్తూ త్రాగరాదు.

ఈ రకంగా దేవాలయం సందర్శించేటప్పుడు చెయ్యాలని పెద్దవాళ్ళు చెబుతారు. ఇది ఒక సంప్రదాయం, దీంట్లో సమాజ శ్రేయస్సుకు ఉపయోగించే కట్టుబాట్లు కూడా ఉన్నాయి. ఏది ఏమైనా దేవాలయం పవిత్రమైన ప్రదేశం. అక్కడికి వెళ్ళిన వారు పవిత్రంగా ఉండాలి. పవిత్రమైన పనులే ఆచరించాలి.

## ౩౦. యధార్థం

జీవితంలో కొన్ని నగ్న సత్యాలుంటాయి. నిజం ఎప్పుడూ చేదుగానే ఉంటుంది. అది ఎవరికీ రుచించదు. ఒక వ్యక్తి మన దగ్గరకొచ్చి 'నేను ఇంకా ఎంతకాలం బ్రతుకుతాను?' అని అడిగాడు. అతడు ఇంకొద్దిసేపట్లోనే మరణిస్తాడనే సత్యం మనకి తెలుసు. ఆ మాట చెబితే అతడు నమ్మడు. మనం చెప్పేది అబద్ధం అంటాడు. మరణ సమయం ఆసన్నమైనా సరే ఏమందైనా పని చేస్తుందేమో? ఏ వైద్యుడన్నా రక్షించకపోతాడా? ఏ దేవుడన్నా కరుణించక పోతాడా? అని ఎదురు చూస్తాడు కాని భగవంతుణ్ణి మాత్రం స్మరించడు. అందుకే నిజం చెబితే నమ్మరు. కాని ఎవరు నమ్మినా నమ్మకపోయినా యధార్థం యధార్థమే. ఇందులో సందేహం లేదు. నువ్వు నమ్మలేదు కాబట్టి అది అబద్ధం అయిపోదు.

మానవుడు ఎంత గొప్పవాడైనా, ఈ ప్రపంచాన్నే శాసించగలవాడైనా, అతిబలవంతుడైనా, అతి ధనవంతుడైనా అవయవ క్షీణం, ఆయుక్షీణం. ఈ రెండింటినీ తప్పించుకోలేడు. ఒక్క విషయం గుర్తుంచుకోవాలి. జగత్సృష్టి జరిగి కొన్నివేల కోట్ల సం॥లు అయింది. ఈ సృష్టిలో మనమే మొదలు కాదు. మనమే ఆఖరు కాదు. మనం ఈ లోకంలో కొద్దికాలం ఉండటానికి వచ్చాం. అదికూడా

ఈ దేహంలో అద్దెకు ఉంటున్నాం. ఇల్లు ఖాళీ చేసేటప్పుడు మన సామానంతా మనమే తీసుకువెడతాం. అలాగే దేహాన్ని విడిచి వెళ్ళేటప్పుడు మన సుకృతము, దుష్కృతము మనతోపాటుగా తీసుకుపోవాలి. తప్పదు. ఎందుకంటే ఆ కర్మఫలం మనమే అనుభవించాలి. ఈ లోకంలో మనమేమీ శాశ్వతం కాదు. చిరంజీవులం అంతకన్నా కాదు. చెట్టుకి, పుట్టకి, రాయికి, రప్పకి ఉన్న ఆయువు కూడా మనకి లేదు. మనది చాలా తక్కువ ఆయుష్షు. ఈ భూమి మీద కాలచక్రం రైలుబండిలా తిరుగుతోంది. అందులో ఎక్కడో ఒకచోట ఎక్కి ఇంకోచోట దిగిపోతాం. జీవిత చక్రంలో మనం కేవలము ప్రయాణికులం, బాటసారులం మాత్రమే.

లోకంలో బంధాలు, అనుబంధాలు, స్నేహం శత్రుత్వం అన్నీ మాయ. అంతా భ్రమ. మూసిన కన్ను తెరవకపోయినా, తెరిచిన కన్ను మూయకపోయినా జీవితం ముగిసినట్లే. శ్వాస తీసుకుని వదలకపోయినా, వదిలిన తరువాత మళ్ళీ శ్వాస తీసుకోకపోయినా మనం మరణించినట్లే. అదే ఆఖరిచూపు. కాలం చాలా గొప్పది. దేన్నైనా మరిచిపోయేటట్లు చేస్తుంది. మనం ఎవరైనా సరే ఈ ప్రపంచం మనల్ని మరచిపోతుంది. కాలగమనంలో నీ ఆత్మీయులను కూడా నువ్వు మరిచిపోతావు. ఇక్కడ విచిత్రం ఏమంటే విరోధులు స్నేహితులైనా, పశ్చాత్తాపపడినా, మనసు మార్చుకున్నా ఇంక కనిపించం. ఈ శరీరాన్ని ఎంత సుకుమారంగా పెంచినా, పోషించినా ఒకటే. రోజూ పాలతో స్నానం చేసినా, వెన్న వంటికి రాచినా, ఎండ కన్ను తెలియకపోయినా, సుకుమారుడైనా, కర్కశుడైనా, సాత్విక స్వభావి అయినా, తాను సగుణ సంపన్నుడైనా చివరికి చేరేది స్మశానంలోని చితిమంటలలోకే. ఎంతటి వాడినైనా నిప్పుల కొలిమిలో కాల్చక తప్పదు. లేదా గోతిలో పాతిపెట్టక తప్పదు.

**ధనం చ భూమౌ పశవశ్చగోష్ఠి కాన్తా గృహద్వారజనః స్మశానే ।**
**దేహశ్చితాయాం పరలోకమార్గే ఏకానుగతో గచ్ఛతి జీవ ఏకః ॥**

తాను సంపాదించినదంతా ఇక్కడే ఉంటుంది. ఏనుగులు, గుర్రాలు, పశువులు గొడ్డదొడ్లో ఉండిపోతాయి. ప్రాణ సమానమైన భార్య వాకిట్లో నిలబడి చూస్తుంటుంది. బిడ్డలు, బంధువులు, సోదరులు, మిత్రులు అందరూ స్మశానం దాకా వస్తారు. సుకుమారమైన ఈ దేహాన్ని నిప్పుల మీద పెట్టి కాలుస్తారు. పరలోకయాత్రకు జీవి ఒంటరిగా ప్రయాణం అవుతాడు.

ఈ పరిస్థితి అందరికీ వస్తుంది. కాని మాయామోహితుడైన మానవుడు ఈ విషయాన్ని గ్రహించలేకపోతున్నాడు. ఇక్కడే ఒక మంచి ఉదాహరణ చూడండి. 84 సం॥ వయసు, 70 సం॥ రాజకీయ జీవితం. 50 సం॥ పార్టీ అధ్యక్షుడు, నాలుగుసార్లు ముఖ్యమంత్రి. దక్షిణ భారతంలో అతిపెద్ద రాజకీయ నాయకుడు. ఏం లాభం. మరణించిన తరువాత ఆరడుగుల స్థలం కోసం కోర్టును ఆశ్రయించాల్సి వచ్చింది కరుణానిధికి. నువ్వు ఎంత కాలం జీవిస్తావో తెలియదు. అందుకే ఈ క్షణం మాత్రమే నీది. మరుక్షణం ఏమవుతుందో ఎవరికి తెలుసు? నువ్వు ఎంత శక్తి సంపన్నుడివైనా సరే. ప్రపంచం మొత్తాన్ని భస్మం చేయగల ఆయుధాలు నీ దగ్గర ఉన్నా సరే. నీ ఊపిరి ఎప్పుడు ఆగుతుందో భగవంతుడికి తప్ప అన్యులకి తెలియదు. జరుగుతున్న కాలంలో ఈ క్షణం మాత్రమే మనది. నువ్వు ఔనన్నా కాదన్నా ఇవన్నీ పచ్చినిజాలు. ఎవరైనా ఇష్టం ఉన్నా లేకపోయినా వీటిని అంగీకరించి తీరాల్సిందే. ఎందుకంటే చివరకు జరిగేది ఇదే, ఇదే యధార్థం.

అందుకే జీవించినంత కాలం మనిషిగా జీవిద్దాం. మానవులు ఎలా జీవించాలో చెప్పాయి మనకు రామాయణ భారతాలు. అందులోని విషయాలను తెలుసుకుని పదిమందికి ఆదర్శమవుదాం. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకుందాం. అంటే డబ్బులు పోగేసుకుందామని కాదు. శరీరంలో ఓపిక ఉండగానే సద్గురువును వెతుక్కుందాం. గత జన్మలలో చేసిన సుకృతం వల్ల ఈ జన్మలో మానవుడిగా జన్మించాం. మానవుడిగా జన్మించినందుకు ఈ జన్మని సార్థకం చేసుకుందాం. దీనికి చేయవలసినది సద్గురువును ఆశ్రయించటం. కర్మ పరిపక్వత చెందిన వారిని గురువే వెతుక్కుంటూ వస్తాడు. కాని మనబోటి వాళ్ళని గురువు వెతుక్కుంటూ రాడు. జీవితంలో ఎంతో మంది గురువులుంటారు. చిన్నప్పుడు తల్లే మొదటి గురువు. రామకృష్ణ పరమహంస తనకు ఐదుగురు గురువులున్నారు అంటారు. దత్తాత్రేయుడు యదుమహారాజుతో తనకు 25 మంది గురువులున్నారు అంటాడు. ఒక్కొక్క గురువు దగ్గర ఒక్కొక్క విషయాన్ని నేర్చుకుంటాం. చివరకి సద్గురువు లభిస్తాడు. అతడు ముక్తిమార్గాన్ని చూపుతాడు.

చాలామంది అనుకుంటారు. మేం పండిపోయాం. ఇంక మాకు మరుజన్మ లేదు అని. మంచిదే. అలాగే కానివ్వండి. పండిపోయిన వారిని గురించి కాదు మనం మాట్లాడేది. నాబోటి అజ్ఞానుల గురించి.

కాబట్టి జీవితంలో తారసపడ్డ ప్రతివారి దగ్గరా క్రొత్త విషయం తెలుస్తుంది. అలా విషయ సేకరణ చేద్దాం. మనబోటి వారితో సత్సంగం చేద్దాం. సత్సంగం వల్ల విషయం గట్టి పడుతుంది. అలా పోగా పోగా ఎప్పటికో సద్గురువు లభిస్తాడు. మోక్షమార్గాన్ని చూపుతాడు. అప్పటివరకు మనం ఈ సాధన కొనసాగించాల్సిందే. సద్గురువు కోసం ఎదురు చూడాల్సిందే ఇదే యథార్థం.

## 31. విస్తరి

పూర్వకాలంలో భోజనం చెయ్యటానికి కంచాలు, ప్లేట్లు వాడే వారు కాదు. విస్తళ్ళే వాడేవారు. కొన్ని చెట్లకు పెద్ద పెద్ద ఆకులుంటాయి. ఉదాహరణకు అరటి ఆకు. సామాన్యంగా ప్రతి ఇంట్లోను అరటి చెట్లుండేవి. భోజనం చెయ్యటానికి పది నిమిషాలు ముందుగా అరటి ఆకులు కోసి, కడిగి వాటిని భోజనానికి ఉపయోగించే వారు.అరటి ఆకులో భోజనం ఆరోగ్యకరము అని గతంలో మనం చెప్పుకున్నాం కూడా. ఒకవేళ అరటి ఆకులు లేకపోతే వెడల్పాటి ఆకులు గల చెట్ల నుంచి ఆకులు సేకరించేవారు. వీటిలో ప్రసిద్ధమైనవి మోదుగ, టేకు, బాదం ఈ చెట్ల ఆకులు వెడల్పుగా ఉంటాయి. ఐదు లేదా ఏడు ఆకులతో విస్తరి కుట్టేవారు. విస్తరి కుట్టటానికి దర్భ పుల్లగాని, చీపురు పుల్లలు గాని వాడేవారు. ఏది ఏమైనప్పటికి ఆచారవంతులైన వారు ఇలాంటి ఆకులలోనే భోజనం చేసేవారు. వీటినే విస్తళ్ళు అంటారు. ఇవాల్టి రోజున వీటికి ప్రత్యామ్నాయంగా రంగు కాగితాలతో చేసిన ఆకులు వాడుతున్నారు. వివాహాది శుభకార్యాలలో వాడేవి ఇవే. వీటిలో వెండి, బంగారు రంగులో ఉన్న విస్తళ్ళు కూడా బయట దొరుకుతున్నాయి.

ఇక్కడ విశేషం ఏమంటే భోజనం చేసేవరకు విస్తరి చాలా పవిత్రం. భోజనం తరువాత ఎంగిలాకు చాలా నీచం. ముందుగా విస్తరి తెచ్చి, శుభ్రంగా కడిగి అందులో పరమ పవిత్రంగా భోజనం వడ్డిస్తారు. మానవ జీవితానికి విస్తరికి చాలా దగ్గర సంబంధం ఉంది. భోజనం పూర్తయ్యేదాకా విస్తరికి మట్టి అంటనీయం. తిన్న తరువాత ఆకును మడిచి, దూరంగా పడేస్తాము. మానవుడి జీవితం కూడా అంతే. ఊపిరి ఉన్నంత వరకు మనిషికి చాలా విలువ ఉంటుంది. ఊపిరి ఆగిపోయింది అని తెలిసిన మరుక్షణం నుంచీ ఈ శరీరం శవంగా మారిపోతుంది. దాన్ని ఎవరూ

తాకరు. శవాన్ని తాకితే స్నానం చెయ్యాలి. అలాగే ఎంగిలి విస్తరి తగిలితే స్నానం చెయ్యాలి. భోజనానంతరము విస్తరిని బయటపడేస్తే అది చాలా ఆనందిస్తుంది. పోయే ముందు ఒకరి ఆకలి తీర్చాను అని సంతోషిస్తుంది. కాని మనిషికి ఆ అదృష్టం లేదు. జీవించి ఉన్నంత వరకు ఎంతమందికి మేలు చేశాడో, ఎంత మందికి హాని చేశాడో తెలియదు. పోయిన తరువాత అతడు చేసిన మంచి చెడు పనులు జనులు తలచుకుంటూ ఉంటారు. అతడు మంచి చేసినా, చెడు చేసినా జనులు పది కాలాలపాటు తలస్తూనే ఉంటారు. పితృ వాక్యపాలన చేసిన రాముణ్ణి ఎంతకాలం జనం తలచుకుంటారో, అంత కాలం సీతమ్మను ఎత్తుకు వెళ్ళిన రావణుణ్ణి కూడా తలచుకుంటారు. కాకపోతే రాముడికి గుడి కట్టిస్తారు. దేవుడు అంటారు. ప్రతిరోజు నమస్కారం చేస్తారు. అదే రావణాసురుణ్ణి దుర్మార్గుడు అని తిడతారు.

కాబట్టి క్షణభంగురమైనది ఈ జీవితం. జీవించి నన్నాళ్ళు సుఖశాంతులతో జీవించండి. పది మందికి ఉపకారం చేసి మంచివాడనిపించుకోండి. అంతేకాని దుర్మార్గుడు అనిపించుకుంటే ఉపయోగం ఏముంది?

## 32. మనస్సు

**'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః'** బంధ మోక్షాలన్నింటికి కారణం మనస్సే అంటున్నాయి ఉపనిషత్తులు. మానవ శరీరంలో జ్ఞానేంద్రియాలు–5, కర్మేంద్రియాలు–5 ఉన్నాయి. ఇవి కాకుండా ఇతర జీవులకు లేనిది ఒక్క మానవుడికి మాత్రమే ఉన్నది మనస్సు. మన యొక్క సంకల్ప వికల్పాలకు కారణం మనస్సు. ఏ పని చేయాలి? ఏది చేయకూడదు అనే విషయాలను ఆలోచించగలిగింది మనస్సు. మంచి చెడు అనే విచక్షణాజ్ఞానం కలిగింది మనస్సు. అటువంటి మనసు శరీరంలో ఎక్కడ ఉంటుంది? కన్ను ముక్కు చెవి నాలుక చర్మము ఇవి జ్ఞానేంద్రియాలు. ఇవి ఎక్కడ ఉంటాయో, వీటి స్థానం ఏదో మనకి తెలుసు. కాలు చెయ్యి నోరు పాయు ఉపస్థలు కర్మేంద్రియాలు. ఇవి ఎక్కడ ఉంటాయో మనకి తెలుసు. కాని మనసు ఎక్కడ ఉంటుందో మాత్రం తెలియదు. దీనికి ప్రత్యేకమైన స్థానం లేదు. కన్ను ఎక్కడ ఉన్నది అంటే చూపగలం కాని మనస్సు ఎక్కడ ఉన్నది అంటే మాత్రం చూపలేం. దీనికి ప్రత్యేకమైన స్థానం లేకపోవటమే కారణం.

అయితే మనస్సు ఎక్కడా ఉండదా? ఉండకపోతే ఎలా పని చేస్తుంది? అనే అనుమానం వస్తుంది? ఏ అవయవంతో మనం పని చేస్తుంటే మనసు ఆ అవయవంలో ఉంటుంది. ఉదాహరణకు కంటితో ఒక దృశ్యాన్ని చూస్తున్నాం. అప్పుడు మనసు కంటిలో, కంటి దృష్టిలో కేంద్రీకృతమై ఉంటుది. అందుకే మనం మనసు పెట్టి చూడు, మనసు పెట్టి విను. మనసు పెట్టి పని చెయ్యి, మనసు పెట్టి విను అంటాం. సాధారణ భాషలో చెప్పాలంటే 'దృష్టిని ఆ విషయం మీద కేంద్రీకృతం చెయ్యి' అని అర్థం. నిద్రించే సమయంలో మనసు విశ్రాంతి తీసుకుంటుంది అనుకుంటారు. మనసుకు విశ్రాంతి చాలా తక్కువ. మనిషి ఖాళీగా కూర్చున్నా అతడి మనసులో అనేక భావాలు సినిమా రీలులాగా తిరుగుతూనే ఉంటాయి. అనేకానేకమైన ఆలోచనలు చేస్తుంటాడు. మానవుడు ఎప్పుడూ ఏదో ఒక విషయాన్ని ఆలోచిస్తూనే ఉంటాడు. గతంలో జరిగినవి, వర్తమానంలో జరుగుతున్నవి, భవిష్యత్తులో జరగబోయేవి, ఇలా జరిగితే బాగుండు అనే ఊహలు. ఊహాలోకాల్లో తేలిపోతుంటాడు. ఈ ఆలోచనలతో ఆనందం కలుగుతుంది. యుగాలు క్షణాల్లా గడిచిపోతాయి. ఒక్కోసారి బాధలు బరువులు గుర్తొస్తాయి. వాటిని గురించి ఆలోచించినప్పుడు బాధ కలుగుతుంది. విపరీతంగా దుఃఖిస్తాడు. కొన్నిసార్లు భయం వేస్తుంది. భయపడతాడు. తట్టుకోలేక ఏడుస్తాడు. ఇతరుల సాయం కోసం ఎదురు చూస్తాడు. కాని ఎవరూ సాయం చెయ్యటానికి రారు. దాంతో విపరీతమైన డిప్రషన్‌లోకి వెళ్ళిపోతాడు. అతడి మానసిక స్థితి దెబ్బ తింటుంది. ఇష్టమైన వాళ్ళు దూరమైనప్పుడు, వారి ఎడబాటు భరించటం సాధ్యంకాదు. మనస్సు ఆ బాధని తట్టుకోలేదు. అన్నం తినబుద్ధి కాదు. నీరు త్రాగబుద్ది కాదు. మంచాన పడతాడు. ఎప్పుడూ వారినే పలవరిస్తూ ఉంటాడు. బి.పి., షుగరు వంటి వ్యాధులు వస్తాయి. లేచి తిరుగలేడు. నుంచో లేడు, కూర్చోలేడు. చిక్కి శల్యమై పోతాడు. దీన్నే మనోవ్యాధి. దీనికి మందులేదు అంటారు.

కొన్ని సందర్భాలలో మనోవికాసముండదు. వయసు పెరుగుతుంది. బుద్ధి పెరుగుతుంది. కాని మనస్సు పెరగదు. ఎక్కడ ఎప్పుడు ఎలా స్పందించాలో వీరికి తెలియదు. వీరినే అమాయకులు అంటారు.

ఇంకొక రకం వారిలో అసలు మనస్సు పనిచెయ్యదు. లోకంలో మనసు పని చెయ్యనివారు ముగ్గురున్నారు.

**1.పసిపిల్లలు :** వీరికి ఏమీ తెలియదు. ఆకలేస్తే ఏడుస్తారు. బాధ కలిగితే ఏడుస్తారు. ఇది కావాలి అని చెప్పలేరు. వారికి మాటలు రావు. విషయం తెలియదు. పాలు పడితే పడుకుని నిద్ర పోతారు.

**2. మహాయోగులు :** ధ్యానం తరువాత స్థితి సమాధి. ఈ సమాధి రెండు రకాలు 1.సవికల్ప సమాధి 2.నిర్వికల్ప సమాధి

**1. సవికల్ప సమాధి :** ఇందులో మనసు పనిచేస్తుంది. తపస్సులో కూచోబోయే సమయంలోనే, భగవంతుడు ప్రత్యక్షమైతే ఆయనను ఏ రకంగా స్తుతి చెయ్యాలి? ఏ వరం అడగాలి అనేవి ముందుగానే నిర్ణయించుకుని అలాగే చేస్తాడు. ఈ స్థితిలో అతని మనసు పనిచేస్తుంది. రాక్షసులు చేసిన తపస్సు చాలా వరకు ఇలాంటిదే. దీన్నే **'సుమన'** అంటారు.

**2. నిర్వికల్ప సమాధి :** ఈ స్థితో మనసు కూడా పని చెయ్యదు. అందుకే ఈ స్థితి ఉన్మన అంటే మనసు కూడా పని చేయనటువంటి స్థితి అన్న మాట.

**3. పిచ్చివాళ్ళు :** వీళ్ళు మానసిక రోగులు. శరీరంతో పాటుగా వీరికి మనసు బుద్ధి ఎదగవు. దేన్నీ ఆలోచించలేరు. ఏ విషయాన్నీ నిర్ణయించలేరు. వీరిలో కొందరికైతే తనెవరో, ఎదుటి వారెవరో కూడా తెలియదు. దానికీ దీనికీ తేడా తెలియదు. అన్నం తినాలి అనే విషయం కూడా తెలియదు. ఎప్పుడూ ఏదో లోకంలో విహరిస్తుంటారు. ఊహల్లో జీవిస్తారు. ఈ లోకంలో ఉండరు.

మానవుడి బంధమోక్షాలకి కారణం మనస్సు అన్నారు. ఈ మనస్సే లేకపోతే బంధమూ ఉండదు. మోక్షం అంతకన్నా ఉండదు. వీరు చిదానందంగా జీవిస్తుంటారు. అలా అని ముక్తపురుషులు కాదు. మానసిక రోగులు.

మనసు పనిచేస్తేనే బంధాలు అనుబంధాలు అని చెప్పుకున్నాం. బంధాలు పెరిగితే అవి ముడిపడతాయి. వాటివల్ల అవినాభావ సంబంధం ఏర్పడుతుంది. అది విడదీయలేని బంధం అవుతుంది. ఈ బంధం ఆస్తితో కావచ్చు, డబ్బులతో కావచ్చు, బంధువులు మిత్రులతో కావచ్చు. ఎవరితోనైనా అది విడదీయలేనిదే. దీనివల్ల ఆరోగ్యం దెబ్బతింటుంది. మొత్తం మీద తెలిసిందేమంటే బంధాలు పెరగటం వల్ల, ఆలోచనలు సరిగా లేకపోవటం వల్ల ఆరోగ్యం దెబ్బ తింటుంది. దీనంతటికీ కారణం మనసే కాబట్టి శరీరారోగ్యం పాడవటానికి కారణం మనస్సే,

ఇదంతా మనం ఆధ్యాత్మికంగా చెప్పుకునే విషయం, కాని సైన్సు ప్రకారం కూడా ఇది నిజమే అని నిరూపిస్తున్నారు జపాన్‌కు చెందిన శాస్త్రవేత్త. వారు ఈ మధ్య కాలంలో శరీర ఆరోగ్యం దెబ్బ తినటానికి బలమైన కారణాలు ఏవి? అని అన్వేషించటం మొదలుపెట్టారు. వాటిమీద పరిశోధనలు కూడా చేశారు. **ఏతావాతా తేలిందేమి ఉంటే శరీరారోగ్యానికి కూడా కారణం మనస్సే** అని.

గతంలో ఆరోగ్యం దెబ్బ తినటానికి మన ఆహారపు అలవాట్లే కారణం అనుకునే వారు. కాని ప్రస్తుత రోజుల్లో పరిశోధనలు జరిపి **ఆరోగ్యానికి కారణం మనస్సు** అనే మాటను తేల్చారు. మనసు బాగున్న వారు ఎక్కువ కాలం జీవిస్తున్నారు. మనసు పాడైతే, లేనిపోని ఆలోచనలు చేసి, వాటి నుంచి బయట పడటానికి ధూపానం, మద్యపానం వంటి వాటికి చివరకు నిషేధిత మత్తుమందులు వాడటానికి కూడా అలవాటు పడి ఆరోగ్యాన్ని ఇంకా దిగజార్చుకుంటున్నారు. అందుకే ప్రస్తుత కాలంలో వైద్యులు మందులివ్వటం తగ్గించి జీవనశైలిని సరిదిద్దటానికి ప్రయత్నం చేస్తున్నారు.

షుగరు, బి.పి. వంటి రోగాలకు మందులు ఇచ్చే పద్ధతిని మార్చారు. అన్ని రకాల పదార్థాలు నిరభ్యంతరంగా తినమంటున్నారు. ప్రొద్దున్నే లేచి గుడికి వెళ్ళి ప్రదక్షిణాలు చెయ్యండి అంటున్నారు. వీటివల్ల పుణ్యము పురుషార్థము రెండూ కలిసి వస్తాయి. మార్నింగ్ వాక్‌కి వెళ్ళేవారు ప్రశాంతమైన మనసుతో వెళ్ళాలి. అందుకని మీకు నచ్చిన పాటలు, సంగీతం వినండి అంటున్నారు. ఏం చేస్తే మీకు ఉత్సాహం అనిపిస్తుందో అది చెయ్యండి అంటున్నారు. ప్రతిరోజు జిమ్‌కి వెళ్లండి, కొంతసేపు నడవండి. ప్రదక్షిణలు చెయ్యండి. ఏమైనా సరే శరీరానికి కొంత వ్యాయామం ఉండాలి అంటున్నారు.

మానసికంగా ఉల్లాసంగా ఉన్న వారికి వ్యాధులు వచ్చే అవకాశాలు తక్కువ.

**1. గ్యాసు :** ఇది రావటానికి కారణం ఆహార లోపాలు కాదు. మానసిక వత్తిడి అంటున్నారు.

**2. రక్తపోటు :** రక్తపోటు రావటానికి కారణం ఉప్పు అనే కన్న, ఆవేశ కావేశాలు అదుపు చేసుకోలేకపోవటమే.

**3. చెడు కొలెస్ట్రాల్ :** క్రొవ్వు పదార్థాలు తింటే చెడు కొలెస్ట్రాల్ పెరుగుతుంది అని మన నమ్మకం. కాని అతిబద్ధకం వల్ల శరీరంలో కొవ్వు, చెడు కొలుస్ట్రాల్‌లు పెరుగుతాయంటున్నారు.

**4. మధుమేహం :** తీపి పదార్థాలు ఎక్కువగా తింటే మధుమేహం వస్తుంది పెరుగుతుంది అని మనకి తెలుసు. కాని స్వార్థం, మొండితనం ఎక్కువ ఉన్న వారిలో ఇది బాగా పెరుగుతుంది అంటున్నారు.

**5. ఆస్త్మా :** ఊపిరితిత్తులకు ఆక్సిజను సరిగా సరఫరా కాకపోవటం వల్ల ఆస్త్మా వస్తుంది. కాని ఎక్కువగా విచారించటం వల్ల ఆస్త్మా వస్తుంది అంటున్నారు.

**6. గుండెజబ్బు :** శిరలు ధమనులు సరిగా పని చెయ్యకపోవటం వల్ల గుండె జబ్బు వస్తుంది. కాని ప్రశాంతత లేకపోవటం వల్లనే గుండె జబ్బులు వస్తాయి అంటున్నారు. ఈ రకంగా చూస్తే రోగాలకు మూలకారణం ఆహార అలవాట్లు కాదు, జీవన విధాన సంబంధమైనది అని తెలుస్తోంది. వారి అధ్యయనం ప్రకారం.

50% రోగాలు ఆధ్యాత్మికత లోపం వల్ల వచ్చేవే

25% రోగాలు మానసిక కారణాల వల్ల

15% సామాజిక, స్నేహ, బాంధవ్యాల వల్ల

10% శారీరక కారణాల వల్ల వస్తాయి

అందుచేత కడుపు మాడ్చుకుని ఆహారం తినకుండా ఉండే కన్న, జీవనశైలిని మార్చుకుని ఆరోగ్యాన్ని కాపాడుకోండి' అంటున్నారు జపాన్ శాస్త్రవేత్తలు.

మనిషి ఆరోగ్యంగా ఉండాలంటే స్వార్థం, కోపం, ద్వేషం, శత్రుత్వం, అసూయ, ఆవేశం, బద్ధకం, మొండితనం విచారం వంటి వ్యతిరేక భావాలు పూర్తిగా వదిలెయ్యాలి. వాటి స్థానంలో స్నేహం, కరుణ, త్యాగం, శాంతం, క్షమ, నిస్వార్థం, సేవాభావం, కృతజ్ఞత వంటివి అలవరచుకోవాలి.

అంటే మానవుడు లౌకిక చింతన తగ్గించుకుని ఆధ్యాత్మిక చింతన పెంపొందించుకుంటే, అతడి మనసు ప్రశాంతంగా ఉంటుంది. ఆరోగ్యవంతంగా ఉంటుంది. అతడి దగ్గరకు ఏ రోగాలు రావు.

మన విషయాలు సైన్సు పరంగా కూడా నిజమే అనే విషయాన్ని గుర్తించండి.

# 33. దానం

మన దగ్గర ఉన్న వస్తువును అన్ని అధికారాలతోను ఇంకొకరి ఇస్తే దాన్ని **దానము** అంటారు. దానం రెండు రకాలుగా ఉంటుంది.

**1. లేనివాడికి సహాయం చెయ్యాలనే దృష్టితో ఇచ్చేది :** రోడ్డు మీద వెడుతున్నాం. ఎవరో ఒక బీదవాడు ఆకలికి అలమటిస్తున్నాడు. అతడు తినటానికి రొట్టెకొనిచ్చాం. అది దానము అవుతుంది. అతడు కప్పుకునేందుకు దుప్పటి ఇచ్చాం అది దానమవుతుంది. ఇందులో అతడికి సహాయం చెయ్యటమే తప్ప ఏ ఇతర కోరికా మనకి ఉండదు.

**2. పాపపరిహారంగా చేసేది :** చేసిన పాపం పోగొట్టుకోటానికి చేసేది. పిల్లిని చంపాం. గుడి కట్టించాం. పిల్లిని చంపిన పాపం గుడి కట్టిస్తే పోతుంది అన్నారు. అందుకని గుడి కట్టించాం. జాతక చక్రంలో శని బాగా లేడు. వర్తమానంలో కష్టాలు కలిగిస్తాడు. అందుకని శనికి నువ్వులు దానం ఇమ్మన్నారు. ఒక బ్రాహ్మణ్ణి పిలిచి నువ్వులు దానం ఇచ్చాం. ఈ రకమైన దానం చేస్తే చేసిన పాపము లేదా గ్రహదోషము పోతుంది.

అయితే ఇక్కడ ఏ రకమైన అపేక్ష లేకుండా ఎదుటి వారికి ఇచ్చే దాన్నే దానము అంటారు. ఇలా దానము ఇచ్చేటప్పుడు చదువుకున్న గొప్ప పండితుడికో, ఏవీ లేని దరిద్ర నారాయణుడికో దానం చెయ్యాలి. మనం ఇచ్చే వస్తువు అవసరమైన వాడికి మాత్రమే దానం చెయ్యాలి. దానగ్రహీత ఆ వస్తువును వాడుకోవాలి. అంతేగాని మళ్ళీ బజార్లో అమ్ముకోరాదు.

దానం చేసే వస్తువు అవతలి వ్యక్తికి ఉపయోగపడాలి. బియ్యం దానమిస్తున్నాం అనుకోండి. నువ్వు వాడే బియ్యాన్నే దానం చెయ్యాలి. అంతేకాని ముక్కిపోయినవి, ముతక బియ్యం, పురుగులు పడ్డవి దానం చెయ్యరాదు. దానం చేసిన వస్తువు కొన్ని వేల రెట్లై మళ్ళీ నీకే తిరిగి వస్తుంది. ఒకవేళ పనికిరాని వస్తువులు దానం చేస్తే, అవే కొన్ని వేలై నీ దగ్గరకి చేరతాయి. పనికిరాని వస్తువులు దానం చేస్తే ఆనందము అనే. రకం వస్తుంది అని చెబుతాడు నచికేతుడు కఠోపనిషత్తులో. నచికేతుడి తండ్రి గౌతముడు పనికిరాని, ఒట్టిపోయిన, కదలేని ఆవులను దానం

ఇవ్వాలి అనుకుంటాడు. ఆ సందర్భంగా ఆ ప్రయత్నం నుంచి తండ్రి నివారిస్తాడు నచికేతుడు.

దానం ఇచ్చేటప్పుడు నేను దానం చేస్తున్నాను అని గర్వంతో వీగిపోక, ఇంతకన్న ఇవ్వలేక పోతున్నాను. అని సిగ్గుతో తలదించుకుని దానం చెయ్యమంటోంది తైత్తిరీయోపనిషత్తు.

దానం ఇచ్చేవాడు పరబ్రహ్మ. తీసుకునే వాడు పరబ్రహ్మ. ఇచ్చే వస్తువు కూడా పరబ్రహ్మ స్వరూపమే అని చెబుతోంది ఛాందోగ్యోపనిషత్తు.

దానం చేసేటప్పుడు దాతకు ఇవ్వాలనే కోరిక, దానం తీసుకునేందుకు సమర్థుడైన గ్రహీత రెండూ సమకూరాలి. బలిచక్రవర్తిని మూడడుగులు దానం అడిగాడు వామనుడు. ఇస్తాను అన్నాడు బలి. వచ్చినవాడు సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు. నువ్వు దానం ఇస్తే నాశనమై పోతావు అన్నాడు శుక్రాచార్యుడు. అప్పుడు అంటాడు బలి

**ధాత్రిని హాలికునకు సు**
**క్షేత్రము బీజములు నొకట జేకురు భంగిం**
**జిత్రముగ దాతకీవి యు**
**బాత్రము సమకూరునట్టి భాగ్యము గలదే?**

దానం ఎప్పుడూ అర్హుడైన వాడికే ఇవ్వాలి. ఇలా దానం ఇచ్చేటప్పుడు మన వారు కదా అని దానం ఇవ్వరాదు. దానివల్ల ఫలితం ఉండదు.

కుడిచేత్తో చేసే దానం ఎడమచేతికి తెలియకూడదు. అంటే పేరు ప్రతిష్టల కోసం దానం చెయ్యరాదు. ఒకే నేరానికి రెండు శిక్షలుండవు. అలాగే ఒకే దానానికి రెండు ఫలితాలుండవు. చేసిన దానానికి ఈ లోకంలోనే ఫలితం కావాలనుకుంటే, పరలోకంలో దాని ఫలితం ఉండదు.

దానం చెయ్యాలనుకున్నప్పుడు వెంటనే చేసెయ్యాలి. లేకపోతే మళ్ళీ మనసు మారిపోయి ఆ ప్రయత్న విరమించుకోవచ్చు.

కర్ణుడు గొప్ప దాత. అడిగిన వాడికి లేదనకుండా దానం చేసాడు. తనకి ప్రాణాపాయమని తెలిసి కూడా ఇంద్రుడికి కవచకుండలాలు దానం చేసిన మహానుభావుడు దానకర్ణుడు.

ఒకసారి కర్ణుడి దానగుణాన్ని పరీక్షించాలనిపించింది శ్రీకృష్ణుడికి. వృద్ధ బ్రాహ్మణుడి రూపంలో కర్ణుడి మందిరానికి వెళ్ళాడు. ఆ సమయంలో కర్ణుడు అభ్యంగన స్నానం ఆచరించబోతున్నాడు. వళ్ళంతా నూనె రాస్తున్నారు పరిచారికలు. కర్ణుడికి ఎడమవైపున రత్నాలు పొదిగిన బంగారు పాత్రలో నూనె ఉంది. ఈ బ్రాహ్మణుడు కర్ణుడి దగ్గరకు వెళ్ళి 'దేహి' అన్నాడు. ఒక్క క్షణం ఆలోచించాడు కర్ణుడు. ఇతడికి ఏమివ్వాలి. ఇప్పుడు తన దగ్గర ఏదీలేదు. ప్రక్కకు చూశాడు. నూనె పాత్ర కనిపించింది. ఎడంచేత్తోనే ఆ పాత్రని తీసి బ్రాహ్మణుడికి ఇచ్చేశాడు. అప్పుడు కృష్ణుడు నిజరూపం ధరించి 'ఇదేమిటి కర్ణా ఎడమచేత్తో ఇస్తున్నావు?' అంటాడు. దానికి కర్ణుడు

**క్షణం చిత్తం క్షణం విత్తం క్షణం జీవిత మావయోః ।**

**యమస్య కరుణానాస్తి ధర్మస్య త్వరితాగతిః ॥**

కృష్ణా ! ఎడమచేతిలోని గిన్నె కుడిచేతిలోకి తీసుకునే లోపు ఏమైనా జరగవచ్చు. మనసు మారిపోవచ్చు. లక్ష్మి చంచలమైనది. కాబట్టి ధనం మన నుండి పోవచ్చు. యముడికి దయలేదు. అందుచేత మృత్యువు రావచ్చు. అందుకే ధర్మకార్యం అనుకున్న వెంటనే ఆలస్యం లేకుండా చేసెయ్యాలనేది ఆర్యోక్తి. దాన్ననుసరించే ఇలా చేశాను' అంటాడు కర్ణుడు. కర్ణుడి వివేచనకు సంతోషించి, ఏదైనా వరం కోరుకో అంటాడు కృష్ణుడు.

**దేహీతి వచనం కష్టం నాస్తీతి వచనం తథా ।**

**దేహినాస్తీతి మద్వాక్యం మాభూజ్జన్మ జన్మనీ ॥**

కృష్ణా ! యాచించటం ఎంత కష్టమో, లేదని చెప్పటం కూడా అంత కష్టమే. నీచం కూడా. అందుకని ఏ జన్మలోను దేహి, నాస్తి అనే మాటలు నా నోటి వెంట రాకుండా అనుగ్రహించు అంటాడు. అంటే నేను ఇంకొకరిని యాచించకుండా, నా దగ్గరకి వచ్చి అడిగిన వారికి లేదనకుండా ఉండేటట్లు అనుగ్రహించమన్నాడు.

ఇవాల్టిరోజున దానం చేసిన వారు ఆ వస్తువు మీద తనపేరు, తల్లితండ్రుల పేర్లు కూడా వ్రాసుకుంటున్నారు కదా ? అని వారిని వెక్కిరిస్తున్నారు. ఒక్క విషయం గుర్తించండి. ఆ వస్తువు మీద పేరు వేయించుకున్నా, ఫొటో వేయించుకున్నా

అతను దానం చేస్తున్నాడు. అతనికి ఆ శక్తి ఉంది. నీకు దానం చేసే శక్తి లేదు. గుణము లేదు. మరి ఎందుకు వాళ్ళని ఎగతాళి చేయటం?

దానం చెయ్యటం చాలా గొప్ప గుణం. తండ్రుల తాతలు సంపాదించి ఇచ్చిన ఆస్తులు గాక, కష్టపడి సంపాదించిన ధనాన్ని దానం చేస్తే ఫలితం ఎక్కువ ఉంటుంది.

# 34. సత్యం

మానవుడు అనాదిగా సత్యాన్వేషణలో కాలం గడుపుతూనే ఉన్నాడు. అది ప్రపంచంలోని ఏ దేశమైనా సరే. ఎవరిమటుకు వారు, ఎవరి వంతు వారు సత్యాన్వేషణ చేస్తూనే ఉన్నారు. నేను ఎవరు? ఈ లోకంలో జన్మించక ముందు ఎక్కడ ఉన్నాను? ఎక్కడి నుంచి ఇక్కడికి వచ్చాను. మరణానంతరము ఎక్కడికి పోతాను? ఈ ఆలోచనలు అనాదిగా మానవుణ్ణి పట్టి పీడిస్తూనే ఉన్నాయి. చివరగా తెలిసిన విషయం ఏమంటే మానవశక్తికి మించిన శక్తి ఇంకేదో ఉన్నది. దాన్నే భగవంతుడు అన్నారు. ఆ శక్తే ఈ జగత్తును నడిపిస్తున్నది. అది సత్యము, నిత్యము, శాశ్వతమైనది. నిన్న ఉన్నది, నేడు ఉన్నది, రేపు ఉంటుంది. దానికి నాశనం లేదు. భారతీయ తత్త్వంలో దీన్నే ఆత్మ అన్నారు. అదే పరమేశ్వర స్వరూపం. జగత్తులో 84 లక్షల జీవరాసిని సృష్టిస్తున్నది. పెంచి పోషిస్తున్నది, లయం చేస్తున్నది. జీవులు చేసిన కర్మల ననుసరించి వారికి మరుజన్మలు ప్రసాదిస్తున్నది. జీవి చేసిన కర్మను ఆ జీవే అనుభవించే లాగా ఏర్పాటు చేస్తున్నది. అదే పరమేశ్వర స్వరూపం. అదే నేను. నేనే ఆ పరమేశ్వరుణ్ణి. 'అహం బ్రహ్మాస్మి' ఈ విషయం తెలుసుకోవటానికే మానవుడు నిరంతరము సత్యాన్వేషణ చేస్తున్నాడు. సత్యాన్ని తెలుసుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు. పూర్తిగా తత్త్వం తెలిస్తేనే సత్యం కనిపిస్తుంది. తానెవరనేది బోధ పడుతుంది. దీని కోసం నిద్రాహారం మాని, అడవుల వెంబడి, కొండల వెంబడి తిరిగి అన్వేషణ సాగిస్తున్నారు. అరిషడ్వర్గాలు, అహంకార మమకారాలు, వదిలిపెట్టి సత్యాన్వేషణ సాగిస్తున్నారు. అందులో అర్హులైన వారికి సత్యం గోచరిస్తుంది.

నేనునాది అనే అహంకార మమకారాలు పూర్తిగా వదిలేసి, రాగద్వేషాలు లేకుండా పరమేశ్వరుణ్ణి శరణు కోరాలి. ఆ పరమేశ్వర స్వరూపాన్ని తెలుసుకోవటానికి ప్రయత్నించటమే సత్యాన్వేషణ.

ఇక్కడ నిన్ను పరిక్షించే వారెవరూ ఉండరు. నీకేమీ పరీక్ష పెట్టరు. అందులో మార్కులు వెయ్యరు. పరీక్షలో నువ్వు పాసు కావాలి అంతే. మహర్షి తపస్సు చేస్తున్నాడు. అప్సరసలు వచ్చి నాట్యం చేశారు. మహర్షి మైమరచి పోయాడు. తపోనిష్ఠలు వదిలేశాడు. అప్సరాంగనతో వెళ్ళిపోయాడు. ఉదాహరణకు విశ్వామిత్రుడు. హిమాలయాల్లో ఆశ్రమం నిర్మించుకుని దక్షిణ దిక్కుగా తిరిగిన తపస్సు చేస్తున్నాడు. తెల్లవారేసరికి సెల ఏటిలో స్నానం చేస్తూ మేనక దర్శనమిచ్చింది. ఆమెను చూసి ముగ్ధుడై పోయాడు. ఆవిడ వెనక వెళ్ళిపోయాడు. తపో భంగమైంది. అందరూ అనుకుంటారు ఎవరైనా తపస్సు చేస్తుంటే సహించలేక ఇంద్రుడే అప్సరాంగనలను పంపి తపోభంగం కలిగిస్తాడు అని. అది నిజం కాదు. ఇది ఒక పరీక్ష. ఆ పరీక్ష నిర్వహించే వాడు ఇంద్రుడు. ఆ పరీక్షలో నెగ్గిన వారు పైకి పోతారు. విశ్వామిత్రుడు ఆ సమయంలో ఆ పరీక్ష నెగ్గలేకపోయాడు. తపస్సు చెయ్యటంలో కృతకృత్యుడు కాలేకపోయాడు. తపోశక్తి పూర్తిగా నశించింది. సత్యాన్వేషణలో సఫలీకృతం కాలేకపోయాడు.

సత్యాన్వేషణకు కావలసిన లక్షణాలు సంపాదించాలి. అంతేగాని వాటిని సంపాదించినట్లు నటిస్తే వచ్చేది ఏదీ ఉండదు. నటనతో ఎవరినైనా మోసం చెయ్యచ్చు. కాని భగవంతుణ్ణి మాత్రం మోసం చెయ్యలేం. జ్ఞానవైరాగ్యాలు సంపాదించిన వాడే సత్యాన్వేషణలో కృతకృత్యుడవుతాడు. దీనికి ఉదాహరణగా ఒక కథ చూడండి.

పూర్వకాలంలో ఒక రాజ్యంలో వెంకయ్య అని ఒక వ్యాపారి ఉండేవాడు. వ్యాపారం మూడు పూలు, ఆరు కాయలుగా సాగుతోంది. ధనాన్ని బాగా కూడబెట్టాడు. రాజకీయంగా కూడా బాగా పలుకుబడి సంపాదించాడు. దేశాన్ని పాలించే రాజుగారితో కూడా సత్సంబంధాలున్నాయి. రాజుగారి దృష్టిలో ఇతడు ఒక మంచి వ్యాపారి.

ఒక రోజున రాజ్యంలో పండుగ వాతావరణం నెలకొన్నది. ఆ రోజున అక్కడ కావలసిన ఏర్పాట్లన్నీ ఈ వ్యాపారే స్వయంగా దగ్గర ఉండి జరిపించాడు. ఏర్పాట్లు చాలా బాగున్నాయి. రాజుగారి హోదాకు తగ్గట్టుగా ఉన్నాయి.

రాజుగారు కుటుంబంతో సహా వ్యాపారి ఇంటికి వచ్చాడు. సాదరంగా ఆదరించాడు వ్యాపారి. రాజుగారికి ఉచితమైన ఆసనాన్ని చూపాడు. ప్రక్కనే ఇంకొకటి

వేసుకుని తాను కూర్చున్నాడు. అందరికీ బోజనాలు వడ్డిస్తున్నారు. వేడి వేడి వంటకాలు తీసుకు వస్తున్నారు. ఇంతలో ఒక సేవకుడు అన్నం పళ్ళెం తీసుకు వస్తున్నాడు. పళ్ళెంలో అన్నం వేడి పొగలు కక్కుతోంది. సేవకుడు అన్నం పళ్ళెం తెస్తున్నాడు. ఇంతలో అనుకోని సంఘటన జరిగింది. సేవకుడి చేతిలోంచి అన్నం పళ్ళెం జారి, అందులోని వేడి వేడి అన్నం వ్యాపారి కాళ్ళమీద పడింది. అతడి కాళ్ళు కాస్తా కాలిపోయినాయి. నల్లగా మాడిపోయినాయి. వ్యాపారికి చాలా కోపం వచ్చింది. సేవకుణ్ణి చంపేద్దామనుకున్నాడు. విషయం అర్థమైంది సేవకుడికి. తప్పించుకునే ప్రయత్నం చెయ్యాలి. వెంటనే మెరుపులాంటి ఆలోచన తట్టింది సేవకుడికి. 'కోపాన్ని జయించిన వారు స్వర్గానికి పోతారు' అని బిగ్గరగా అన్నాడు సేవకుడు అందరికీ వినిపించేలా. ఆ మాటతో ధనవంతుడు తన కోపాన్ని దిగమ్రింగేశాడు. ముఖం మీదకు చిరునవ్వు తెచ్చుకున్నాడు. అతని సహనానికి అక్కడున్న వారందరూ అభినందించారు. రాజుగారు ప్రత్యేకంగా అభినందించారు. చాలా ఆనందం అనిపించింది వ్యాపారికి. పనివాడు వెంటనే "క్షమించే తత్త్వం ఉన్నవారికే స్వర్గం ప్రాప్తిస్తుంది" అన్నాడు. ఆ మాటలు విన్న వ్యాపారి తన కోపాన్ని అణిచి పెట్టుకుని "నిన్ను క్షమించాను ఫో" అన్నాడు. పనివాడు ఊపిరి పీల్చుకున్నాడు, ఇప్పుడు పనివాడు "దయాగుణం ఉన్నవారినే భగవంతుడు ప్రేమిస్తాడు" అన్నాడు.

ఆ మాటలు విన్న ధనవంతుడు వెంటనే సేవకుడితో "నిన్ను క్షమించి వదిలేస్తున్నాను. ఇక నుంచి నువ్వు స్వేచ్ఛాజీవివి. ఇదిగో ! ఈ ధనాన్ని తీసుకువెళ్ళి హాయిగా జీవించు" అంటూ ఒక సంచి నిండా ధనాన్ని ఇచ్చాడు. ఆ ధనంతో స్వేచ్ఛగా జీవించాడు సేవకుడు.

ధనవంతుడు చేసిన ఈ పని అందరికీ తెలిసింది. రాజ్యం మొత్తం తెలిసింది. దేశవిదేశాల్లో కూడా తెలిసింది. అతడి కీర్తి దశదిశలా వ్యాపించింది. దాంతో అప్పటిదాకా అతనిలో ఉన్న పగ, ద్వేషం, హటాత్తుగా మారిపోయాయి, శాంతం, దయ, దానగుణంగా అవతరించాయి. అయితే ఈ మార్పు నిజమైనదేనా? అవసరాన్ని బట్టి రంగులు మార్చి శాంతమూర్తిలాగా, దానగుణ సంపన్నుడిగా కనిపిస్తున్నాడు వ్యాపారి. ఈ మార్పంతా అహంకారము, అభినందనల వల్ల వచ్చినది.

మనిషిలో మార్పు అనేది నిజంగా రావాలి. లేకపోతే సత్యం గోచరించదు. ప్రక్కన ఉన్నవాళ్ళని మోసం చెయ్యవచ్చు. కాని భగవంతుణ్ణి మోసం చెయ్యలేం.

మధుమేహం ఉన్నవాడు తీపి పదార్థాలు అసలు తినటం లేదు అని అందరినీ నమ్మిస్తాడు. కాని గదిలోకి పోయి ఎవరూ చూడకుండా తింటాడు. అతని మాటలు నమ్మినవారు, అతడు తీపి తినడు అనే నమ్ముతారు. కాని పరీక్షకు వెడితే, అతనిలో చక్కెర శాతం బయట పడుతుంది. కంప్యూటర్ని మోసం చెయ్యలేం. అలాగే భగవంతుణ్ణి కూడా. నీలో వచ్చిన మార్పు నిజమైనదైతే సత్యం గోచరిస్తుంది. అందుకే జ్ఞానవైరాగ్యాలు గలవాడికే సత్యం గోచరిస్తుంది.

## 35. క్షమాగుణం

మానవుడికి ఉండే గుణాలన్నింటిలోకి క్షమాగుణం చాలా గొప్పది. క్షమాగుణం అంటే ఎదుటి వారు ఎంతటి తప్పు చేసినా, చివరకు తనకు ప్రాణహాని తలపెట్టినా అతణ్ణి క్షమించి వదిలెయ్యటం. ఈ లక్షణం అందరికీ ఉండదు.

రామరావణ సంగ్రామం జరుగుతోంది. రావణుడి సైన్యం దరిదాపుగా అంతా నశించింది. అప్పుడు కూడా శ్రీరాముడంటాడు. "రావణా ! సీతాపహరణం అధర్మం. ఇప్పటికైనా అధర్మాన్ని వదిలిపెట్టి సీతను తెచ్చి వప్పగించు నిన్ను క్షమించి వదిలేస్తాను" అని సాక్షాత్తు తన భార్యను ఎత్తుకుపోయి, తనకు ఆమెకు ఇన్ని కష్టాలు రావటానికి కారణమైన శత్రువును క్షమించటమనేది సామాన్య విషయం కాదు. కాని ఆ పని చేస్తాను అన్నాడు శ్రీరాముడు. అందుకే రాముడు దేవుడైనాడు.

మహాభారతంలో జ్యూదక్రీడ అయిపోయింది. పాండవులు సర్వము కోల్పోయారు. వారు అరణ్యాలకు వెళ్ళటానికి సిద్ధపడుతుంటారు. ఆ సమయంలో విదురుడు అంటాడు "సుయోధనా ! ఇక్కడ ఓడిపోయిన వారు నీ సోదరులే. ఇదేమీ యుద్ధం కాదు. వినోదంగా ఏర్పాటయిన జ్యూదం. కాబట్టి పాండవుల రాజ్యం వారికి ఇచ్చెయ్యి. నీ గొప్పతనాన్ని, క్షమాగుణాన్ని చాటుకో" అని. సుయోధనుడు ఆ మాటలు వినలేదు. చేజేతులా యుద్ధానికి తెర తీశాడు. ఫలితంగా కురువంశం సర్వనాశనమయింది.

అజ్ఞాతవాసం తరువాత కూడా కౌరవులు చేసిన ద్రోహాన్ని క్షమించామన్నారు పాండవులు. శ్రీకృష్ణరాయబారం నడిపారు. అర్ధరాజ్యం కాకపోయినా చివరకు ఐదూళ్ళిచ్చినా చాలు అన్నారు. ఒప్పుకోలేదు రారాజు. సూది మొనమోపినంత చోటు కూడా ఇవ్వనన్నాడు. ఫలితం కురుక్షేత్ర సంగ్రామం. పద్దెనిమిది అక్షోహిణీల

సైన్యం నాశనమయింది. ఇరువైపులా యోధులందరూ మరణించారు. కౌరవులకు పిండం పెట్టే దిక్కుకూడా లేకుండా పోయింది. దీనికంతటికీ కారణం విచక్షణాజ్ఞానం లేకపోవటం. చిన్నపాటి క్షమాగుణం లేకపోవటం.

జీవరాసి అంతా పరమేశ్వరుడిలో భాగమే. ఆ విషయం పురుషసూక్తంలో చెప్పారు. విరాడ్రూపము అంటే విశ్వంలో ఉండే జీవరాసికంతటికీ ప్రతీక. జీవజాలము అంతా పరమేశ్వరుని యందే ఉన్నది. ఆ పరమేశ్వరుడు కరుణామయుడు. క్షమాగుణ సంపన్నుడు. మరి ఆయనలో ఉన్న కరుణ, క్షమ గుణాలు, ఆయన నుంచి వచ్చిన జీవులయందు కూడా ఉండాలి కదా? ఉంటాయి ఉండి తీరతాయి ఇందులో సందేహం లేదు. అవి అంతర్గతంగా ఉంటాయి. బయటకు కనిపించవు. అవి బయటకు రావాలంటే మానవుడు తీవ్రసాధన చెయ్యాలి. మనం తెలిసి, తెలియక కొన్ని తప్పులు, పాపాలు చేస్తుంటాం. వాటిని క్షమించమని భగవంతుణ్ణి వేడుకోవాలి. అలా మనసారా వేడుకుంటే ఆ భగవంతుడు క్షమిస్తాడు. అతడు అపార కరుణామయుడు.

గజేంద్ర మోక్షంలో చూడండి. ఏనుగు మొసలితో శాయశక్తులా పోరాడింది. ఇక ఓపిక లేక పరమేశ్వరుణ్ణి ప్రార్థించింది. రక్షించమని వేడుకుంది. వైకుంఠంలో ఉన్న మహావిష్ణువు పరుగు పరుగున వచ్చాడు. వచ్చి రాగానే ముందుగా ఏనుగును చేతుల్లోకి తీసుకుని, దాని ఒళ్ళంతా నిమిరాడు. నేనున్నాను. నీకేం భయం లేదు అని అభయం ఇచ్చాడు. ఈ లోపల మొసలి ఏనుగును వదిలెయ్యటానికి సరిపడా సమయాన్నిచ్చాడు. మొసలి ఏనుగును వదిలేస్తే, దాన్ని ఏమీ చేసేవాడు కాదు. కాని మొసలి ఏనుగును వదల్లేదు. దాంతో అంతిమ ఘట్టంగా మొసలిని సంహరించాడు.

తప్పు చేసినవాడు ఒక్క మాట 'తెలిసో, తెలియకో చిన్న పొరపాటు చేశాను. మీ మనసును బాధ పెడితే క్షమించండి' అని ఒక్క మాట అంటే చాలు. పరిస్థితి అంతా తారుమారు అయిపోతుంది.

క్షమాగుణం అందరికీ ఉండదు. ఇది దైవదత్తం. మనిషిలోని జ్ఞానానికి, వివేకానికి ఇది ప్రతిరూపం. ఈ విషయం భగవానుడు గీతలో చెప్పాడు. ఇంద్రియాలను అదుపులో ఉంచాలంటే క్షమ ఉండి తీరాలి.

జీవితంలో ప్రతివారు పొరపాట్లు, తప్పులు చేస్తారు. చేసిన తరువాత దాన్ని గురించి ఆలోచిస్తారు. తప్పు చేశామని తెలుసుకుని పశ్చాత్తాప పడతారు. దానివల్ల ఉపయోగం లేదు. అప్పటికే జరగవలసిన నష్టం జరిగిపోయింది. కాబట్టి తాను చేస్తున్నది తప్పు అనే మాట ముందుగానే గ్రహించాలి.

చరిత్రలో అశోకుడు చూడండి. రాజ్యకాంక్షతో కళింగ యుద్ధం చేవాడు. తరువాత తప్పు తెలుసుకుని బౌద్ధం స్వీకరించాడు. **మనల్ని క్షమించినవాడు దైవసమానుడు.**

క్షమాగుణం గలవారికి శత్రువులుండరు. మహాభారతంలో అక్రూరుడు, విదురుడు, ధర్మరాజు ఈ కోవకు చెందిన వారే. అందుకే వారు అజాత శత్రువులు అనబడ్డారు.

ఇక్కడ ఇంకో విషయం ఏమంటే తప్పు చేసినప్పుడు అది మనస్సును దహించి వేస్తుంది. కారుచిచ్చులాగా కాల్చేస్తుంది. మనం తప్పు గనక ఒప్పేసుకుంటే మనసు ప్రశాంతంగా ఉంటుంది. జీర్ణప్రక్రియ సహజంగా ఉంటుంది. శరీరారోగ్యం బాగుపడుతుంది.

కాబట్టి గుణాలన్నింటిలోకి ఉత్తమమైన క్షమాగుణాన్ని అందరూ అలవరచుకుంటే దేశం సుభిక్షంగా ఉంటుంది. రామరాజ్యం అవుతుంది.

అయితే మనం సామాన్య మానవులం కదా? ఈ క్షమాగుణం మనకి అబ్బుతుందా అని చిన్న అనుమానం. తప్పకుండా అలవడుతుంది. ఇందులో సందేహం లేదు. ఇక్కడ చిన్న ఉదాహరణ చూడండి.

మనం బియ్యపు గింజలాంటి వాళ్ళం.

బియ్యపు గింజలను మరిగే పాలలో వేస్తే అది పాయసమవుతుంది.

ఎసరులో వేస్తే – అన్నం అవుతుంది.

పసుపుతో కలిపితే – అక్షతలు అవుతాయి.

కుంకుమతో కలిస్తే – శక్త్యారాధన పూజకు ఉపయోగపడతాయి.

అదే బొగ్గుతో కలిస్తే – 'చేతబడి' అవుతుంది.

కాబట్టి మానవుడు దేన్ని సాధన చేస్తే దాన్నే పొందుతాడు. అందుకే ప్రతివారు చిన్నప్పటి నుంచి విపరీత సాధన చేసైనా సరే దయ, క్షమగుణాలు అలవరచుకోవాలి.

# 36. అహంకారం

జీవితంలో లక్ష్మి అవసరం లేనివాడు ఎవరూ ఉండరు. భిక్షకుడి దగ్గర నుంచి, చక్రవర్తిదాకా అందరికీ ధనం కావలసిందే. అందుకే **ధనమూలమిదం జగత్,** డబ్బు లేని వాడు డుబ్బుకు కూడా కొరగాడు వంటి సామెతలు అనేకం పుట్టినాయి. డబ్బులుంటే కొండమీది కోతైనా దిగి వస్తుంది. డబ్బులుంటే సాధించలేనిది ఏదీ లేదు. ఈ ధనానికి కారణం లక్ష్మీదేవి. ఆవిడ గనక కరుణిస్తే ఎంతటి దరిద్రుడైనా కోటీశ్వరుడౌతాడు. అతనికి పలుకుబడి, గౌరవం, మర్యాద అన్నీ పెరుగుతాయి. చాతుర్వర్ణాల వారినీ చెబుతూ వైశ్యులలో ధనాధికుడే గొప్పవాడు అన్నారు. ఇక్కడ ధనానికి ప్రతీక లక్ష్మీదేవి. ధనము అనేది కేవలము డబ్బు రూపంలోనే కాదు అనేక రూపాల్లో ఉంటుంది. ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి, విద్యాలక్ష్మి, ధైర్యలక్ష్మి, విజయలక్ష్మి, రాజ్యలక్ష్మి, ధైర్యలక్ష్మి, మోక్షలక్ష్మి అంటూ ఎనిమిది రకాలుగా లక్ష్మీదేవి ఉంటుంది. అయితే సామాన్యంగా లక్ష్మి అంటే ధనలక్ష్మి అనే అర్థం చెబుతారు. లక్ష్మీదేవి కలవాడే కలవాడు. ఆమె లేనివాడు లేనివాడు. ఇంత ప్రాముఖ్యత ఉన్న లక్ష్మీదేవి మన ఇంట్లో ఎక్కడ ఉంటుంది? అంటే ధనలక్ష్మి మన ఇనప్పెట్టెలోనే ఉంటుంది. ఈ రోజుల్లో అయితే మన బ్యాంకుల్లోనో, విదేశీ బ్యాంకుల్లోనో సురక్షితంగా ఉంటుంది. అలాగే ఉండాలి. అదే ఆవిడ స్థానం. అదే ధాన్యలక్ష్మి అనుకోండి పంట పొలాల్లో, ధాన్యం నిల్వచేసే గోదాముల్లో ఉంటుంది. ఒకవేళ అలా ఉండకపోతే తమ **తమ నెలవులు తప్పిన తనుమిత్రులె శత్రులగుట తథ్యము** అన్నాడు బద్దెన తన సుమతీ శతకంలో. వెంట్రుకలు అనేవి నెత్తిమీద ఉండాలి. కాని అవి అరచేతిలో మొలిస్తే? ఫలితం మీకు తెలుసు. కాబట్టి లక్ష్మీదేవి కూడా మన ధనాగారంలోనో, ధాన్యాగారంలోనో, రాజ్యంలోనో ఉండాలి. లేకపోతే ప్రమాదం ఏర్పడుతుంది. అదే లక్ష్మీదేవి మన నెత్తిన ఎక్కింది అనుకోండి. అంటే డబ్బు మదంతో కళ్ళు మూసుకుపోయి ఉచ్ఛనీచాలు మరిచిపోయాడు. నాకేమిటి? అని అహంకరించాడు. అటువంటి వాడికి పతనం తప్పదు.

పూర్వకాలంలో వృత్రాసంహారం జరిగినప్పుడు ఇంద్రుడికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంది. అప్పుడు దేవతలంతా ఆలోచించి భూలోకంలో నూరు అశ్వమేధాలు చేసిన నహుషుణ్ణి ఇంద్రపదవిలో కూర్చోబెట్టారు. దాంతో అతడికి కళ్ళు నెత్తికి ఎక్కి ఇంద్రుని భార్య శచీదేవిని కోరాడు. దాంతో పతనమై పోయి కొండ చిలువగా

కొన్ని వేల సంవత్సరాలు పడి ఉన్నాడు. ఈ విషయం మీకందరికీ తెలుసు. ఇలాంటిదే ఇంకొక కథ కూడా ఉంది.

పూర్వకాలంలో జంభాసురుడు అనే రాక్షసుడు శివుణ్ణి గురించి తపస్సు చేసి త్రిలోకాధిపత్యం పొందాడు. అసలే రాక్షసుడు. అందులో వరబలం ఉంది. దాంతో ముల్లోకాలు జయించి దేవతలను తరిమికొట్టాడు. చేసేది లేక ఇంద్రుడు దేవతలను వెంట బెట్టుకుని, దేవగురువైన బృహస్పతి దగ్గరకు వెళ్ళాడు. అప్పుడు బృహస్పతి 'ఓ ఇంద్రా ! సహ్యాద్రి మీద ఉన్న దత్తాత్రేయుడు తప్ప ఇంకెవరూ ఇప్పుడు నీకు సాయం చేయలేరు. కాబట్టి ఆయన్ను శరణు వేడవలసింది' అని సలహా ఇచ్చాడు. ఇంద్రుడు సహ్యాద్రి చేరి దత్తాత్రేయుణ్ణి శరణు వేడాడు. దత్తాత్రేయుడు అంటే శ్రీమహావిష్ణువు యొక్క అవతారమే. ఆయన భార్య అనఘాదేవే లక్ష్మీదేవి. దత్తుడు అపార కరుణామయుడు. అయితే భక్తుల్ని ముందుగా పరీక్షించి గాని ప్రసన్నం కాడు. అదే విధంగా ఇంద్రుణ్ణి అనేక రకాలుగా పరీక్షించి చివరకు ప్రసన్నుడై, ఆయన ప్రార్థనలు ఆలకించి చిన్న సలహా చెప్పాడు. అదేమిటి? అంటే "ఓ ఇంద్రా! నువ్వు ఒక చిన్న పనిచెయ్యి. ఎలాగైనా సరే జంభాసురుణ్ణి నా ఆశ్రమం దగ్గరకు తీసుకుని రా" అన్నాడు.

సరేనన్నాడు ఇంద్రుడు. దేవసైనంతో బయలుదేరాడు. జంభాసురుడితో యుద్ధానికి దిగాడు. పోరు ఘోరంగా సాగుతోంది. అందులో రాక్షసులదే పై చెయ్యి. దేవతలు వెనుకంజ వేస్తున్నారు. అయినా సరే ధైర్యం కూడ గట్టుకు యుద్ధం చేస్తూనే, వెనక్కి తగ్గుతున్నారు. రాక్షసుల కోపం పెరిగిపోయింది. కట్టలు తెంచుతుంది. ఏమైనా సరే దేవతలను తుద ముట్టించాల్సిందే అని నిర్ణయించుకుని, దేవతల వెంట పడ్డారు. దేవతలు పారిపోతున్నారు. వీలు దొరికినప్పుడు ఆయుధాలు ప్రయోగిస్తున్నారు. రాక్షసులు మితిమీరిన కోపంతో దేవతలను వెంబడిస్తున్నారు. దేవతలు వెనుతిరిగి దత్తుని ఆశ్రమం వైపుగా పారిపోయారు. రాక్షసులు వారిని వెంబడిస్తూ దత్తాత్రేయుని ఆశ్రమం చేరారు.

అక్కడి వచ్చిన జంభాసురుడు దత్తాత్రేయుని ప్రక్కన ఉన్న అనఘాదేవిని చూశాడు. ఆవిడ సౌందర్యానికి ముగ్ధుడై పోయాడు. ఆమెను తనతో తీసుకువెళ్ళాలి అనుకున్నాడు. ఆమెను రమ్మని అడిగాడు. వెళ్ళమన్నాడు దత్తాత్రేయుడు. అప్పుడు అనఘాదేవి జంభాసురిడితో 'నాకు నీ శిరస్సు మీద నాట్యం చెయ్యాలని ఉంది.

దానికి ఒప్పుకుంటే నీతో వస్తాను' అంది. అంతటి సౌందర్యరాసి తనతో వస్తానంటే ఏం చెయ్యటానికైనా సిద్ధపడ్డాడు జంభాసురుడు. వెంటనే సరే అన్నాడు. అనఘాదేవి రాక్షసుడి శిరస్సు మీద ఎక్కి నాట్యం చెయ్యటం మొదలు పెట్టింది. అనఘాదేవి అంటే లక్ష్మీదేవే కదా? లక్ష్మీదేవి తలమీద ఎక్కితే, ధనమదం పెరుగుతుంది. కన్ను మిన్ను తెలియవు. నా అంతటివాడు లేడు అనుకుంటాడు. ఒక రకమైన మత్తులో మునిగిపోతాడు. పరిసరాలేవి పట్టవు. అదే స్థితిలోకి వెళ్ళాడు రాక్షసుడు. ఈ సమయంలో దేవసేనలు రాక్షస సైన్యాన్ని నాశనం చేశాయి. అతడు ఆ మత్తులో పరాకుగా ఉండగానే ఇంద్రుడు జంభాసురుణ్ణి సంహరించాడు.

జీవితంలో ధనాన్ని, రాజ్యాన్ని సంపాదించటం ఒక ఎత్తైతే, సంపాదించిన దాన్ని నిలబెట్టుకోవటం ఇంకొక ఎత్తు. ధనమదం దీన్నే డబ్బున్నదన్న అహంకారం అంటారు. అది గనక వచ్చిందంటే కంటికి ఏదీ కనిపించదు. అంతా అహం (నేను) గానే కనిపిస్తుంది. నాకన్న గొప్పవారెవరూ లేరనిపిస్తుంది. **'నేనే ఈలోకానికి శాసనకర్తను'** అనుకుంటాడు. మానవుడిలో 'అహం' ప్రవేశించిందంటే, అతడికి పతనం ప్రారంభమైనట్లే, ఈ అహంతోనే మనిషి సర్వనాశనమవుతాడు.

కాబట్టి దేన్ని ఎక్కడ ఉంచాలో అక్కడే ఉంచాలి. నిప్పు మనదే కదా అని జేబులో వేసుకోరాదు. అలాగే ధనం మనదే కదా అని అహంకరించరాదు. అహంకరించిన వాడు అతిత్వరలోనే పతనమవుతాడు.

అందుచేత దనం సంపాదించిన తరువాత అహంకారం పెరగకుండా చూసుకోండి. సంఘంలో మీరు ఎంత ఎదిగినప్పటికీ ఒదిగి ఉండటం అలవాటు చేసుకోండి. మీరు ఎదుగుతున్నప్పుడు అందరి కళ్ళు మీ మీదే ఉంటాయి. అందరూ మిమ్మల్నే గమనిస్తుంటారు. మీలో ఏ మాత్రం మార్పు వచ్చినా, అహం పెరిగినా అవతలివాళ్ళకు చాలా తేలికగా తెలుస్తుంది. ఎవరూ గమనించటం లేదు అనుకోవద్దు. అహం పెరిగితే నీ నాశనాన్ని నువ్వు కొనితెచ్చుకున్నట్లే.

ఎంత గొప్పవాడైనా అహం పనికి రాదు.

## 37. నగ్నసత్యాలు

ఎవరు ఔనన్నా, ఎవరు కాదన్నా జీవితంలో కొన్ని యధార్థాలు ఉన్నాయి. అవి ఎప్పటికీ మారవు. యుగాలు మారినా అవి అలాగే ఉంటాయి. వాటినే నగ్నసత్యాలు అంటారు. వాటిలో కొన్ని

1. ఎప్పుడైనా సరే ఒకరిని బాధ పెట్టటం చాలా తేలిక. ఎంత తేలిక అంటే నీళ్లలో రాయి వేసినంత తేలిక. తిరిగి వాళ్ళని యధాస్థితికి తీసుకురావటం అంటే, నీళ్లలో పడిన రాయిని తీసినంత కష్టం.
2. స్నానం – దేహాన్ని శుద్ధి చేస్తుంది. మౌనం – మనసును శుద్ధి చేస్తుంది. ధ్యానం – బుద్ధిని, ప్రార్థన – ఆత్మను, దానం – సంపాదనను, ఉపవాసం – ఆరోగ్యాన్ని, క్షమాగుణం – మానవ సంబంధాలను శుద్ధి చేస్తాయి.
3. అందరూ మనవారే. అయినా సరే ఎవరితో ఎంతవరకు ఉండాలో అంతవరకే ఉండాలి. వాళ్ళ మంచికోసం ఏదైనా చెబితే వాళ్ళ దృష్టిలో చెడ్డవాళ్ళం అవుతాం.
4. తన గురించి పదిమంది గొప్పగా చెప్పుకోవాలని అందరికీ ఉంటుంది. అలా అనుకునే వారు ముందు వందమంది గొప్ప వాళ్ళని గురించి తెలుసుకోవాలి.
5. సత్యంవైపు ఉండాలి అనుకుంటే వంటరిగా నిలబడటానికి సిద్ధంగా ఉండాలి.
6. జీవితంలో అనేక ఒడిదుడుకులు వస్తాయి. వాటన్నింటినీ ఎదుర్కొంటేనే జీవితం అర్థవంతం అవుతుంది.
7. తనమీద తనకు నమ్మకం లేనివాడు శవంతో సమానం.
8. కరుగుతున్న కాలానికి, జరుగుతున్న సమయానికి, తరిగిపోయే వయసుకి మిగిలిపోయే జ్ఞాపకమే మంచితనం.
9. అదృష్టం అంటే సిరిసంపదలు ఉండటం మాత్రమే కాదు. కడుపు నిండా తిండి, కంటి నిండా నిద్ర, ఆదుకునే ఆప్తులు ఉండటమే అసలైన అదృష్టం.
10. మనిషిలో అహం తగ్గితే ఆప్యాయత అంటే తెలుస్తుంది. గర్వం లేని రోజున ఎదుటి వారిని గౌరవించటం తెలుస్తుంది.
11. ఎప్పుడూ కాంతిని ఇచ్చే సూర్యుణ్ణి చూసి చీకటి భయపడుతుంది. ఎప్పుడూ కష్టపడే వాణ్ణి చూసి ఓటమి భయపడుతుంది.
12. నీకన్న పై స్థాయి వారిని చూసి లక్ష్యం ఏర్పరచుకో.
13. నీకు నువ్వు అర్థం కాకపోతే ప్రపంచంలో ఎక్కడా బ్రతకలేవు.
14. జీవితంలో

    సంపాదన పెరిగితే – ధనవంతుడవుతావు

    వయసు పెరిగితే – ముసలివాడవుతావు

    మంచితనం పెరిగితే – కలకాలం గుర్తుంటావు కాబట్టి మంచితనాన్ని పెంచుకో. పదిమందికి మేలు చెయ్యి. హాయిగా జీవించు.